శ్రీరస్తు.

# శశిరేఖాపరిణయము

## పీఠిక.



శ్రీకన్యామణిఁ గబ్బిగుబ్బయుగముం జిత్తంబునం జేర్చి తా
వీకన్ నన్నను వేడ్కఁ జూడ్కు లిడఁగా వ్రీడానుభావంబుతో
జోకన్ బయ్యెదకొంగుఁ జేర్చుసతితో సొంపొప్పఁగా నవ్వుచు
న్నేకాంతంబున ముద్దులాడుహరి మమ్మెల్లప్పుడున్ బ్రోవుతన్. 1

ఉ. పచ్చనికోకయున్ మెఱుఁగుబర్హిసుపింఛము నింద్రకార్ముకం
బచ్చుగ నీదుమేను జాలదాభ్ర మటంచని యొంది యంచ నీ
పచ్చినచంచలించె నని వల్లభుతో సరసోక్తులాడు నా
లచ్చి యొసంగు మా కెపుడు లక్షలు మీఱినద్రవ్యమూలముల్. 2

మ. సరసాలాపము లాడుగౌరిఁ గని హాసాస్యంబుతో వేడుకన్
గిరికోదండుఁడు కౌఁగిలించుకొనఁగా గ్రీవంబుపై హారముల్
కరమాశ్చర్యము గాఁగఁ జూచి చెలి సూకంపాయమానంబుతోఁ
గరము ల్మోడ్చిన నవ్వుదేవుఁ డొసఁగున్ గామ్యార్థము ల్ప్రీతితోన్. 3

ఉ. అత్తఱి నున్నజహ్నుసుత నాదలఁ జేర్చి నటించుచున్నయా
చిత్తజవైరిపై నలుకఁ జేయుచుఁ జారుసరోజలోచనన్
హత్తిన చేర్పుకొంటి విది నీతియె కా దని పల్కుగౌరి య
త్యుత్తమభోగసంపదల నొప్పుగ మాకు నొసంగుఁ గావుతన్. 4

చ. వెలయఁగ భారతీయువతి వీణెఁ గుచంబులఁ జేర్చి హాయిగా
సలలితరాగవైఖరులఁ జక్కఁగ గానముసేయ వేగమే
వలపునఁ గౌఁగిటన్ దిగిచి వాణిమనం బలరారఁ జేయు న
జ్జలజభవుండు మా కెపుడు సత్కృపతోడఁ జిరాయు పీవుతన్. 5

మ. కమలాకారముఁ జేయు నేత్రయుగశృంగారంబు దర్శించి యా
కమలామిత్రు సృజించు నాదుముఖసత్కాంతి న్విలోకించి స
ద్భ్రమరీబృందముఁ దీర్చుమత్కచరుచిశ్రీఁ జూచి యం చొప్పుగాఁ
గమలాసీనునిఁ జూచి పల్కుచెలికిం గావ్యంబుకై మ్రొక్కెదన్. 6

తే. లలితమై యొప్పులక్షణలక్ష్య మెఱుఁగ, సంస్కృతాంధ్రాదిపదములజాడ లెఱుఁగ
వాక్సరణి నాకు దయచేసి వసుధయందు, మమతతోఁ బ్రోవు మజురాణి మధురవాణి.

క. ఉదయంబున బ్రహ్మయునై, సదయత మధ్యాహ్నవేళ శంకరురీతిన్
ముదమున నస్తమయంబున, విదితంబుగ విష్ణువనెడువేల్పు నుతింతున్. 8

సీ. పంక్తికంఠునిశిరఃపంక్తిఁ ద్రుంచినరాముచిత్తంబునకు మెప్పుచేసె నెవఁడు
శంక లేకను వేగ లంకలోపలఁ జొచ్చి కొంకక లంకిణిఁ గూల్చె నెవఁడు
సీతామహాదేవిచిత్తంబు రంజిల్ల నినకులాగ్రణిముద్ర నిచ్చె నెవఁడు
రమణి యిచ్చినశిరోరత్నంబుఁ గొనివచ్చి యినకులాధిపున కందిచ్చె నెవ్వఁ

తే. డట్టిమతిమంతు సములు లే రని తలంతు, మహితగుణవంతు నెప్పుడు మది భజింతు
నసురవరులను విదళించునని నుతింతు, ప్రకటబలవంతు హనుమంతుఁ బ్రస్తుతింతు.

క. గౌరికి ముద్దులబిడ్డగు, వారిని విఘ్నాద్రి మేఘవాహను నంహో
దూరునిఁ గరిరాడ్వదనుని, సారెకు వినుతింతుఁ గావ్యసాంతముకొఱకై. 10

సీ. వల్మీకజన్ముఁడౌవాల్మీకి వినుతింతు బమ్మెరపోతనఁ బ్రస్తుతింతు
నన్నయభట్టును సన్నుతు ల్గావింతుఁ దిక్కన కేప్రొద్దు మ్రొక్కులిడుదుఁ
గాళిదాసాఖ్యుని ఘనముగాఁ బూజింతు భవభూతి నత్యంతభక్తిఁ దలఁతు
ముక్కుతిమ్మనభట్టుమూర్తులఁ గొనియాడి యలసానిపెద్దనామాత్యుఁ బొగడి

తే. యాత్మఁ గంకంటిపాపరాజాఖ్యుఁ గొలిచి, రంగనాథునిఁ గరుణాంతరంగుఁ దలఁచి
యెఱ్ఱప్రెగ్గడ మదిలోన నెంచి యెంచి, వందన మొనర్తుఁ గవిరాజబృందమునకు. 11

తే. పద్యతాత్పర్యజ్ఞానంబుఁ బరిహరించి, కవులు చెప్పినకావ్యముల్ చవులు సొరక
పొసఁగఁ బరిహాసకోక్తులఁ బ్రొద్దుఁ గడపి, చెలఁగుఁ గుకవుల సభలందుఁ జెప్పచేల. 12

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిసంస్మరణంబును గుకవితిరస్కరణంబునుం గావించి మఱియును, 13

## కర్తృవంశవర్ణనము.

సీ. బ్రాహ్మణార్చనయందు బహుశ్రద్ధతో నుందు రవనిలో రత్నాకరంబువారు
ఆంధ్రసంస్కృతభాష లతికించి కృతిఁ జేతు రవనిలో రత్నాకరంబువారు
సంస్థానముల రాజసభలందు నుతికెక్కి రవనిలో రత్నాకరంబువారు
పండితబృందంబులో వర్ణింపఁ దగుధీరు లవనిలో రత్నాకరంబువారు

తే. వసుధ రత్నాకరం బగువంశజలధి, కరయ రాకాసుధాకరుఁ డతఁ డటంచుఁ
గవులు వినుతింపఁగాఁ జాల ఘనత కెక్కె, రాజితంబుగ సంజీవరాజఘనుఁడు. 14

సీ. ఆతనితనూజాతు లవనిభృద్ధైర్యాత్ము లతులితప్రభ మోము లలరువారు
రాజవశంకరతేజులు నలరారు మంజులభాషణుల్ మానధనులు
బంధుజనాహ్లాదసింధుసమీచీనవిమలవాక్యస్ఫూర్తి వెలయువారు
ఏకపత్నీవ్రతం బేప్రొద్దు వదలక సన్మార్గవృత్తిచే సల్పువారు
తే. వెలఁగి సుజనులసౌఖ్యమె సేయువారు, భూమి నన్నృతంబుఁ బలుకని బుద్ధియుతులు
రమ్యమతి యగుహనూన్నరరాజకవియు, నతనితమ్ముఁడు నారాయణాఖ్యకవియు. 15

క. హనూన్నరరాజు వసుధలో, నన్నుతి కెక్కెనఘనుండు సంస్థానములన్
బన్నుగఁ దెచ్చినబహుమతు, లెన్నెన్నోగలవు వాని నెన్నఁగ వశమే ? 16

క. సత్యపథంబును వదలం, డత్యుత్తముఁ డనుచు మెచ్చి యామోదముతోఁ
బ్రత్యక్షంబుగ మారుతి, యత్యంతప్రియంబుతోడ నతనిం బ్రోచున్. 17

వ. అట్టి యాంజనేయప్రభావంబునం జేసి. 18

సీ. అతిచమత్కృతు లొప్ప నాశుకవిత్వంబుఁ జెలఁగి వాక్పటిమతోఁ జెప్పు నతఁడు
నవరసాలంకారనైపుణ్యమున మించి సకలప్రబంధముల్ సలుపు నతఁడు
అధికు నధముఁ జేయ నధము నధికుఁ జేయ ఘనమైనవాక్ఛుద్ధి గలుగు నతఁడు
అతిభీషణాకార మమరి యెల్లప్పుడు నబ్ధిగంభీరుఁడై యలరు నతఁడు
తే. విశదకరుణాకటాక్షసువీక్షణుండు, భట్టుమూర్తికి సరి యనఁ బరగునతఁడు
పలుకుపలికినఁ జక్కెరలొలుకునతఁడు, సుతులు నలువురతోనుండె సుఖముఁగనుచు.

తే. అతనితమ్ముఁడు మతిమంతుఁ డమితయశుఁడు, కావ్యనాటకాలంకారకవనవేద్యుఁ
డతులితామోదుఁ డాతని కరయ సుతులు, నలుసముద్రంబులనఁ బొల్చి వెలయుచుంద్రు.

తే. ఆంజనేయుఁడు వీరహనుమప్ప మఱియు, హనుమదాసును దత్తప్ప యనుమదీయ
జనకు లన్యోన్యసఖ్యైకశాలమతులు, కీర్తిఁ గాంచిరి యోగ్యసన్మూర్తు లనఁగ. 21

సీ. ఇలలోన నాంజనేయులవాచకస్ఫూర్తి మంజులస్ఫురణతో మధుర మగుచు
నేయేరసంబున నేరాగ మొప్పిన నారాగమున రసం బమరఁ జదివి
యాలకించినవారి నానందవార్ధిలో మగ్నులఁ గావించి మరులుగొల్పు
బంధుజనాళి సాధారణభావంబునఁ గన్నకుగా నొప్పి ఘనత కెక్కె
తే. నతనిసుకృతంబు వర్ణింప నగణితంబు, నతనిపరగౌరవం బెన్న నగణితంబు
నతనికీర్తిని వర్ణింప నగణితంబు, నతనిఘనమగుశేముషి యగణితంబు. 22

వ. అని మఱియును. 23

క. వీరహనుమప్ప మిక్కిలి, చారుతరం బైనమూర్తి సాహితియందున్
నేరుపు గలిగియు సంస్కృత, సారాంశము లెఱిఁగి యతఁడు సన్నుతి కెక్కెన్. 24

తే. హనుమదాసన విపరింప నాంధ్రమునను, దెలుఁగి కృతిసెప్ప నాతఁడే చెప్పవలయు
నితరకవులను హృదయమం దెంచనేల, ననుచు జనములు వినుతింప నతఁడు చెలఁగె.

క. దత్తప్పవిభుఁ జెప్పెద, నుత్తముఁ డతియుక్తిపరుఁడు నుర్వీస్థలిలో
హత్తిననీతిస్ఫురణన్, బొత్తిగ నరయుంగ విదురుఁ బోలినఘనుఁడౌ. 26

వ. అని వెండియు. 27

తే. హనుమదాసాఖ్యు గర్భసుధాబ్ధిచంద్రు, లవని సుబ్బన్న రామరాజనెడు సుతులు
రామరాజు భగీరథరాజుఁ బోలి, తీర్థకాండిఁ గొనితెచ్చి వార్తకెక్కె. 28

క. వరనాటకకావ్యంబులఁ, బరమాలంకారములను బండితుఁ డనుచున్
సరసులు సన్నుతిసేయఁగఁ, జిరతర మగుకీర్తిఁ గాంచి చెలఁగుచు నుండెన్. 29

వ. తదనంతరంబ. 30

తే. అగ్రజుం డైనయాంజనేయాఖ్యకవికి, భార్య లిరువురు పతిభక్తిఁ బ్రబలి రందు
నగ్రభార్యతనూజాతు లబ్జమిత్రు, పేరుతా వారినామము ల్వేరుకొందు. 31

క. చాయన్న వసుధలోపల, మాయన్నలలోన మేటి మానధనుం డా
చాయన్న చదువ వినియెడి, ధీయుంతు లానందవార్ధిఁ దేలుట యరుదే. 32

తే ఇతనితమ్ముఁడు చెన్నప్ప యింపుగులుక, జనులు వినుతింప సజ్జనసంగుఁ డగుచు
సతిసుతులతోడ వేడ్కతో జగతియందుఁ, బరగి గురుపూజ సేయు సద్భక్తి గలిగి.

తే. ఆంజనేయునిరెండవయాలు సుదతి, భాసురాంగి సరోరుహపత్రనేత్రి
శ్రీరమాదేవిసమ యని చెలులు వొగడఁ, దెలఁగు ముఖజితశశిబింబ శేషమాంబ. 34

తే. అట్టిశేషాంబగర్భసుధాబ్ధిచంద్రు, లప్పసామియు నప్పప్ప యొప్పుమిగుల
దారపుత్రాదులం గూడి ధరణియందుఁ, బరమసంతోషయుక్తులై ప్రబలి రందు. 35

క. అప్పప్ప యీప్రబంధముఁ, జెప్పెద నని పూని వేడ్కఁ జెప్పెను దీనన్
దప్పులుగల్గినఁ దీర్చుచు, నొప్పుగ సరిచేయరయ్య యోబుధులారా. 36

వ. ఇట్టులాంధ్రగీర్వాణనాటకాలంకారాది ప్రావీణ్యధురీణవిబుధచరణారవిందమకరందాస్వాదనేందిందిరాయమానహృదయుండును, క్ష్మాసురాశీర్వాదామోదసుశీలవర్తనుండును, ననవరతపుత్రమిత్రసహాయసంపన్నుండును నగువాతం డత్యంతసంతసంబునం బొదలుచుండ నొక్కనాఁటిరాత్రియందు. 37

సీ. హాటకపద్మరాగాదుల విలసిల్లు దంబుమీఱినకిరీటంబువాఁడు
మణిమయం బైనట్టిమకరకుండలరుచిప్రామిన భాసిల్లుమోమువాఁడు

మహనీయకౌస్తుభమణికాంతు లంతట రాణించు కంఠహారంబువాఁడు
చూడ్కికి మిఱుమిట్లు సొనిపెడువరనీలకంధరోజ్జ్వలచారుకాంతివాఁడు
తే. కనకచేలంబుఁ గట్టినకొనువాఁడు, మొలకనవ్వులు మోముపైఁ జిలుకువాఁడు
చాలఁ గృపగల్గి లోకంబు లేలువాఁడు, స్వప్నమునవచ్చి యెదుర సాక్షాత్కరించె.

వ. ఇట్లు ప్రసన్నుండయి మదంకితంబుగా నొక్కప్రబంధం బొనరింపు మనిన విని
సంతోషసాగరంబునం దేలి యప్పుడు. 39

## షష్ఠ్యంతములు.

క. పూతనప్రాణవిఘాతుకు, మాతకు సంతోష మొసఁగు మహనీయునకున్
జాతభవపాశహరునకు, భూతదయామానసునకు బుధవినుతునకున్. 40

క. దేవకీసరతనయునకును, భావజజనకునకు భక్తమందారునకున్
పావనపదయుగళునకున్, గోవర్ధనభారవహనగోపాలునకున్. 41

క. సరసిరుహలోచనునకున్, శరణాగతపోషకునకు జగతీశునకున్
పురుహూతాదివినుతునకు, పరిణయకేళీవినోదపరిపూర్ణునకున్. 42

క. అర్జునరథసారథికిన్, దుర్జయఖలదనుజవరులఁ ద్రుంచినహరికిన్
నిర్జరపూజితమూర్తికి, నర్జునతరుమూలహారికి నాగమనుతికిన్. 43

క. నరకాసురభంజనునకు, మురదానవమర్దనునకు మునివంద్యునకున్
సరసిజభవసన్నుతునకు, కరిమొర విని మకరిఁ ద్రుంచుకరుణానిధికిన్. 44

క. శ్రీసత్యారుక్మిణులతో, రాసక్రీడలను సలుపురాజాస్యునకున్
హాసాస్యంబున నెపుడును, దాసీదాసులను బ్రోచు ధన్యాత్మునకున్. 45

వ అంకితంబుగా నాయొనర్పంబూనిన శశిరేఖాపరిణయం బనుమహాప్రబంధంబున
కుం గథాక్రమం బెట్టు లనిన. 46



# ప్రథమాశ్వాసము.

---

## కథాప్రారంభము.

క. వినుసౌధకేతనావళి, జనితం బగువాతహాలిని జంచల మగుచున్
దినమున్ దినమణిహయములు, ఘనభీతిం జెందునట్టి గజపుర మమరున్. 47

తే. ఆపురం బేలుజనపతి యబ్జవైరి, వంశపరిపాలనవ్రతవర్తనుండు
దక్షతను బ్రోచుఁ బ్రజలఁ బారిక్షితుండు, గణుతికెక్కిన పేరోలగమున నుండి. 48

వ. ఇతిహాసశ్రవణకుతూహలుం డై వైశంపాయనమహామునిం జూచి యిట్లనియె. 49

క. శశికులుఁ డభిమన్యునకున్, శశిరేఖను బెండ్లిచేసి జలజాక్షాదుల్
వసుధను దా రెటుమెలఁగిరో, విశదంబుగఁ దేటపఱుప వినియెద ననఘా! 50

వ. అని యడిగినజనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 51

క. ఖ్యాతిగల శౌనకాదులు, ప్రీతిగ పరసూతు నడుగఁ బెంపలరంగా
నాతఁడు సెప్పిన సత్కథ, చేతోమోదంబు గాఁగఁ జెప్పెద నీకున్. 52

సీ. గోపురం బటుమాచి యాపురంబునఁ గల్గు గోపురంబుల ముద్దు గొనఁగఁ దలఁచుఁ
గోటకొమ్మలు సప్తఘోటకంబులఁ దాఁకుఁ దద్రత్నరుచి భానుఁ దారసించి
వైడూర్యతోరణావళులతో నలరారి చూడవేడుక యైన మేడ లమరు
నింద్రరత్నప్రభాసందీపితంబుగా నందమై విలసిల్లుమందిరములు

తే. నవ్యమణికాంతులను నొప్పునాట్యశాల, లమరుఁ గర్పూరవేదు లాయాస్థలంబు
దీధితిద్వారమౌక్తికతోరణంబు, భూమిరత్నంబు ద్వారకాపురవరంబు. 53

క. ఆప్పురియుప్పరిగలపై, నెప్పుడు నుయ్యాలలూఁగునింతులు శశినిన్
జొప్పడఁ గరములఁ బట్టుచుఁ, జప్పట లిడ సుధయుఁ దొరఁగి సౌధము లయ్యెన్.

క. అచ్చట మేడలలోపల, నచ్చరగం డ్లాడుచెలులయందము చూడన్
ముచ్చటమీఱఁగ నాపురి, లచ్చియు వసియించు వేడ్క రమణీయముగాన్. 55

శా. నీలాభ్రంబులఁ గాంచి పొంగుచు గజానీకంబుగా నెంచుచున్
వాలాయంబునఁ దాఁకఁ బూని పరుసన్ వాలంబు లల్లార్చుచున్
గాలన్ నేలను జీరి దంతముల నాకాశంబునం గ్రుమ్ముకాం
క్షాలోకించి సురాపగాబ్జముల వీఁకన్ బీకు మత్తేభముల్. 56

సీ. పాంసుజాలము గప్పి పవమానవేగంబు మంద మాయె నటంచు మదిఁ దలంచు
సింధుదేశస్థుల సైంధవగమనంబు సాధారణం బంచు సరకుగొనవు

హరిణప్రయాణంబు లాలోకమునఁ జేసి నేర్చుకొమ్మని తమనేర్పుఁ జూపు
మహి మనోవేగంబు మాకుఁ జెల్లు నటంచు జలధి దాఁటెదమంచుఁ జౌకళించుఁ

తే. కనకమణికాంతులను మించుకళ్లెములను, మోము లెత్తుచు వంచుచు మోదమలరఁ
బుచ్ఛములు మీఁది కెత్తుచుఁ బొంగరు మీఱి, కోటలనుదాఁటు నాపురిఘోటకములు

క. చతురాగమముల సీగిన, చతురాస్యు నిరాకరించు సరసమనీషన్
క్షితి షట్కర్మధురీణులు, నతులితవ్రతసాహసేంద్రు లవనిసురేంద్రుల్. 58

క. తేజోమదమున మించియు, రాజితరణరంగభూమి రాముని మాడ్కిన్
జేజేలు నుతింపఁగఁ బర, రాజుల మర్దింతు రెలమి రాజతనూజుల్. 59

క. తొమ్మిదినిధులుం దొరకిన, యిమ్మెలు గలరాజరాజు నెంచక మదిలో
సమ్మద మందుచు రత్నము, లమ్ముదు రావీటివణిజు లనవరతంబున్. 60

క. హరిభక్తియె యెల్లప్పుడు, గిరికొనఁగా నల్పుచుండి కృషితో నెపుడున్
సురుచిరధనధాన్యంబులఁ, బరితోషింతు రెల్ల పాదభవు లప్పురిలోన్. 61

క. భ్రూయుగము ముడివడంగా, నాకుంభములు చేతఁ బూని యతిభీకరులై
వేయుంగజంబులం బలిమిన్, గాసుము విలసిల్ల నుంద్రు ఘనభటు లచటన్. 62

సీ. పరిమళయుక్తమౌ సరసిజంబులు లేవె సరసులకే కదా సరసిజములు
పల్లవాధరి మంచి మల్లెపూ లున్నవే పల్లవాగ్రణుల కామల్లెపూలు
భువనమోహిని మంచికువలయంబులు లేవె యవి రాజులకుఁ జూడ నంపగించు
కరిగజగామిని యరవిందములు లేవె యరవిందములు నుండు నతనిచేత

తే. ఘనసుమంబులు గలవటే కంబుకంఠి, చిరతరంబుగ నున్న వాచెరువు కేగు
మనుచు విటులతో చాతుర్య మలరఁ బలికి, పువ్వులమ్మును రవ్వీటిపువ్వుఁబోండ్లు. 63

వ. మఱియు నప్పట్టణంబు రాజవిరాజితంబు గావున నత్పథంబును, ద్విజరాజభాసురంబు గావున నుద్యానవనంబును, భుజంగసంచారితంబు గావున భోగవతీపురంబును, జాంబూనదభూషితంబు గావున జంబూద్వీపంబును, నవరత్నదీపితంబు గావున రోహణాచలంబును, విబుధనివాసంబు గావున నాకలోకంబును, ధనవిశేషంబుగలది గావున లంకాపట్టణంబును, దివ్యభూజాతవంతంబుగావున నందనవనంబును శ్రీరామప్రకాశమానంబు గాన నయోధ్యాపురంబును బోలె నొప్పుచుండి మఱియును. 64

సీ. ఆపురిసౌధాళికాగ్రభాగంబుల కెంట ద్రావుడు ఇండిరీతు లరసి
పరమభయంబుతోఁ బాకారి గజరాజు పరువిడఁగాఁ గాంచి పద్మముఖులు
దరహాస..మొదవంగఁ బరిహాస మొనరింపఁ బురుహూతుఁ డాలించి పురముఁ గాంచి
యెంతచిత్రము చూడ నీపురం బని మెచ్చి సరసిజాక్షులరూప మరసి యరసి

తే. నాపురంబును హసియించు నీపురంబు, నమరకాంతల నిందింతు రబ్జముఖులు
నాహయంబును దోలు నీనగరహయము, లనుచు వినుతించి యింద్రుఁ డానంద మొందు.

ఉ. ఆపుటభేదనంబు ననిశంబును బ్రోచు దయాంతరంగునిన్
దీక్షితలేఖునిన్ హరిని దీనదయాళుని దేవదేవునిన్
గోపికలోలు నచ్యుతుని గోగణపాలుని వాసుదేవునిన్
భూపతు లాప్తులు న్మునులు భూసురులాదిగఁ గొల్చుచుండఁగన్. 66

క. కొంతతడ వుండి పిమ్మట, కంతునిగన్నట్టిసతిని గనుఁగొను వేడ్కన్
సంతస మలరఁగ మాధవుఁ, డంతఃపురభూమిఁ జేర నరిగిన నపుడున్. 67

క. వాకిటఁ గావలివారలు, ప్రాకటముగ ముందు నడువ ఫణిహారకులున్
జోకఁగ నిరుపార్శ్వంబుల, లోకేశ్వర గరుడగమన లోలాత్మ హరీ. 68

వ. అని యనేకప్రకారంబులఁ బ్రస్తుతించుజనంబుల మనంబు లలర బహూకరింపుచు
డెబ్బదిరెండుద్వారంబులుం గడచి పద్మరాగస్థగితసోపానంబులు చేరఁ బ్రాకుచు
మహారజితసౌధాంతరంబునకుం జని రుక్మిణీదేవితల్పంబున శయనించి యచ్చటనున్న
సఖీజనంబులం బనిచి రతిక్రీడావినోదంబులఁ గొంతతడ వుండి వెండియు నాస్థా
నంబునకుం జని రాజకార్యనిర్వాహకుం డగుచు దుష్టజననిగ్రహంబును జేయు
చుండె. 69

సీ. ఆమహాపురుషున కగ్రజుం డైనట్టి బలరామునకు ధర్మపత్ని యైన
కమలాక్షి రేవతిగర్భవాసమునందు జన్మించె నొకబాల జలధియందు
నిందిర యేచాయ నందమై జన్మించె నాలీల వేడ్కతో నవనియందు
శంబరాంతకు నవ్యశర మనఁ బొగడొంది బంగారుబొమ్మ నారంగు కెక్క
తే. ముదిత తలిదండ్రి కల్లారుముద్దు గాను, మఱియుఁ బినతల్లిగారికి మమత గలుగ
సారెసారెకుఁ బినతండ్రి సంతసిల్ల, మాటలాడును శశిరేఖ మధుర మొదవ. 70

పంచచామరము. సరోజపత్రనేత్రి రూపసంపదల్ నుతింపఁగా
ధరాధరుండు నేరఁ డంచుఁ దత్సఖీజనంబులున్
బరాకు చెప్పుచుండఁ గాను బాల స్త్రీజనాళికిన్
వరానురాగ మొప్పఁ జేసి వాసికెక్కుచుండఁగాన్. 71

సీ. చంచరీకచ్ఛాయ మించు నాసతికురుల్ విధురీతి ముఖకాంతి వెలయుచుండు
నాస చంపకసుమనాకారమున మించు దాడిమబీజము ల్దంతపఙ్క్తి
బింబోష్ఠి బాహువుల్ బిసనాళములఁ బోలు వృత్తకుచంబు లాబిత్తరికిని
హరిపదాకృతిఁ గాంచు హరిణాక్షిమధ్యంబు సరసిజాక్షిపిఱుందు సైకతంబు
తే. నలివయూరులు రంభల నతిశయిల్లు, కాహళులఁ గేరు జంఘలు కమలములను

పాదయుగములు శిరసించి వా దొనర్చు, జవ్వనంబున శశిరేఖ నివ్వటిల్ల. 72

వ. మఱియు నబ్బాలికారత్నంబు సఖీజనంబులతో వినోదంబుగా నాడుచు హంసలకుఁ దనగమనవిలాసంబు నేర్పుచు మహాశంతోషంబునం బొదలుచు దినదినప్రవర్ధమాన యై పెరుగుచున్నసమయంబున. 73

తే. దేవకీదేవి యొకనాఁడు దివ్యమైన, భవనమున నుండి కోదండుఁ బలిసి కొలువ సంతసంబున నుండెడుసమయమునను, ముచ్చటలరఁగ శశిరేఖ వచ్చి నిలిచె. 74

సీ. ఆవేళ దేవకి యత్యంతమోదముతో మనుమరాలిని గాంచి మమతమించి
తల్లి రా రమ్మని తనచేత గదియించి తొడలయం దిడికొని నిడుదలైన
కురులు దువ్వుచు గొప్పకొప్పిడి వేడ్కతో ముద్దాడుచున్నంత ముసలి హరియుఁ
జనుదెంచి భక్తితో జనని కీ మ్రొక్కినఁ గొడుకుల దీవించి కోర్కె మించి

తే. తనమనోభీష్టమెల్లఁ గలఁచి రామ, కృష్ణులను జూచి తనకోర్కె దీర్చువారు
చున్నదది మీకు వినుపింతు శుభమెసఁగ, దేవసుతులార యని దేవి పలికె నపుడు.

క. బాలామణి శశిరేఖను, బాలుం డభిమన్యుఁ డింద్రపౌత్రున కెలమిన్
మేలమునఁ బెండ్లిసేయుం, డీలాగున జాగుసేయ నేలా మేలా. 76

క. అనిన విని రామకృష్ణులు, మనుకొని నీయాజ్ఞ మాకు ముఖ్యం బనుచున్
వినయవిచారము లొప్పఁగ, జనని న్వీడ్కొనుచుఁ జనిరి సంతోషముతోన్. 77

వ. అని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 78

శా. ఇంద్రగ్రావచితోన్నతామితమణీహారాళసోపానభా
స్వచ్చంద్రప్రస్తరవేదికానికరమై సౌధాగ్రభాగోన్నమ
త్సాంద్రద్యోతితకేతనాంబరమరుత్సంపీడితాంభోద మై
యింద్రప్రస్థపురంబు భాసిలె మహాహేమోజ్వలాగార మై. 79

తే. ఆపురంబునఁ బాండవు లేపు రెఱిఁగి, సంతసంబున నుండెడిసమయమునను
బరమసాహసుఁ డైనట్టిపార్థుఁ జూచి, భద్రమత్తేభయాన సుభద్ర ప్రేమ. 80

మ. కరము ల్మోడ్చి మహాత్మ నామనవి మీకర్ణద్వయిం జేర్చు మీ
చరణాబ్జంబులచెంతఁ జేరి పరసన్ పద్మాసము ల్గొల్చితిన్
పరిణామంబున నన్నుఁ బంపు గురుని న్బద్ధాత్మ యాతల్లికిన్
సరసాగ్రేసరులౌ మదగ్రజుల నే సంతోషినై చూచెదన్. 81

క. సరికోర్కలు కడతేర్పను, వరియే మఱి లోకమందుఁ బరికింపంగా
మఱిఁ దలఁచి నన్నుఁ బంపిన, నతులితు లగు వారిఁ జూచి యతివేగము గాన్. 82

క. వత్తు నని విన్నవించినఁ, జిత్తము రంజిల్లఁ బాండసీహుఁడు సలిసిన్
హత్తుకొని రథము నందిచి, యుత్తము లగు వారి వెంట నూరిచి బసిచెన్. 83

క. చనిచని సుభద్ర చూచెన్, వననిధిమధ్యంబునందుఁ బరగెడుదానిన్
వనమాల నమరునగరముఁ, గనుఁగొని మత్తేభయాన కరములు మొగిచెన్. 84

వ. ఇవ్విధంబునఁ బురలక్ష్మికి ముకుళితకరాంబుజయై తదనంతరంబునఁ బురప్రవేశంబుఁ జేయుచున్న సమయంబున సుభద్రాగమనంబు విని తత్పురీజనంబు లెదురువచ్చి తోడ్కొని పోవ నంతఃపురంబునకుం జని తనరాక కెదురుచూచుచున్న జననీజనకులకు మ్రొక్కి తదగ్రజు లగు రామకృష్ణులకుం బ్రణమిల్లి వారివలనన్ దీవనలఁ గైకొనుచుఁ దనకుమారు నభిమన్యుని వారిపాదంబులకు మ్రొక్కించుచున్న సమయంబున.

క. చందురునిఁ బోలుముఖరుచి, కందర్పుని నిందసేయు కరచరణాంగం
బందందఁ జూచి మెచ్చుచు, నిందీవరనేత్ర లెల్ల రెంచిరి మదిలోన్. 86

తే. ఎన్నినోములు నోచెనో యీసుభద్ర, తీర్థయాత్రలు యెన్నెన్ని తిరిగినదియొ
పరమపుణ్యాత్మురాలమ్మ పార్థుపత్ని, యిట్టితనయునిఁ గని పెంచె నింపుగులుక. 87

క. అని యింతులు కొనియాడఁగఁ, దనతనయుఁడు ముద్దుసేయఁ దనపుట్టింటన్
జననీజనకులఁ గొల్చుచు, మన మలర సుభద్ర కొన్నిమాసము లుండెన్. 88

సీ. అంతట నొక్కనాఁ డరవిందలోచనుం డంతఃపురంబులో నంద మలర
నీలాంబరుఁడు తాను నిజపీఠములమీఁద వసియించి యుండఁగా వారికడకు
జననియు జనకుండుఁ జనుదేరఁగాఁ జూచి దిగ్గున లేచి యాదేవనిభులు
సాష్టాంగ మొనరించి సత్పీఠములమీఁద నుంచినసుతుల దీవించి రపుడు
తే. మాటలాడుచు సంతుష్టమానసములఁ, జెలఁగుచున్నట్టిభ్రాతలఁ జేరి తాను
గురుతరంబుగఁ బీఁటపైఁ గూరుచుండె, భాసురాకారగుణభద్ర యాసుభద్ర. 89

వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు నిట్లనియె. 90

క. సభయు లగురాజపుత్రుల, కభయంబు లొసంగి ప్రోచునర్జునసూనుం
డిభరాడ్రిపువిక్రముఁ డా, యభిమన్యునిఁ బోలువీరు లవనిం గలరే. 91

తే. అట్టిసౌభద్రుఁ డాకేళి నాడుచుండి, తల్లిదగ్గర కేతేర ధర్మరతుఁడు
కృష్ణుఁ డవ్వుడు సౌభద్రుఁ గృపను జూచి, కరము చేఁజేతఁ గీలించి కౌఁగలించి.

తే. శిరము మూర్కొని ముద్దాడి శ్రీధరుఁడు, తొడలపైఁ జేర్చి చుంచుఁ దా దువ్వుచున్న
సమయమున వచ్చి శశిరేఖ సంతసమున, సుందరాకారు నభిమన్యుఁ జూచియపుడు.

క. ఇనతండ్రి సేయుమాలిమి, ఘనమై వెలసిల్లుశశన గ్రక్కున దానున్
జనుదెంచి కృష్ణతొడపై, వనితామణి యిందురేఖ వసియించుటయున్. 94

క. అభిమన్యుఁడు శశిముఖి వా, రుభయులు నిరుతొడలయందు నుండఁగనినయా
నభినవపుణ్యము లగుగుల, ప్రభునకు వశమగునె పొగడఁ బార్థివనాథా. 95

వ. ఇట్లున్నసమయంబున. 96

క. ముద్దులు గులికెడునల్లుని, నద్దంబులఁ గేరుచెక్కు లమరినపుత్రిన్
ఒద్దికగలదంపతు లని, తద్దయుం ముదమంది హరియుఁ దాలాంకునితోన్. 97

చ. మనశశిరేఖ కర్జునకుమారునకు న్మది నెంచి చూడఁగా
ననఘులు కానికిన్ రతిక నవ్యముగా నొనగూర్చినట్లు నా
వనజభవుండు గూర్చె నిఁక వాసరము ల్గడపంగ నొప్ప దీ
జనములు సంతసిల్లఁగను జయ్యనఁ బెండిలి సేయు మగ్రజా. 98

వ. అనిన విని యప్పుడు. 99

ఉ. అన్నలు మాటలాడుసమయంబున లేచి సుభద్ర ప్రీతితో
నన్నయశాలి యైనముసలాయుధుఁ గన్గొని నీవుఅందియున్
న న్నిటఁ బంపుచుండి పరిణామము వేఁడి భవత్కుమారి యా
కన్నియ మత్సుతాగ్రణికిఁ గారుణికోత్తము పెండ్లిసేయవే. 100

వ. అని పార్థుండు మీతో విన్నవింపు మటంచుఁ జెప్పెనని సుభద్ర వెండియు. 101

క. అన్నా చిన్నకొమారితఁ, బన్నుగ నాసుతున కిచ్చి బహుమోదముతో
నెన్నఁడు పెండ్లి యొనర్తువొ, యెన్నఁడు వినఁ జెప్పు మనిన వికవిక నగుచున్. 102

క. అమ్మా యొంతటిదేలవె, కమ్మనివిలుకానిసాటిఘనుఁ డల్లునకున్
గొమ్మ నొసంగెద నీవున్, నెమ్మదిగా నుండు మమ్మ నీరజనేత్రీ. 103

తే. అనిన సంతోషమంది యయ్యంబుజాక్షి, అన్న యీమాట నిజ మని హస్తమందు
హస్తమిడుమన్న బలదేవుఁ డాసుభద్ర, పాణితలమునఁ గరమిడి పలికె మఱియు.

తే. మగువ నీప్రాణవిభుఁ డైనమధువసుతుని, వియ్యమునకంటె మాకింక వేఱే కలదె
తరుణి నీ వింతగా దీనిఁ దరుచ వేల, విశదముగ నీవు పార్థుతో విన్నవింపు. 105

వ. అనిన నప్పుడు. 106

క. రేవతిపతిమాటలు విని, భావం బలరంగఁ బార్థుపత్నియుం మఱియున్
దేవసుతుఁ డగ్రజుం గని, నీవచనమె వరము నాకు నిర్మలచరితా. 107

వ. అని యివ్విధంబున సుభద్రాదేవి జననీజనకులు మన్నన గావింప-సహోదరులు
బహూకరింపఁ బరమామోదంబున వర్తించుసమయంబునం దొక్కనాఁడు. 108

తే. దివిజరాచూలిపత్నికి దివ్యమైన, వజ్రమౌక్తికభూషణవస్త్రములను
దాసదాసీజనంబు లాతరుణి కొసఁగి, యబ్జలోచనుఁ డత్తింటికనిపెఁ జెలిని. 109

క. పరువిడువాజులఁ బూన్చిన, యరదంబున సుతుఁడు దాను నతివేగముతోఁ
గరిరాజగమన చని చని, పురుహూతసుతాదు లున్నపురముం జొచ్చెన్. 110

సీ. ఫుల్లాబ్జనేత్రి తత్పురముచెంతకు నేఁగి నగరులోపలఁ జొచ్చి నయముతోడ
నత్త కుంతీదేవి కత్యంతభక్తితోఁ జరణాబ్జములకును సాఁగి మ్రొక్కి
పాంచాలికిని జేతు లంచితంబుగ మోడ్చి వారిచే దీవన ల్వరుసఁ గాంచి
వెండియుఁ బీభత్సుఁ డుండుగృహముఁ జేరి పతిపాదములకుఁ దా నతు లొనర్చి
తే. ద్వారవతియందు జరుగువృత్తాంత మెల్లఁ, దెలుప విని పార్థుఁ డానందజలధిఁ దేలి
నీలవస్త్రంబుదాల్పుతో నెఱుక మనకు, వియ్యమందంగఁ జేసితే విద్రుమోష్ఠి. 111

తే. అనుచుఁ దనపత్ని బుద్ధికి నాత్మ మెచ్చి, వెలఁది తలిదండ్రులను జూచు వేడ్కఁ బోయి
మేలు చేసితి వని చాల లోలుఁ డగుచు, శ్వేతవాహనుఁ డావేళఁ బ్రీతిఁ బొంది.

క. ఇంతిని దోడ్కొని ఫల్గునుఁ, డంతకసుతభీమయమళు లాత్మజు లింతుల్
కుంతియు నున్నెడకుం జని, సంతోషితహృదయుఁ డగుచుఁ జయ్యన బలికెన్.

క. బలరాముఁ డతనితమ్ముఁడు, జలజాక్షుం డాత్మ నలరి సౌభద్రునకున్
గలశస్తని శశిరేఖను, సలలితముగఁ బెండ్లిసేయ సమయం బనుచున్. 114

క. విసరుహలోచనయెదుటన్, ముసలియుఁ గోవిందుఁ డిట్లు ముద మలరంగాఁ
బసగలుగ నాడుకొన్నా, రసదృశు లగువారిమాట లమృతము లగునే. 115

క. అనిన విని వారలందఱు, ఘనవేణి సుభద్ర సేయుకార్యము నెంతో
పనివడి వినుతు లొనర్చిరి, కనుగవ లానందబాష్పకణములు దొరుగన్. 116

వ. తదనంతరంబ. 117

క. అంతకసుతుఁ డనుజన్ములు, సంతసమున లేచి కొలువు సభ కేఁగినచోఁ
గుంతియుఁ గోడండ్రను దా, నంతఃపురి కేఁగె నప్డు జననీనాథా. 118

వ. ఇవ్విధంబున. 119

సీ. కౌంతేయు లేవురు సంతోషయుక్తులై బాహుబలంబుతో నాహవమున
శరచాపములఁ బట్టి పరరాజులను గొట్టి వారిచే నరిఁ గొంచు వసుధయందు
రాజసూయము చేసి రంజిల్లుకీర్తితోఁ బాకశాసనభోగపటిమ మించి
కృతయుగధర్మంబు క్షితితలంబున నిల్పి రాజ్యంబుఁ బాలించు రాజసుతుల
తే. సురుచిరంబైనవిభవంబుఁ జూడలేక, క్రోధమదయుక్తుఁ డైనదుర్యోధనుండు
కపటజూదంబునను రాజ్యమపహరించి, యడవులకుఁ బంపెఁ బాండవు లడవియందు.

మత్తకోకిల. ఉన్నవారని చెప్పఁగా విని యుల్లమందునఁ జింత న
త్యున్నతం బగువాహనంబుల నొప్పు గొప్పరథంబుపైఁ
దిన్నగా వసియించి సారథి తేరుఁ దోలఁగ వేగమే
పన్నగారితురంగుఁ డేఁగెను పాండుపుత్రులఁ జూడఁగాన్. 121

వ. ఇట్లు దామోదరుండు ద్వైతవనసమీపంబునకుం జని తద్వనంబున ఫలంబు లాహా

రంబులుగాఁ బుత్రమిత్రసహోదరులతో వనవాసంబు సేయుచున్నయజాతశత్రుం
గని యుచితోపచారంబుల వారిమనంబు లలరం జేయుచు ద్రుపదరాజపుత్రి యైన
ద్రౌపది నూరార్చుచుఁ గొన్నిదినంబు లుండి యొక్కనాఁడు. 122

సీ. పరమధర్మాత్ము లా పాండుపుత్రులఁ జూచి వారి యిట్టు లనియె మీ రాత్మయందు
వంతఁ గుందఁగ నేల వనవాససమయంబు గడచిన రాజ్యంబు గల్గు మీకు
దైవసహాయంబు తప్పదు గల దని మఱియును సుభద్రాభిమన్యు లిట్టి
యడవుల బహుకాల మిడుమలఁ బడనేల పంపుము ద్వారకాపట్టణమున
తే. కనిన గోవిందుమాటల కలరి పార్థుఁ, డాసుభద్రను నభిమన్యు నంపుటకును
సమ్మతించిన సారథి శౌరి చూచి, రథ్యములఁ బూన్చి వేగనె రథముఁ దెమ్ము 123

వ. అనిన విని దారుకుండు సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులం బూన్చి రథంబుఁ
దెచ్చినం జూచి గరుడధ్వజుండు కౌంతేయాగ్రజానుమతంబు వడసి సుభద్రాభిమ
న్యుల రథంబుపై వసియింప నియోగించి తానుం గూర్చుండి ద్వారకానగరంబునకుం
జని జననీజనకు లైన దేవకీవసుదేవులకు మ్రొక్కి పాండవులు ద్వైతవనంబునం
దున్నవా రని చెప్పి మఱియును. 124

క. చెల్లెలు సుభద్రహృదయం, బుల్లాసము గలుగఁ గోర్కె లొసఁగుచుఁ గృష్ణుం
డల్లుని లాలన సేయఁగ, నుల్లము రంజిల్లఁ దెలఁగుచుండిరి యచటన్. 125

క. అన్నలు పదినెలఁ దన్నుఁ, గ, మన్నన గావింప వగపు మాని ప్రహృష్టో
త్పన్నమతి సుతయుతంబుగ, వెన్నునితోఁ బుట్టువుండె వేడుక లలరన్. 126

వ. ఇట్లున్నసమయంబున. 127

క. శశిరేఖ యౌవనంబునఁ, బసిమికి నామోద మబ్బుపగిదిఁ దెలంగెన్
శశి నిరసించినయాస్యం, బసియాడెడుకొను నూరు లరటులు దలఁపన్. 128

సీ. కలకంఠికృంగారజలధిమధ్యంబునఁ గుచమందరాద్రిగాఁ గుమురుపరచి
వెలఁదివెన్నునఁ దూఁగువేణికరిత్రాటిఁ గరతలంబులఁ బట్టి కాంతు లూరఁ
దరచఁగా నమృతంబు తఱచుగా జన్మింప నరవిందశరుఁడు తా నాక్రమించి
నందులో సగపాలు నలివ మోవిని జేర్చి నిలచినసగపాలు నేర్పు మెఱయ
తే. నంద మమరంగ తనధనువందు నిలిపి, యవనిలోఁ దీయనిలుకాఁ డనంగఁ బరగె
నినుచు మగువలు వినుతింప నాత్మయందు, సంతసిల్లుచు నొప్పె నావంతిగమన.

సీ. పగడంబు వేడ్కతో జగడంబుకొన వచ్చి కఠినమై సఖముచేకట్లఁ బడియె
నింపైనరుచికెంపు నిగ్గున సరిరాక రంగుమీఱినయుంగరమున నిలిచె
పంబినప్రభ నొప్పుబింబంబుఁ బరికించి తులగాక స్రుక్కుచుఁ దొలఁగెఁ జోటు
కొంక మైనట్టియామంకెనకుసుమంబు జోడుఁ బూనఁగలేక వాడుఁ బూనె

తే. పల్లవంబులు నరిగాక పసరు లొందె, నన్నెలంతుక యచ్యుతాగ్రజునిపుత్రి
యచ్యుతస్తుని శశిరేఖ యధరమునకు, నన్నియును దుల్యరహితంబు లయ్యె నౌర. 130

క. అక్కలికి మొలకనవ్వులు, చెక్కులజిగి నన్నుతింప శేషునివశమా
చుక్కల నేలునఖంబులు, చక్కనిశశిరేఖ సాటిసఖులుం గలరే. 131

తే. అట్టిశశిరేఖ ముదముతో సైదువులకుఁ, బసుపు కుంకుమ గంధంబు కుసుమచయము
లందముగఁ దెచ్చియిచ్చినఁ గుందరదన, లంద ఱానందహృదయారవింద లగుచు.

క. మృగనేత్రయిందురేఖకుఁ, దగుమగఁ డభిమన్యుఁ డగుట తథ్యం బనుచున్
మగువలు పాటలు పాడఁగ, నగరాట్కుచ నవ్వుకొనుచు నామోదముతోన్. 133

సీ. అంతిపురంబులో నింతులతోఁ గూడి చదరంగ మాడెడుసమయమందు
నచటికి సౌభద్రుఁ డరిగిన శశిరేఖ రెప్పవేయక వానిరీతిఁ జూచి
యాత్మలోఁ బలుమారు నతనిరూపము మెచ్చి చిత్తజుఁ బోలుమేనత్తకొడుకు
చిత్ర మెట్లున్నదో బొత్తిగాఁ దెలియరా దవరిఁ బెండ్లాడునో యింద్రపౌత్రు
తే. చక్కఁదనమెల్ల ముద్దగా సంతరించి, అతిశయంబుగ నిర్మించినట్టియజుని
మెచ్చవలె నని మదిలోన మీననేత్ర, దర్పకాకారు సౌభద్రుఁ దలఁచి మఱియు.

క. చక్కఁదనంబున మిక్కిలి, చుక్కలగమికాఁడు నలుఁడు సురపతిసుతుఁడున్
జక్కలకొనికుమారుఁడు, చక్కెరవిలుకాఁ డటంచు జను లన విందున్. 135

క. వినివిని కర్ణేంద్రియములు, ననుదిన మానంద మొందె నర్జునసుతునిన్
గనుఁగొని నేత్రేంద్రియములు, ఘనమోదము నొందె ననుచుఁ గౌతుకమతి యై.
తే. మఱియు నభిమన్యుశృంగార మరసియరసి, ప్రస్తుతింపుచు మోహావిభ్రాంతినొంది
తనమనంబున మగనిగాఁ దలఁచితలఁచి, యితరకోర్కెలు గోర కాయింతి యుండె.

వ. ఇట్లున్నసమయంబున. 138

తరల. రతినిబోలినయిందురేఖను రాజసూనుఁడు చూచుచున్
మతిని దిగ్భ్రమ నొంది వింతగ మారుబారికిఁ జిక్కినన్
అతిశయం బగుమోహతాపము అంతరంగము నేఁచఁగా
హితులతోఁ బ్రతిమాటలాడక యేమిచేయుఁగ నేరకన్. 139

సీ. ఇభరాజగమనుఁ డాయభిమన్యుఁ డావేళ నూటాడుకోర్కెలతో నూర్పు లిడుచుఁ
బచ్చవిల్తుఁడు తన్నుఁ బట్టి బాధింపఁగా మచ్చుఁ జల్లినరీతి మందుఁ డగుచు
బలరామపుత్రి త న్వలరాజుకేళిలో నేలునో లేక తా నేలుకొనదొ
యేలకుండిన మారుఁ డేల వన్ననసేయుఁ దుంటవిల్లెక్కిడి వెంటఁ దగుల
తే. కనుచు మోహాంబురాశిలో నతఁడు మునిఁగి, తరుణిశృంగారమాత్మలోఁ దలఁచి తలఁచి
జలజలోచనుమర్మంబు దెలియ దనుచు, దొరకుమారుఁడు లేచి పూఁదోట కరిగె.

వ. మఱియు నప్పువ్వుఁదోఁటయందు మనోహరంబులైనమల్లెలు మొల్లలు జాజులు విరవాదివిరులు గోరంటలు దేవకాంచనకుసుమంబులు గొజ్జంగులు కేతకీదళంబులు చేమంతివిరువంతు లాదిగాఁగల కుసుమామోదంబులు గొని వినోదంబుగా మకరంద పానంబు సేయుషట్పదంబులు ఝుమ్మఝుమ్మనిమ్రోయఁ జలించుచుండెడు లతా కదంబంబులును, చంద్రకాంతపుమణిమయంబులైన సోపానంబులపై మనోరంజకం బుగా విహరించుచక్రవాకబకక్రౌంచసితమరాళంబులు సుస్వరంబులతో నాదంబు లు సేయ శతపత్రసహస్రపత్రకమలంబులతో నలంకృతంబులైనసరోవరంబులును, జంబూతరువిటపంబుల నల్లుకొనిన నేలకీలతావిశేషంబులజొంపంబులక్రిందఁ బద్మరా గస్థగితవేదికాస్థలంబున మనోభవసాయకంబుల కులుకుచు సౌభద్రుండు వసియించి యుండుసమయంబున. 141

క. అప్పుడు బలభద్రాత్మజ, ముప్పిరిగొను మోహ మాత్మ ముమ్మర మగుడున్
దప్పక నభిమన్యుఁడు చని, నప్పూఁదోఁటకును జేడె లందఱుఁ గొల్వన్. 142

రగడ. చనిచని చూడఁగ సహకారంబులు, కనుఁగొనఁగా బహుఖర్జూరంబులు
కంటికిఁ బ్రియ మగుకదళీతరువులు, పంటవలంతికి బహుభూషణమై
సలలితమై తగుజంబీరంబులు, ఫలముల నెప్పుడు భాసిలు పనసలు
మధురఫలంబుల మాకందంబులు, మది ముద మొదవెడు మాధవితరువులు
విమలోదకముల వెలసిన సరసులు, రమణీయము లగురాజీవంబులు
నిసుకదిన్నియల కిరవగు నేఱులు, నసమబాణునకు నానందముగాఁ
బరిమళయుత మగుబహుపుష్పంబులు, పరిపరివన్నెల పారిజాతములు
గలిగినతావులఁ గాంతలు గొల్వఁగ, హరిపుత్రిక పార్థాత్మజుకొఱకై
వేడుక లలరఁగ విహరింపుచుఁ దరు, నీడలు గనుగొని నెలఁతలుఁ దానున్. 143

సీ. ఆసమీపంబునం దతిరమ్యమైనట్టి సైకతస్థలి కేఁగి సంభ్రమమున
కలకలంబునఁ బల్కుచిలుకల నటుడించి వేడ్కతోఁ గూర్చుండి వీణె లెలమిఁ
గుచములపైఁ జేర్చి రచనగా గానంబు సేయుచు శశిరేఖ చెలులఁ జూచి
పంచమస్వరరాగపటిమ దప్పక మీరు పాడరే యనఁ జెలుల్ పాడుచుండ
తే. నావనంబున నుండినహంసములును, శారికాకీరపికములు చాలఁ బలుకఁ
బలుకు లాలించి సఖులచే చిలుక లన్ని, బలగములఁ జూచుకోర్కెతోఁ బాఱె వనికి.

క. పాఱినకీరంబులఁ గని, కూరిమి శశిరేఖ చిలుక గొబ్బునఁ జని తా
నారామసీమలోపల, భూరితరం బైనజాజిపూఁబొద ప్రాలన్. 145

క. కనుఁగొని సుభద్రసూనుఁడు, వినయంబున దానిఁ బిలువ విని యాశుకమున్
ఘనుఁ డభిమన్యుం గనుఁగొని, చను వమరఁగఁ జేతిమీఁదఁ జయ్యన వ్రాలెన్.

తే. కరముపై వ్రాలు శుకరాజుఁ గరముప్రీతి, సరవిలాలించిముదముతో శక్రపౌత్రుఁ
డోశుకీమణి యేరాచవనిత నిన్నుఁ, బ్రేమతోఁ బెంచెఁ జెప్పుమా రామచిలుక.
వ. అనిన విని. 148

క. మారునిఘోటక మిట్లనుఁ, గారుణికోత్తంస వినుము ఘనమగుమదితో
సీరిసుతాభవ శశిముఖి, కూరిమితో నన్నుఁ బెంచెఁ గురుకులతిలకా. 149

క. ఆరామసీమలోపల, నారామనుఁ బాసి నేను నతివేగముగా
నారామచిలుక లరయుచు, రా రాసుత నిన్నుఁ జూడ రమ్యం బయ్యెన్. 150

వ. అని. 151

క. ఈలీల శుకము పలికిన, బాలుం డభిమన్యుఁ డంత బహుమోదముతో
లోలాక్షిరాకఁ గోరుచు, నాలోకన సేయుచుండె నావనసీమన్. 152

సీ. కంజాక్షు లావేళ గానంబు చాలించి విమలసైకతముపై వీణెలుంచి
పాటిపోయినతమకూరిమిచిలుకల నరయంగ నేఁగిన సరసిజాక్షి
బలపుత్త్రి తనముద్దుచిలుక పోయినజాడఁ బోవుచు మల్లెపూఁబోదలు చూచి
జాజిపూలతలన్ని జలజాక్షి వీక్షించి దాడిమితరువు లాతరుణి గాంచి
తే. భూరిశాఖల విలసిల్లుపొగడతరుల, గుజ్జుమామిడిభూజాలపజ్జ నరసి
కదళికాకరు లరయుచుఁ గలికి కూర్మి, చిలుకఁ గానక చింతించి చెలులఁ దలఁచి.

క. భామలు రా కిటు మసలిరి, కాముని తురగంబు నరయఁ గనుపడ దోహో
యేమని చెప్పుదు నని యా, రామయు నారామసీమ రా రాసుతుఁడున్. 154

తే. చూచె శశిరేఖసొగసువాల్చూపుదాని, కొప్పు పైనుంచుసవరంపుఁ గుప్పెబిళ్ల
లాణిముత్యాలబావలీ లందమైన, భూషణంబులు మించుపూఁబోణి నతఁడు. 155

వ. ఇట్లు శశిరేఖం జూచి సౌభద్రుండు తనమనంబున. 156

క. సుందరి శశిరేఖకుఁ గల, సందిమశలవెంద్రుకలకు సమమగుచందం
బంద మగుమోముఁ గనుఁగొనఁ, గందర్పునిమేనమామగతి నలరారెన్. 157

ఉ. చూచితి నిర్జరాంగనల సుందరి నింద్రునిరాణిఁ జూచితిన్
చూచితి నాగకన్నియల సుందరరూపవిలాసవైఖరుల్
చూచితి రోహిణిన్ రతిని జూచితి యక్షసరోరుహాక్షులన్
చూచితిఁ గాని దీనిసరిసుందరరూపము లేదు వారికిన్. 158

మ. పురుహూతోపలకాంతు లీనురులతోఁ బూర్ణేందుఁ డీమోముతో
నరజాబిల్లి మెఱుంగునెన్నుదురుతో నబ్జంబు కందోయితో
మరుచాపం బరయంగ భూ్రయుగముతో మత్తాళి దృక్పాళితో
సరి గా పీచెలిసౌకుమార్య మిలలో శక్యంబె వర్ణింపఁగాన్. 159

క. అబ్బబ్బ యీసఖీమణి, గుబ్బచనుద్వయము స్వర్ణకుంభంబులొ లే
కబ్బురమగులికుచంబులొ, యుబ్బినసుమకందుకములొ యురుజక్కవలో. 160

క. చక్కనిమౌక్తికహారం, బక్కజమగురత్నపదక మమరినయురమున్
చక్కెరదిండివజీరుని, చొక్కపుసింహాసనంబు సొబగు వహించెన్. 161

క. నారీమణితొడ లనఁటులు, వారక నయశాలు లరయ వనితసుజంఘల్
వారిజముఖిపాదంబులు, సారసములు కాంతకొను సత్ప్రథ మయ్యెన్. 162

క. శశిముఖికుచభారంబున, నసియాడును గౌ నటంచు నబ్జభవుండున్
విశదమతి లోహలతికన్, బొసఁగించెనొ యనఁగ నారు పొలఁతికి నొప్పెన్. 163

వ. అని సౌభద్రుండు శశిరేఖరూపాతిశయంబుఁ గొనియాడుచున్న సమయంబున. 164

సీ. చెలియ ధమ్మిల్లంబుఁ జేర్చినవిరజాజి పరిమళం బంతటఁ బ్రబ్బికొనఁగ
నళికంబుపైఁ దీర్చుతిలకంబుకస్తూరి నిస్తులం బగుతావి రస్తుగురియ
నబ్జాక్షి గుబ్బల నలఁదినగంధంబు గుప్పున నామోద ముప్పతిల్ల
సాంబ్రాణిధూపవాసన మించుచేలాంచ, లంబు కుచద్వయి లఁని జార

తే. మరునిగజ్జెలగుజ్జంబు పరువువారు, కరణి నూపురములు గల్లుగల్లు మనఁగ
సొగసుయానంబుతో వచ్చుసుదతిఁ జూచి, కలకలంబునఁ బల్కె నాకలికిచిలుక.

వ. ఇట్లు పలికిన విని. 166

తే. శుకముక్తై చూచె శుకవాణి సొగసుకాని, నోము నిరసించురుచులనెమ్మోమువాని
సొగకన్నులవాల్జూపు చూచువాని, మొలకనవ్వులు మోముపైఁ జిలుకువాని. 167

క. వసుమత్కౌతుతనూజుం, గనుఁగొని ఫుల్లాబ్జనేత్రి ఘనలజ్జిత యై
చనిచని మాటున నిల్చిన, మనసిజుఁ డెదనాటెఁ బుష్పమార్గణచయమున్. 168

ఉ. అండజయానకు న్విరహ మగ్గల మై ధృతిదూలి యుత్సుకో
దండునిబాణవేదనను దద్దయుఁ మూర్ఛ మునింగి పిమ్మటన్
గొండొకవేళకుం దెలిసి కోమలి పార్థుని జూచి సిగ్గుతో
వెండియుఁ జిల్క నిమ్మనుచు వేఁడక యూరకయుండె నచ్చటన్. 169

వ. ఇట్లు లజ్జానన యై యున్న శశిరేఖం జూచి సౌభద్రుం డిట్లనియె. 170

సీ. సఖియ నీమోముతో సరిగాక రేరాజు మదిఁ గుంది మిక్కిలి మలినుఁ డయ్యె
నింతి నీకురులతో నించుకసరిగాక కువలయంబులు మూతగొనియెఁ బవలు
నతివ నీచెక్కుల కద్దము ల్సరిగాక రసయుక్తమై కొంత వసుధకెక్కె
కుంజరయాన నీకురులతో సరిగాక సారంగములగుంపు చనియె దివికి

తే. చూడ్కులకులోఁగి జింకలు సొచ్చెఁ బొదలు, యానమున కోడి సరసికి నంచలరిగె
నీవు పల్కెడిపల్కులు నేర్చుకొనక, చిలుక నిన్నాశ్రయించునే కులుకులాడి. 171

క. లలనామణి నీకుంగల, చెలువము గణుతింప నాదిశేషునివశమా
వలరాజు బారి కోర్వక, వలపున నీసొగసుఁ గొంత వర్ణన సేతున్. 172

సీ. నీఫాలతలముతో నెనగాక జాబిల్లి తొల్తనే వసుధలో దూష్యుఁ డయ్యె
నీకన్నుబొమలతో నెనగాక మరువిల్లు తుంటయై మిక్కిలి గంటులొదవె
నీమోవికాంతితో నెనగాక పవడంబు కాఠిన్యమై చేతికట్లఁ బడియె
నీమేనిచాయతో నెనగాక కనకంబు కమటంబులోఁ జొచ్చి కాక నొందె
తే. తెరవ నీకుచయుగముతో దీటు గాక, చటులతరం బైనజక్కవల్ పక్షులయ్యె
బోఁటి విను నీదుకౌనుతో సాటిగాక, గురుతరం బగుసింగము ల్గుహలు సొచ్చె. 173

వ అని వెండియుం. 174

శా. బాలా నీమృదుగానమాధురిమచే భావంబు నీరయ్యె ని
న్నాలోకించిననాడుమొదల్కలకు నానందంబు వర్ధిల్లె నీ
లీలోద్యానవిహారము న్గనిన హాళిం బెంచె నాచిత్త మో
లోలాక్షీ ననుఁ గాముబాణములకున్ లోఁజేయకే వేఁడెదన్. 175

క. అని సౌభద్రుఁడు పల్కిన, విని కోమలి సంతసించి విజయతనూజుం
గనుఁగొని హాసానన యై, వినయంబున నిట్టులనియె వీరాగ్రణితోన్. 176

ఉ. మేరుగిరీంద్రధైర్యజిత మేదినిఁ గామిను లెంచిచూచినన్
ధీరతఁ బాపనేర రని తెల్పి శుకంబును గాన కీవనిన్
వారిజనేత్రుల న్విడిచి వాసిగ వచ్చితిఁ జిల్క నీయవే
కారుణికాగ్రగణ్య యని కంజదళేక్షణ విన్నవించినన్. 177

చ. జలధరవేణిపల్కులకు సంతసమొంది సుభద్రసూనుఁ డా
చిలుకలకొల్కి కిట్లనియెఁ జిల్కలు నీవలెఁ బల్కనేర్చునే
కలికిరొ చిల్కపైమమత గల్గినఁ గైకొను సంశయించినన్
బలుమరు మాట లేమిటికిఁ బంకజలోచన కొంకి కేటికిన్. 178

క. ఆమాటకు బింబాధరి, మోమోటము మాని పల్కె ముదమలరంగా
సామాన్యమె పరపురుషుల, సామాన్యముఁ జేరి సఖులు సంభాషింపన్. 179

క. వలవనిసుద్దులు వల దీ,చిలుకను దయచేయుం డింక జేరెద సఖులన్
పలుమరు పల్కుట మానుం, గులధర్మముగాదు దేవ కోపింపకుమీ. 180

వ. అనిన విని సౌభద్రుం డిట్లనియె. 181

చ. పరపురుషుం డటంచు ననుఁ బల్కఁగ నో రెటు లాడె బాల్యమం
దిరువురఁ జూచి నీజనకు లిద్దఱుపల్కినపల్కు లన్నియున్

మఱచితె యౌవనం బనెడుమాంద్యము గప్పిన విఱ్ఱవీఁగుచున్
పరిపరిరీతులం బలుకఁ బాడియె నీకు సరోజలోచనా. 182

ఉత్సాహము. కోమలాంగి నిన్ను నేను కోరినందు కేమి నా
కామితంబు వ్యర్థమాయెఁ గాముబాధ కోర్వ నిం
కేమిసేతు మామకూఁతు రిట్టిమాట లాడ నీ
కేమిబోధఁ గల్గెఁ జెప్పు మింతి దీని దాఁచకన్. 183

వ. అని మఱియును. 184

క. పలుమరు నాతోఁ బల్కుట, కులధర్మము గాదటంచుఁ గొంకక నీవున్
బలికినపల్కులు మదికి, న్ములుకులవలె నాటె నింక ముచ్చట లేలా. 185

వ. అనిపల్కి సౌభద్రుండు తనమనంబున ని ట్లని విచారించె. 186

క. ఈతరుణి పల్కుపల్కులు, నీతిపథం బగుచుఁ దోఁచె నే నాడినవే
నీతికి బాహిర మైనవి, నాతికి బాణంబు లగుచు నాటక యున్నే. 187

తే. ఏను బల్కినపల్కుల కింతిమనసు, నొచ్చెనో దీని కేమనవచ్చు మదికి
సంశయము గల్గెనని సవ్యసాచిపుత్రుఁ, డేమితోఁచక తలయూఁచి మోముపంచి.

తే. విన్ననై యున్నయాతనివిధముఁ జూచి, యిందుముఖి చాల చింతించి యేను పనికి
నేల వచ్చితి నొక మేల యితనిచేతఁ, బట్టు పడె నని మదిలోన నిట్టు లనియె. 189

ఉ. చుక్కలఱేనిమైతళుకుఁ జూచి హసించును వీనిమోము యా
చక్రధన్వు లోపుగను సారెకు నొప్పును వీనిసుందరం
బక్కజమయ్యెఁ జూడ్కులకు నంబుజనేత్రలు వీనిఁ జూడఁ దా
మక్కరఁ గల్గి రమ్మనరె యంగజుకేళికి మాటిమాటికిన్. 190

వ. అని వెండియు. 191

సీ. నోరెఱుంగక నేను నుడివితిఁగా కొన్ని యందుకు హృదయంబు కందెనేమొ
ఏ నెంత నితనికి నిందుబింబానన ల్తముదామె వలతురు తలఁచి చూడ
నీగుణాఢ్యుఁడు నాకు నీశుఁడు గాకున్న సొగసేల చెలువేల సొమ్ములేల
పగకానిచిత్తంబు వగపెట్టఁగా నౌనె యనిపల్కు నంతలో నతనుఁ డేసె
తే. నపుడు వనితకు మోహ మత్యధికమైన, దరువుమాఱేల నని వచ్చి దద్దరిలక
దేవదత్తధరాత్మజుఁ జేరి చూచి, పడఁతి జేతులు జోడించి పలికె భక్తి. 192

క. నేను వచించినవాక్కులు, మానసమున నుండవలదు మామా యిపు డీ
దీనతఁ బొందఁగఁ బనియే, మానన మిఁక నెత్తి మాటలాడుము నాతోన్. 193

వ అదియునుం గాక. 194

క. రాజాస్యలపై మిక్కిలి, రాజులు మఱి కోపగింతురా గరయంగా

గాజులగుదరుక్ రోఁకలి, రాజితముగఁ బూనినట్లు రాజతనూజా. 195

వ. అని మఱియును. 196

సీ. వాసవివరపుత్త్ర భాసురంబుగ నీవు దేవి గావున్న నాదేహ మేల
చెలువొందఁ నినుఁ బెండ్లి చేసుకోవలె నంచు ననవరతంబు నే నాత్మఁ దలఁతు
బాగుగా నాకోర్కె ఫలిత మా యెన్నఁడో వనజసంభవుఁ డెట్లు వ్రాసినాఁడో
అది గాక నీచిత్త మరయంగ నెట్టిదో దేవ నామది కేమి తెలియ దనుచుఁ
తే. బలుకుశశిరేఖఁ జూచి సౌభద్రుఁ డాత్మ, సంతసిల్లుచు నిట్లను దంతిగమన
మనసుమర్మంబుఁ దెలియక మందబుద్ధి, నగుచుఁ బల్కితి నాపల్కు లాత్మనిడకు.

సీ. కలికి నీపైఁ గోర్కె గలిగినందుకు నీవు కరుణించకుండినఁ గంతుఁ డేల
మనసిచ్చు నామీఁద మార్గణంబులు పూని మది నాట నేసె నామాట వినుము
వసుధలో క్షత్త్రియవరులకు గాంధర్వపరిణయం బొకటొప్పుఁ బంకజాక్షి
అదియె యోగ్యంబుగా నగుపడె నిప్పుడు జాగు సేయఁగ నేల శంబరారి
తే. కేళిలో నన్ను నేలవే బాల యనుచుఁ, బలుకు సౌభద్రువలపు భావంబు దెలిసి
వెలఁది చరణంబు లొక్కింత వెనుక కిడుచు, దిట్టతనమున నతనితో నిట్టులనియె.

క. ధారుణిలో మగవారలు, ధీరు లటంచనఁగ వింటి దేవా నీ వా
ధీరగుణం బెడసేయుచు, నీరీతిం ద్వరపడంగ నీకుం దగునే. 199

క. వెడవింటివానిబాధకుఁ, దడ వోర్వఁగలే నటంచుఁ దత్తరపడుటల్
గడుఁ బరమాన్నము నార్పక, నుడుకుడుకుది జుఱ్ఱినట్టు లున్నది చూడన్. 200

క. పెద్దలు బలకృష్ణులు మన, కిద్దఱికిని బెండ్లి సేతు రింతకు లోఁగా
నిద్దఱుఁ గలసియుం ధరలోఁ, బద్ధతి రానేల వినుము పార్థతనూజా. 201

తే. మగువలకుఁ బెండ్లికిమున్ను పురుషకేళిఁ, జొచ్చి పురుషులఁ గలసిన మెచ్చ రవని
జనులు నిందింతు రటమీఁద జననిజనకు, లరివిధంబునఁ జాతురా యబ్జముఖిని. 202

క. తలవంపు లేలఁ జేసెదు, కులకాంతలలోన నాకుఁ గురుకులతిలకా
చిలుక నొసంగినఁ బోయెద, వలపున హృదయంబునందు వగవకు మామా. 203

వ. అని యివ్విధంబున. 204

ఉ. సుందరిపల్కుపల్కు లొకసొంపుగ వీనుల నాలకించి యా
నందపయోధిఁ దేలి నరనందనుఁ డాచెలి డాసి వేగమే
యిందునిభాస్య నీచిలుక నిచ్చెదఁ గొమ్మని చూపి డెందముం
గొందలమందఁగా నొడిసి కోమలిహస్తముఁ బట్టి యిట్లనెన్. 205

ఉ. శంబరవైరివేదనకు శక్యముగాదు మనంబు నిల్పఁగా
నంబుజనేత్రి నీదునధరామృతపానము సేయకున్నఁ బ్రా

ణంబులు దక్కనేర వని నాహృదయంబునఁ దోఁచె నన్నుఁ బ్రే
మంబున నేలవే రమణి మాటలతో నిఁక జాగుసేయకన్. 206

చ. కులుకుమిటారి నీబటువుగుబ్బలు నాయెద నుంచి వేడ్కతో
వలపునఁ గౌఁగిటన్ దిగిచి వాతెర నొక్కుచు ముద్దు లిచ్చి చ
క్కలిగిలిబెట్టి నామదికి గీల్కొన సంతసమందఁ జేసినం
జిలుకపటాణిరౌతు నొకచీరికిఁ గొందునె హంసగామినీ. 207

ఉ. చిత్తజుఁ డేయుతూపులకుఁ జిత్తము తత్తరపాటుఁ జెందుచుం
గుత్తుకబంటిమోహమున గ్రుంకుచుఁ దేలుచు నున్నవాఁడ నీ
చిత్తము నాదుభాగ్య మని జీరెను సర్జుపపుత్రుఁ జూచి యా
మత్తగజేంద్రయాన మరుమాటవచింపక నూరకుండినన్. 208

సీ. వెండియు సౌభద్రుఁ డుద్దండజయానతోఁ బలికె నాపై నింత పంతమేల
కంతునికేళికై యింతగాఁ బ్రార్థింపఁ గరుణ యావంతైనఁ గలుగ దబల
మామకూఁతురటంచు మది నమ్మినందుకు వృథసేయకే నన్నుఁ బృథునితంబ
యేలనే యనుమాన మేల నీలాలక యేలనే భయము యింకేల సిగ్గు
తే. ముదిత విను చల్లకై వచ్చి ముంత దాఁచు, చందమైతోఁచె నిఁకఁ జాలు జాటటంచుఁ
బలుకుసౌభద్రు తత్తరపాటుఁ జూచి, బిసరుహానన శశిరేఖ భీతిఁ బొంది. 209

వ. ఇవ్విధంబున నీలాంబరతనూజాత భయాకులచిత్తయై సౌభద్రునికరంబు విడిపించు
కొనుసామర్థ్యంబు లేమింజేసి తనమనంబున నొకయుపాయంబు చింతించి యిట్ల
నియె. 210

క. అదె నాసఖు లరుదెంచిరి, వదలు కరం బనుచుఁ బలుక వాసవిసూనుం
డెద చెడి కరము న్విడినఁ, బదములు వడకంగ నరిగి పణఁతులఁ జేరన్. 211

వ. ఆసమయంబున. 212

సీ. పంకజానన తన్ను బొంకించిపోయిన దశదిశ ల్వీక్షించి తాల్మి డించి
పెన్నిధిఁ గోల్పోవు పేదచందంబున విన్ననై పలుమారు వెచ్చ నూర్చి
విజయతనూజుండు విరహతాపంబుతోఁ దనకుఁ దా నాత్మలోఁ దలఁచె నపుడు
మాయ చేసి తొలంగె మరల రా దాకొమ్మ యేయుపాయము తోఁచ దేమిసేతు
తే. దానిముద్దులనగుమోము దానిసొగసు, దానిచూపులు బెళుకులు దానిహొయలు
దానికులుకులు నడకలు దానినడలు, కన్నులకుఁ గట్టినట్టుగా నున్న విపుడు 213

క. అంగజురణరంగంబున, నంగనకును నాకు నాల మబ్బినయపుడే
బంగరుకుసుమంబులతో, నంగజు నర్చింతు మదికి నానందముగాన్. 214

వ. సౌభద్రుం డివ్విధంబునఁ జింతింపుచు నుద్యానంబు వెలువడి మందిరంబుఁ బ్రవేశించె
నంత నక్కడ. 216

సీ. జేసితూపులవానిగాసి కోర్వఁగ లేక పరితాప మొందెడు భాసురాంగి
శశిరేఖ వీక్షించి జలజాక్షు లావేళ యెలనాఁగ చింతింపవలవదమ్మ
రాచకన్నియ లిట్లు రమణుల నెడఁబాసి పోవుట నుచితమే పువ్వుఁబోడి
యేమిచిత్రము గంటి వింతలో నీవింత చిన్నవో నేటికి సింహమధ్య
తే. మంచుపొదివినకమలంబుమాడ్కి నీదు, మోముపైఁ జెమటబిందువు లుదిత వొడమఁ
గారణం బేమి వేగమే కలతెఱంగు, బాల శశిఫాల చెప్పు మింకేల భయము. 216

క. అని పలికినఁ జెలికత్తెలఁ, గనుఁగొని తాలాంకపుత్రి కంపితమతితో
వినరమ్మా వివరించెద, వనజాయతనేత్రులార వారనిప్రేమన్. 217

సీ. ఈరామచిల్కకై యారామసీమలో జంట నెవ్వరు లేక యొంటి నరుగ
నాసమీపంబులో నభిమన్యుఁ డీశుకీమణిఁ జేతఁ బట్టుచు మధురమైన
వాక్కుల నానందవార్ధి మగ్నత నొంది ననుఁజూడ గాంక్షించుచునునిఁ జూచి
నంతలో నరపదియాశుగంబులు పూని కంతుఁ డిద్దఱిమీఁదఁ గదిసె నపుడు
తే. విరహతాపాతిశయములో విజయసూనుఁ, డంగ ముప్పొంగ ననుఁ బట్టి యతనుకేళిఁ
బ్రోవు మని చాల వేఁడఁగా బొంకుపఱచి, పిఱికితనమునఁ జనుదెంచి జేల నైతి.
వ. అని మఱియును. 219

తే. వానిరూపంబుఁ దలఁప నామానసంబు, చంచలత నొందె నిప్పు డాపంచశరుని
బారిఁ బడనీక వేగమే భూరికృపను, వాని ననుఁ గూర్చి కావరే వనితలార. 220

క. అని వివశత్వము నొందిన, కనకాంగిని జూచి సఖులు కళవళపడుచున్
మనమున భయవిహ్వలలై, వనితామణి కిట్టు లనిరి వారిజనేత్రల్. 221

క. లలనామణి నీమాటలు, విలసితముగ నాలకింప వింతగఁ దోఁచెన్
వలుపగువలపువహించుట, కలికీ ము న్నెఱుఁగ వేమె గాండివిసుతునిన్. 222

మ. అతఁ డేలాగునఁ బట్టె నీదుకర మావా యుక్తమే వానికిన్
మతిలే కుగ్రత నిన్నుఁ బట్టినపుడు న్మన్నించి రావచ్చునే
పతి నీతండ్రులు మాతలు న్వినిననీచందంబు దా మెత్తురే
యితరు ల్వల్కినమాడ్కిఁ బల్కఁ దగునే యిచ్ఛానుకూలంబుగాన్. 223

క. జడుఁడై సుభద్రసూనుఁడు, దుడుకున నినుఁ బట్టుకొనుట దూష్యము వానిన్
విడనాడి వచ్చినా వని, కడుపడిఁ జింతింపఁ దగదు కలికీ నీకున్. 284

క. అని మోహ మెడలఁ బల్కిన, విని కోమలి సిగ్గువొడమ విహ్వలమతితో
వనజదళాక్షులఁ గనుఁగొని, గనుఁగవ లరుణములు గాఁగఁ గామిని పలికెన్. 225

ఉ. కామినులార మీతెఱఁగుఁ గానక మిక్కిలి యాప్తులంచు నా
భామినులంచు నమ్మి బహుభంగులఁ జెప్పుచు మోసపోతి నా
కాముకు లింత చేసె దని కన్నుల నీ రిడి మాటిమాటికిన్
సామజరాజగామినులఁ జంద్రనిభానన చూచి యిట్లనెన్. 226

ఉ. కప్పురెలుంగుపాములను గారె మదిం దలపోసి చూచినన్
తప్పులుగావు బద్ధ మిది తామరసేక్షణలార పూర్వమం
దొప్పఁగ రాచకన్నియల కొక్కొకవేళల మోహ మబ్బినన్
జెప్పరె తోడిచేడెలకుఁ జేకొని వారలు కోర్కెఁ దీర్పరే. 227

క. మీవలెను బల్కు చెలు లీ, భూవలయమునందు లేరు బుద్ధులు దెలుపన్
గోవిదు లెంచుకు మీరే, భావజు మోహాబ్ధిఁ బడని పంకజనేత్రన్. 228

వ. అని మఱియును, 229

క. అదయ లయి నన్ను నాడిన, నది సమ్మత మగునుగాని యర్జునసుతునిన్
మదయుతులై యీతెఱఁగున, బదపడి నిందింప మీకుఁ బాడియె తలఁపన్. 230

వ. అని సఖీజనంబులతో రోహిణేశాత్మజ వెండియు నిట్లను. నళినీపాతఘాతంబునఁ బొరలుదానికిఁ గొరవిం జూపిన తెఱంగున పదనుగల మదనుబాణంబులఁ బరితపించు దున్నన్ను ములుకులవంటిపలుకుల నులుకిపడఁ జేసితిరని గద్గదకంఠంబులో యెలుంగెత్తి యేడ్చె నయ్యవసరంబున. 231

సీ. కలకంఠు లత్యంతకంపితహృదయలై కామపాలునిపుత్రి మోముఁ జూచి
హాస్యరసంబుగా నాడినవాక్యము ల్విరసంబుగాఁ దోఁచె వెలఁది నీకుఁ
బ్రాణపదంబైన పడఁతులపై నింత కోపంబు సేతురే సుందరదన
నీలాంబరుఁడు భామ నిన్ను సౌభద్రున కిచ్చి పెండ్లి జేయుం జేల చింత
తే. పరఁగ నాతనిసింగార పురసివంత, మరులు పుట్టుట చోద్యమే మందగమన
కుముదమిత్రుఁడు రోహిణిఁ గూడినట్లు, రతిసుఖంబున నేలవే రాజసుతుని. 232

వ. అనుచు నివ్విధంబున నచ్యుతాగ్రజునిపుత్రి నుల్లాసంబు లగుసల్లాపంబుల నూరార్చి శైత్యోపచారంబులు సేయ నొక్కింతసేపునకు సేదదేరి కలహంసగామినుల కరంబు లూఁతగొని యారామంబు వెడలి నగరు ప్రవేశించి మణిమయసౌధాంతరంబునకుఁ జని శయ్యాతలంబుఁ జేరి మోహతాపంబునం బొరలుచుండ నాళికరేఖ విధంబుఁ గనుంగొనఁ జాల కేఁగెనో యన సవిత్రుండు పశ్చిమాచలంబున కేఁగ నాసమయంబున. 233

చ. పదపడి సంధ్యకాలుఁ డనుపాంథుఁడు తృష్ణ హరింపఁగోరి తాఁ
జదలున నెఱ్ఱరేఖ లనుసాంద్రపురజ్జుల నుట్టిఁగట్టి తా

పదములమైనస్వర్ణకలశంబును వారిధి డించెనో యనన్
ముదమున బశ్చిమాంబునిధి ముగ్గెను దోయజమిత్రబింబమున్. 234

క. తమ్ములు ముకుళించెను భయ, దమ్ముగఁ జలియించెఁ జక్రదంపతు లీలో
కమ్మర నుండినవల్మీ, కమ్ములలోనుండి వెడలె ఘనసర్పములున్. 235

క. పగవాఁడు వార్ధిఁ బడె నా, వగ పాసెను బొమ్మటంచు వడిఁ బరువిడుచున్
జగతిని జోరులు మెచ్చఁగఁ, దగ ధనికులు భీతిఁ జెందఁ దమము చెలంగెన్. 236

క. వారిపద మనుకన్యామణి, మూఁపంబునఁ గాలవిటుని ముద మొనరింపన్
దిరముగఁ గొప్పున నుంచిన, విరులన నక్షత్రసమితి వెలసెం దరుచై. 237

చ. వెలయఁగ పూర్వదిక్సుదతి వేడ్కఁ జెలంగెడుమానసంబుతో
జలనిధి పెట్టెయం దిడినచారుతరం బగువజ్రరేకడిన్
మలినము వాయఁగా మెఱుఁగుమౌక్తికవారము చేతఁ బట్టి తాఁ
దల నిడుకొన్నదో యనఁగఁ దమ్ములశాత్రవుఁ డొప్పె తూర్పునన్. 238

క. కప్పురపుభరణి విప్పిన, చొప్పున బ్రహ్మాండమెల్ల సొంపువహింపన్
ఒప్పుగ వెన్నెల దోఁచెను, గుప్పున దస్కరులు భీతిఁ గుందుచు వగవన్. 239

తే. కువలయంబున నుండినకువలయములు, వృక్షచయమున వసియించుపక్షిచయము
గాన మొనరించుగంధర్వమానినులును, సంతసిల్లుచు నుండి రాసమయమునను. 240

ఉ. కంతుఁడు రం తొనర్చుచును గార్ముక మెక్కిడి నారిఁ దీసి య
య్యింతిని జేసిబాణముల నేసిన వెంటనె మందమారుతం
బంతనె వచ్చెనభ్రమున నంగజమాతులకాంతు లింతికి
స్వాంతగఁ దోఁచిన న్విరహవేదన కోర్వక బెగ్గడిల్లుచున్. 241

ఉ. భావజుఁ గూర్చి యిట్లనియె పంకజనాభునిపుత్రుఁ డంచు సం
భావన సేసి చెప్పుదురు భావజ నీ కది యొప్ప దుర్విలో
వారెఱుంగ కీవిధము వారిజనేత్రల తల్లి చెల్లెల
న్భావములేక పైఁబడిన భామలు తిట్టక మాననేర్తురే. 242

క. అద్రిధరతనయ నీ వా, రుద్రునిసెగకంటిచేత రూపము చెడియున్
విద్రుమరుచిరోష్ఠులపై, నుద్రేకము చూప నీకు నుచితంబగునే. 243

క. మామా యల్లుఁడు నొకటై, మామానముఁ బాపి వమ్ము మననీయరుగా
మీమీగర్వము లరయఁగ, కామా! విహరింపఁ గొంతకాలమె చెల్లున్. 244

వ. అని పల్కి శశిరేఖ చుక్కలఱేనిం జూచి యిట్లనియె. 245

సీ. చల్లనివాఁ డంచుఁ గల్లాడుటె గాని తాపంబు నొందించుపాపి వీవు
సత్ప్రభుం డని నిన్ను సరసు లెంచుటె కాని యాశ్రితతేజంబు లణఁతు వీవు

సన్మార్గుఁ డనిబుధు ల్పాటుచుందురుగాని సతులపాలిటి నిశాచరుఁడ వీవు
మాధవుమఱఁదనుమాట యొక్కటెగాని యక్కమందిరమున కహితుఁ డీవు

తే. ఇట్టివాఁ డని తెలియక యీశ్వరుండు, చేరదీసిన శిరముపైఁ జేరి తీవు
పరమదుర్మార్గుఁ డని నిన్నుఁ బలుకవలయుఁ, వసుధ సన్మార్గుఁ డందురే వారిజారి. 246

క. సర్వజ్ఞుశిరముఁ జెందితి, సర్వము నే నంచుఁ దలఁచి సంతసపడుచున్
గర్వమున సఖుల నేఁచిన, బర్వమునను నిన్నుఁ బట్టి పాము కరవదే. 247

క. చక్కరదిండిసి పాయితి, దిక్కెలివి నేఁడు నీకు దక్కెవ్వరురా
యొక్కొకపక్షములోనన్, చుక్కలగమికాఁడ తగదు సుదతుల నేఁచన్. 248

వ. అని మఱియును. 249

క. మలయానిల నీ వింతగ, జలజాక్షులమీఁద జలము సాధించినచో
ఫలమేమి వసుధలోఁ గల, పొలఁతులగోడేల నీకుఁ బో తెమ్మరమా. 250

వ. అని యివ్విధంబున మదనశశిసమీరుల నిందింపుచు విరహానలంబున గొర్వక దగ్గర నున్న సఖీజనంబులతో నిట్లనియె.

తే. వినుఁడు కంజాక్షులార నావిన్నపంబు, పార్థపుత్రుఁడు చెప్పినపలుకులకట !
వినక నిటు వచ్చి నే నెంత వెఱ్ఱినైతిఁ, దమ్మిబాణునిబాధకుఁ దాళలేను. 252

తే. అనిన శశిరేఖ నీక్షించి యబ్జముఖులు, పొలఁతి విజయాత్మజుని నీవు పొందినపుడు
మరుఁడు చంద్రుఁడుఁ గాదు నీమందిరమునఁ, గాచియుందురు వగపేల కమలనేత్ర.

క. మగువలు పల్కినపల్కులు, తగ నొప్పఁగ నాలకించి తత్తరపడక
వ్వగమాని యూరకుండెను, ఖగవాహునన్నపుత్రి గాసిం బడకన్. 254

భుజంగప్రయాతము.

మురారి న్రమానాథు మోదంబుతోడ, న్పరాకించు సద్భక్తిభావంబుతో న్మ్రొ
క్కి రాజీవనేత్రన్స్వకీయాదులం బ్రోచి రాజిల్లఁగాఁ జేయు శ్రీకృష్ణమూర్తి. 255

గద్య. ఇది శ్రీమత్సూర్యనారాయణకరుణాకటాక్షవీక్షణాలంకారసుస్థిరామృతవాక్య
జనిత కవిత్వ రత్నాకరవంశపయఃపారావారరాకాసుధాకర రాఁగేయాఖ్యతనూజ
అప్పప్పనామధేయ ప్రణీతం బైన శశిరేఖాపరిణయం బను మహాప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము.



# ద్వితీయాశ్వాసము.



రుక్మిణీమనోహర
కారుణ్యసుధానదీన ఖగరాడ్గమనా
వారిజభవనుతచరణా
క్షీరాంబుధిశయన భక్తసేవాదరణా. 1

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

ఉ. ఖండనపండితోత్తములఁ బాండుకుమారులఁ గాన కంపి వే
తండపురాధినాయకుఁడు ధారుణిసంతయుం నాక్రమించి యా
ఖాండలుఁ డేలుమాడ్కి మణికాంచనవస్త్రసమృద్ధి నొందుచున్
నిండుమనంబుతోఁ బ్రజల నేలుచునుండెను భానుతేజుఁడై. 3

ఉ. కర్ణుఁడు ద్రోణుఁడుం గృపుఁడుఁ గర్ణసుతుండును ధృష్టకేతుఁడున్
నిర్ణయవర్తి భీష్ముఁ డటనీతులు సౌబలదుస్ససేనులున్
వర్ణితవిక్రముండు శ్రుతవర్ముఁడు నాతనిబంధుమిత్రులున్
దుర్ణయుఁడైనసైంధవుఁడు దుర్దముఁ డాదిగఁ గొల్చియుండఁగాన్. 4

వ. ఇవ్విధంబునఁ గౌరవేశ్వరుండు విబుధగణసేవితుం డైన మహేంద్రుండునుంబోలెఁ బ్రతిదినంబును గొలువై మహాసంతోషంబునం బొదలుచుండె నంత. 5

సీ. చిప్పయెంబువ్వగా జీవించుజడదాల్పు పుండరీకాక్షునిపురముఁ జూడ
నరిగి శ్రీకృష్ణునియంతఃపురంబులోఁ బొడఁగాంచి యతనిచేఁ బూజలంది
కామపాలుఁడు తన్నుఁ బ్రేమతో లాలించి యర్చన సేయఁగా నతఁడు గొన్ని
వాసరంబులు నిల్చి వనజాక్షి శశిరేఖ యాకార మరసి తా నాత్మయందుఁ
తే. దలఁచె నీకన్య సౌభద్ర తరుణిగాఁగ, నంబుజాక్షుండు మదిఁ గొంచు నదియుఁ గాక
బలుఁడు దుర్యోధనునియందుఁ బక్షపాతి, గనుక నొకవింత గావింతు ఘనముగాను.

క. కలహము గానక యిట్లున్, కలకాలము ప్రొద్దుగడపఁగా వశ మగునే
బలరాముపుత్రికొఱకున్, కలహముఁ గావింతు ననుచు గలకల నగుచున్. 7

సీ. కనకాంగివిధము నే వినుపింప గురువరుం డతనిపుత్త్రునకుఁగా నడుగ వచ్చు
వచ్చిన బలుఁడు తా మచ్చిక లాలించి రమణీలలామను లక్ష్మణునకు
నిచ్చెద నని మాట యిచ్చుటొక్కటె గాని నడుమ విఘ్నముసేయు నగధరుండు
కయ్య మిందుక యైనఁ గలుగక పోరాదు దయ్యనఁ జేతు నీసాహసంబు
తే. చెడుగు దుర్యోధనున కైనచేటు కేల, వగవ నని యెంచి ముదముతో వారిజాక్షుఁ
జూచి పయనంబుఁ దెల్పుచు సొంపు మిగుల, నంబుజోద్భవసుతుఁ డేగె హస్తిపురికి.

వ. నారదుం డివ్విధంబునఁ బురప్రవేశంబు సేసి సభామంటపంబునఁ గొలువున్న సుయోధనునకుఁ దనరాక నెఱింగించిన నతండు పుత్త్రమిత్త్ర సహాయుండై యెదురేగి మ్రొక్కి లోపలికిం దోడ్కొనిపోయి కనకాసనం బిడిన రాజుం జూచి నారదుం డిట్లనియె. 9

చ. కరిపురనాథ పుత్త్రునకుఁ గాంతలకెల్లను క్షేమలాభమే
తిరముగ నీకునున్ శుభమె తేజిలుచుందురె బంధు లాప్తులున్
నిరతము ధర్మ మేమరక నీవాచరింతువె రాజ్యభారమున్
నరవర యంచుఁ బల్కు మునినాథుని జూచి ముదంబు నొందుచున్. 10

ఉ. కౌరవనాథుఁ డిట్లనియెఁ గారుణికోత్తమ విన్నవింతు నీ
ధారుణిరాజ్యమంతయును ధర్మపథంబునఁ బ్రోతు నెప్పుడున్
ఘోరిమి నాపయి న్నిలిపి గొబ్బున మీ రిట కేగుదెంచుచోఁ
బారుఁడ నాగృహంబు బహుపావన మయ్యె నటంచు వెండియున్. 11

ఉ. ఊరక రారు మీ రిటకు నుల్లమునం గలకోర్కెఁ దెల్పవే
నారద యంచుఁ బల్కు నరనాథుని జూచి మునీంద్రుఁ డిట్లనున్
ద్వారకనుండి నే నిటకుఁ దర్లితి నీ కొకవార్తఁ దెల్పఁగాఁ
గౌరవనాథ నాపలుకు కాదన కాపనిసేయు మింతలోన్. 12

వ. అది యెయ్యదియనిన. 13

క. బలరామపుత్త్రి గల దా, జలజాక్షికిఁ గల్గినట్టి చక్కఁదనం బీ
జలజభవాండములోపలఁ, గలరమణులయందు లేదు కౌరవనాథా. 14

ఉ. ఆచెలికొప్పును న్మఱియు నాచెలి మోమును దాని చూపులున్
ఆచెలి దంతపంక్తియును నాచెలి నవ్వులు దాని కంఠమున్
ఆచెలి బాహులు న్నురము నాచెలి చన్నులు దాని చిన్నెలున్
ఆచెలి మధ్యముం గటియు నాచెలి యూరులు జంఘలాదిగాన్. 15

క. అంగములను వీక్షించిన, శృంగారమె గాని దానిజిగి యేమందున్
బంగారువంటి దేహము, సింగారముఁ బొగడ వేయుశిరములు గలవే. 16

క. శశిరేఖాఖ్యం జెలఁగెను, శశిముఖి నీకోడ లైన సంపదలెల్లన్
పసిఁడికి బరిమళ మబ్బిన, దశ సన్నుతి కెక్కఁ గలవు ధరణీనాథా. 17

క. భాషణ లెందుకు సిరికిన్, భూషణ మై చెలఁగ ననుచు బోధింపుచు సం
తోషమున నరిగె కల్మష, శోషణుఁ డగుచోరు దిండి సురలు నుతింపన్. 18

క. మునివరుఁ డేగినపిమ్మట, జనపతి దుశ్శాసనాదిసహజన్ములఁ దాఁ
గనుఁగొని బ్రాహ్మణు లిర్వుర, ననఘుల రప్పింపుఁ డనిన నరనిమిషములోన్. 19

వ. రప్పించిన వా రరుదెంచి రాజుం గాంచి పనియేమని యడిగిన సుయోధనుం డిట్లనియె. 20

సీ. పుడమిదైవములార పుండరీకాక్షుని పురవరంబునకు మీ రరిగి మొదట
కానుపాలునకు మా క్షేమలాభముఁ జెప్పి పొసఁగ లక్ష్మణునకుఁ బుత్త్రి నడిగి
రమ్మని భక్తితో లాలించి మాంగల్యవస్తుచయంబులు నారి కొసఁగి
పనిచిన బ్రాహ్మణు లాభసురం బైనట్టి ద్వారకాపురి జొచ్చి శీరపాణి
తే. మందిరద్వారపాలుర ముందుఁ బనిచి, సెలవుఁ గైకొని విప్రులు గలసి యతని
వలన నర్చితులై తాము వచ్చుకార్య, సరణి వినుపింప సంతోషభరితుఁ డగుచు 21

క. చెల్లెలి కొసఁగినవాక్యము, నుల్లంబునఁ దలఁప కతఁడు నుల్లాసముతో
సల్లలితుం డగుకౌరవ, వల్లభుఁ డటు పంపియున్నవసుధామరులన్. 22

క. కనుఁగొని బలుఁ డిట్లనియె, న్మనుజేంద్రుని కార్యమునకు మాఱు వచింపన్
బని యేమి నాదుపుత్త్రికి, ఘనుఁ డా లక్ష్మణుఁడె మగఁడు గా కోరుఁ దగునే. 23

క. అల దుర్యోధనసుతునకు, లలనామణి నొసఁగి వేడ్క లగ్న మొనర్తున్
ఇలలో శీఘ్రమె శుభ మని, పలుకుదు రిఁక జాగుసేయఁ బని యేమనుచున్. 24

క. మతిమంతులైన వారో, హితులను బిలిపించి చాల నీశశిముఖికిన్
బతి దుర్యోధనసుతునకుఁ, జతురమతిం జూడరయ్య శశితారాబల్. 25

వ. అని పల్కిన తాలాంకుని వాక్యప్రకారంబునఁ బురోహితు లాలోచించి చంద్ర తారాబలంబులు నిరూపించుచు నేఁటి కెనిమిదివాసరంబులకు లగ్నం బని చెప్పిన విని నీలాంబరుండు పురపరిపాలకులం బిలిపించి వీడెల్ల శృంగారంబు సేయుఁ డని తా నాజ్ఞాపించిన మంచి దని పురం బలంకారంబు సేయించి శశిరేఖకుఁ బరిణయం బని చాటించి రాసమయంబున. 26

సీ. రాముఁడు తనపుత్త్రి రారాజసుతునకు మాట యిచ్చె నటంచు బోటులెల్లఁ
జెప్ప సుభద్ర తా నప్పుడె దిగులొంది చని పద్మనాభునిచరణములకుఁ
బ్రణతయై వింటివే బలరాముబిధమెల్ల రమణి యా శశిరేఖ లక్ష్మణునకు
నిచ్చెద నని చెప్పె నిదియేమి మాధవ దత్తాపహారంబు తగునె తనకు

తే. అనిన విని లేచి కృష్ణుఁడు నన్నుఁ జూచి
వెంట రమ్మని బలరాముని డిడిది కేఁగి
హితులఁ బౌరోహితులఁ గూడి యింపుగులుక
మాటలాడెను హలిఁ జూచి మాధవుండు. 27

శా. అన్నా నీ కిది ధర్మమా చెవినుమా యబ్జాక్షి యాపుత్రిని
న్మన్నీ చెల్లెలిపట్టి కిత్తు నచుచున్ మోదంబుతోఁ జెప్పఁగా
విన్నా రందఱు దీనిఁ దప్ప మనలన్యాత్మన్ను లంచాడ రీ
సన్నాహంబును మాని పార్థికి వెసన్ జంద్రాస్య నర్పింపవే. 28

క. మేనల్లుఁ డుండ నొరులకు, మానిని నీరా దటంచు మహిమాధిపులన్
దాన మఱొక్కరి కొసఁగుట, మానితగుణధన్య! నీకు మర్యాదగునే. 29

వ. అని యివ్విధంబున 30

తే. మాధవుఁడు పల్కు వాక్యము లొప్పదనక, కామపాలుఁడు హరిఁ జూచి కమలనాభ
పాండవులయందు మిక్కిలిపక్షపాతి, కౌరవులపేరు సెప్పఁగాఁ గాదు నీకు. 31

తే. కాంచనాంబర నీకు పెక్కు గాథ లేల, నరునిపుత్రున కే నీవు తిరముగాను
పాండవులు మనకు నత్యంతబాంధులైన, గౌరవులు నట్టిమిత్రులు గారె తలఁప. 32

తే. పంచభక్ష్యాన్నములు మాని పద్మనేత్ర, కుమతు లెవరైనఁ గసుగాయఁ గోరఁగలరె
రాజ్యవైభవమున నుండు రాజరాజు, సుతున కగుఁగాక అర్జునసుతునకేల 33

క. అని పల్కిన బలరామునిఁ, గనుఁగొని కనుఁ గెంజేసి కనలినమతితో
వనజదళాక్షుం డిట్లను, వినఁ జనిగా నట్టిపల్కు విహితమె పలుకన్. 34

తే. కుంతితనయునిపై నీకుఁ గోప మున్న, సుదతి నీకిష్టమైనట్టి కోట నిమ్ము
కవ్వడియు భీముఁ డిర్వురుఁ గదిసినపుడు, గౌరవులు నీవుఁ బడుపాటుఁ గందుగాక.

వ. ఇవ్విధంబునఁ గృష్ణుండు రౌహిణేయుని హేతుగర్భంబుగాఁ బలికి నిజసహోదరిం జూచి సుభద్రా తాలాంకుఁడు పలికినపల్కుల స్వారస్యంబు దెలిసెఁగదా నీకు దిక్కుగలచోటికి నరుగుమని డిగ్గన లేచి రథాంగపాణి తనమందిరంబున కేఁగె; నాసమయంబున. 36

సీ. తరుణి సుభద్ర యాతాలాంకు నీక్షించి అన్న నావిన్నపం బాలకింపు
వేడ్క నీతోఁ జాల వియ్య మొందెద నంచు నెమ్మదిలో నేను నమ్మియుంటిఁ
బతిబావమఱఁదులు ఫలము లన్నముగాఁగ వనవిహారము సల్పు వారిఁ దలఁచి
చింతించు చానుది చింతలెల్లను బాసి మీమన్ననలచేత మెలఁగుచుండు
తే. మగువ నిచ్చెద నని చెప్పి మఱచి నేఁడు, పరుల కిచ్చెద నని పల్క భవ్య మగునె
సిరియుఁ లేమియుఁ వెన్నెల చీకటరయ, వీరసాధన కరుణించి చేడె నిమ్ము. 37

వ. అదియునుం గాక. 38

ఉ. అన్నలుఁ దమ్ములుం జెలు లనాదరణంబును జేయుచుండిన
న్విన్ననవంబు జెందు టొకవింతయె మీ రిపు డాదరింపకన్
నన్ను నవజ్ఞ చేసినను నాకు నగౌరవ మత్తయింటిలో
సన్నుతిపాత్ర నీకిపుడు సాగిలి మ్రొక్కెద నాదరింపవే. 39

క. బలవైరిపుత్రుఁ డాత్మలో, పలుమరు నీవియ్యమునకుఁ బ్రార్థన సేయుం గన్
గలకాల మిదియె కోరికి, సలలితముగఁ బ్రోవుమయ్య సద్గుణవర్యా. 40

వ. అని మఱియు నిట్లనియె. 41

క. వనములఁ ద్రిమ్మరు చుండిన, జనకుల నెడబాసినట్టి సౌభద్రునకున్
వనజాక్షి నొసఁగకుండిన, జనసుత యపకీర్తి గాదె చయ్యన మీకున్. 42

క. అన్నా బలరాముఁడ నీ, కన్నను గతి లేదు మాకుఁ గనుకను మగువన్
విన్నాణంబగుపార్థికిఁ, జెన్నలరఁగఁ బెండ్లిసేసి చెలఁగుము తండ్రీ. 43

క. సిరి గలవారికిఁ జేడెల, నరయుచు నెవరైన నిత్తు రది ఘన మగునే
నిరుపేద కిచ్చి చేసిన, సరసాగ్రణి కిహముఁ బరము సౌఖ్యము లబ్బున్. 44

తే. పద్మలోచన శశిరేఖ భాసురాంగి, బాలుఁ డభిమన్యుసొమ్మని పలికి తీవు
మాధవాగ్రజ నమ్మించి మ్రానిమీఁద, చేయి విడిపించు చందానఁ జేసి తన్న. 45

వ. అని బహుభంగులఁ బ్రార్థించుసహోదరిం జూచి హలాయుధుం డిట్లనియె. 46

క. నవ్వుల కాడినమాటలు, జవ్వని నిశ్చయము సేయఁ జనునే నీకున్
బువ్వకు లేకిటుచిక్కియు, నవ్వా పెత్తనము సేయ నగునే నీకున్. 47

తే. పాలు చక్కెర జున్నుతో నోలలాడు, సతుల వేపాకుఁ దినిపించు చందమునను
గారవంబునఁ బెరిగినకమలముఖిని, నీకుమారున కడుగుట నీతి యగునె. 48

క. కూడును గోకయు లేకన్, చేడియ నీసుతుఁడు నీవుఁ జేరితి రిటకున్
సూడు నొకించుక లేకన్, కోడలు కావలయు నంచుఁ గోరెద వీవున్. 49

క. కోడలు లేకుండిన నీ, పోఁడిమి సంపదలు కొల్లపోయెడి నేమో
నేఁడు వచించెద విను మా, చేఁడియ నీసుతున కొసఁగుచెనుగులు గలరే. 50

సీ. ఉన్నవా రడవుల కున్నతై యుండఁగాఁ గన్నియ నిమ్మంచుఁ గలువరించి
పలికిన ఫలమేమి భాగ్యహీనుల కిత్తురే మగువ నిల నెవ్వరైన
ముం దేమొనర్చినబంధుత్వములు చాలు వెలఁది నీకెందు కీపెత్తి మాను
పరఁగ దుర్యోధనుబంధుత్వ మబ్బె మా కోరు లేల నీ వేల సరసిజాక్షి
తే. యెల ధర్మాత్ముఁడు భీముఁ డేల వినుము, పార్థుఁ డెందుకు కవ లేల భాసురాంగి
ద్రుపదేయాదు లిఁక నేల తలఁచి చూడ, నెందఱుండినఁ గురురాజు క్రిందు గారె. 51

వ. అని సీరాయుధుండు సుభద్రతో వెండియు నిట్లనియె. 52

క. పడఁతీ నీనందనునకుఁ, బడఁతుక నర్పింపఁజాలఁ బలుమరు నన్నున్
దడవినఁ గోపము మదికిం, బొడమెడు నని పల్కె తోడబుట్టుతో మఱియున్.

క. కురురాజు కెందరైనను, సరిగా రీవసుధలోన సంపదలందున్
పురుహూతుఁ డెంచి చూడఁగఁ, గరిపురమే స్వర్గపురము ఘనభోగములన్. 54

క. అలదుర్యోధనసుతునకు, లలనామణి నిత్తు రాజ్యరహితుల కొసఁగన్
జలజాక్షి పెక్కు గాథల, ఫల మేమిఁక లేదిపొమ్ము పని యే మిచటన్. 55

వ. అని యివ్విధంబున. 56

ఉ. తాల్మి యొకింత లేక బహుతామసుఁడై బలుఁ డాడువాక్యముల్
గాలములై మదిం దగుల గాండివిపత్ని మహేమి తోఁచకన్
జాలినవంతఁ గుంది వివశత్వము నొందినఁ జూచి గ్రక్కునన్
బాలిక నెత్తి పెండ్రుకలు పాపుచుఁ గొప్పిడి సేదదేర్పఁగాన్. 57

వ. ఆసమయంబున దేవకీవసుదేవు లాబలభద్రుం జూచి రామా! సహోదరి కొసంగిన వరంబుఁ బాలించి సౌభద్రునకుఁ గన్యాదానంబు సేయుం మనినవచనంబు లనాదరణంబు సేసి పెడచెవులం బెట్టి యూరకుండె నంత సేదఁ దేరి సుభద్ర రోషంబున హలాయుధుం జూచి యిట్లనియె. 58

చ. తరుణి నొసంగవే యనుచుఁ దద్దయు భక్తితో వేఁడుకొన్నచోఁ
గరుణ యొకింత లేక ననుఁ గారులు జీరుచు మాటిమాటికిన్
సిరిగలవారి నెన్నుచును సింధుగభీరుల నింద సేయుచున్
బోరిఁబోరిఁ బొంగు పొంగితివి పొంగినపాపము నీకుఁ దప్పునే. 59

క. విరివిగఁ జెలి నిచ్చెద నని, మరు లించుకఁ గలుగఁ జేసి మాటలు దప్పే
నరునకు నరకమెగాకీ, సిరి వెన్నల చీఁక టనుచుఁ జెప్పరు రార్యుల్. 60

తే. సింహవిక్రముఁ డగుపాండుసింహమునకుఁ, బత్నినై నేను నడవులఁ బతిని బాసి
నీవె గతి యని బ్రతిమాలి నీగృహంబు, పంచఁ జేరినఁ గద యింతపలుచ నైతి. 61

తే. కడుపుకూటికి నీకొంపఁ గాచియున్న, నీతిమాలినమాటలు నీవు పలుకఁ
జెల్లెలను గాన బలరామ చెల్లెఁ గాక, పాండవులు విన్న నాయన బ్రదుకనీరు. 62

వ. అని వెండియు నిట్లనియె. 63

సీ. కొడుకు లెస్సైన యున్నఁ గోడ లెందుకు రాదు నీపుత్త్రి నీకున్న నిలువఁబోదు
గంతకుఁ దగినట్టి బొంత లోకమునందుఁ గల్పించె మొదటనే కమలభవుఁడు
నుదుట వ్రాసినవ్రాలు పదపడి తప్పింప నీవెవరు నేనెవరు నీతిరహిత
సదయాత్ముఁ డని నిన్ను మదిలోన నమ్మితి కఠినహృదయుఁ డంచుఁ గానవైతిఁ

తే. గలిమి గాంచిన యన్నతంబుఁ బలికి నీవుఁ, గౌరవులు నేకమై మమ్ముఁ గాన గనిపి
రామరాజ్యంబుగా మీరె రాజ్య మేలుఁ, డనుచు నేడ్చుచు నరిగె నయ్యంబుజాక్షి.

క. ఆసమయంబున సాత్యకి, రోషముతో బలునిఁ జూచి రొప్పుచుఁ బలికెన్
వాసవిసుతునకుఁ బుత్త్రిని, వాసిగ నీవియ్యకున్న వారికిఁ గొదవే. 65

క. ధర్మజభీమార్జునులను, దుర్మదమున నిందచేసి దుర్యోధను దు
ష్కర్ముని వినుతించుట నీ, కర్మమొ బలరామ లేక గర్వమొ తలఁపన్. 66

క. సమయాబ్దంబులు గడచిన, విమలాత్మకులైన పాండవేయులు వరుసన్
సమరములోఁ గౌరవులను, సమవర్తిపురంబుఁ జేర్చి సంపద గొనుటన్. 67

క. తప్పదు సంకర్షణ నీ, కొప్పదు దూష్యంబు సేయ నుర్వీశుల వా
రెప్పుడు ధర్మపథంబును, దప్పక పాలింతు రఖిలధరణీతలమున్. 68

వ. కావున సత్యాత్ముల దూషింపుచు దుష్టాత్ముల భూషించు నీజిహ్వ వెక్కువరియ
లై పోకుండుట విచిత్రం బని బలుకుశినివరునివాక్యంబులు వినక నతనికిఁ బ్రత్యు
త్తరం బీయక దుర్యోధనుం డనిపినక్షాసురులతో నిట్లనియె. 69

చ. వినఁ జవిగానిపల్కు లవి వీనుల విందురె విప్రు లార యీ
శినివరుఁ డార్యసన్నుతుఁడు శ్రీధరుఁ డిర్వురు సారెసారెకున్
వనముల నున్న పాండవుల వర్ణన చేయుచు కౌరవేంద్రుఁ దా
మనవరతంబుఁ దిట్టుటకు నాదియు నంత్యము లేదు చూడఁగాన్. 70

మ. అలదుర్యోధనుసాటిరాజు లిలలో నందంద వీక్షించినన్
గలరా రాజమృగేంద్రునందనునకుం గంజాక్షి నర్పించెదన్
దలబ్రాల్వేళకు బంధువర్గములతో దామందఱున్ మిత్రులున్
బలువేగంబునఁ దోడితెం డనుచు నాబ్రాహ్మణ్యులం బంపినన్. 71

వ. తదనంతరంబ సుభద్ర హాలాయుధుండు పలికినపల్కులు ములుకులై మనంబు
వ్రణంబుఁగావింపం దద్వేదనచే శయ్యాతలంబుఁ జేరి చింతించుచున్నసమయంబున
సూర్యాస్తమయం బగుటయుం మందిరంబునకుం జని చింతాకులచిత్తయై యున్న
జననిన్ సంకర్షణుండు పల్కినచందంబును లక్ష్మణునకు శశిరేఖ నొసంగినవిధంబు
దెలియంగక మాతం జూచియిట్లనియె. 72

క. ఘనమగుచింత వహించితి, వనముల మాతండ్రిగారివార్తలు చెవికిన్
వినఁబడిన దాఁటవల దో, జననీ వినుపింపు మమ్మ చయ్యన నాకున్. 73

వ. అనిన సౌభద్రునకు సుభద్ర యిట్లనియె. 74

క. అబ్బీ నే నెఱుఁగను నీ, యబ్బలజో లేల వినుము హాలసాధనుఁడున్
డబ్బుల కాసవహింపుచుఁ, దబ్బిబ్బులు నేసెఁ బలుకు దత్తము నేఁడున్. 75

వ. అది యె ట్లనిన. 76

సీ. రారాజుసుతునకై రౌహిణేయాత్మజ నడుగుటకై యిద్ద ఱగ్రజన్ము
లరుదెంచి వేఁడఁగా నందుకు బలరాముఁ డానందభరితుఁడై మీననేత్ర
నిచ్చెద నని మాట యిచ్చినఁ దగ దంచు నచ్యుతుం డాడిన నతనిపలుకు
వినఁ డాయె నంతలో వేఁడుకతో నేను ప్రార్థన సేయఁగా బలుఁడు నన్నుఁ

తే. గూటిపేదవు విను నీకుఁ గోడ లేల, నడవిజోగుల కరయంగఁ బడఁతు లేల
పొసఁగ దిటువంటిసుద్దులు పొమ్మటంచుఁ, బలికి వెండియు నొకకొన్ని పలికె వినుము.

తే. అవనిఁ బదివేలపాండవు లైనఁగాని, ఘనుఁడు దుర్యోధనునిసాటి గా రటంచుఁ
బలికి కురురాజు పంపినబ్రాహ్మణులను, నెట్టకేలకు వీక్షించి యిట్టులనియె. 78

వ. నేఁటి కెనిమిదివాసరంబులకు లగ్నంబు నిశ్చయం బని యుగ్గడించి క్ష్మాసురులం
బంపె నని చెప్పి మఱియును. 79

క. వెయ్యేటికిఁ దనయుఁడ నీ, యయ్యలు వనవాసు లగుట నది మది నిడకన్
వియ్యము గలదని వచ్చిన, నెయ్యము చెడ నాడె నన్ను నీలాంబరుఁడున్. 80

మ. గ్రహచారంబును జాలనప్పు డెవరుం గార్పణ్యులై యుందు రీ
మహనీయుం డగురౌహిణేయుఁ డిటుల న్మర్యాదహీనంబుగా
బహువాక్యంబుల నన్నుఁ బల్కెఁ దనయా భాగ్యంబు లేకున్నచో
విహితుల్ శత్రువు లంచుఁ బల్కుపలుకు ల్విన్నావొ లేవో గదా. 81

క. కలిమి గలవారిపక్షమె, పలుకుదు రెవ రైనఁ గాని భావింపంగా
నిలలోఁ బేదలపక్షము, కలలోనం బలుక రనుచు ఘను లన విందున్. 82

క. కావునఁ గౌరవరాజును, వేవిధముల వినుతిజేసి వేదిజపతినిన్
పావని మొదలగుపాండవు, లేవుర నిందించి సుదతి నీలే దనియెన్. 83

వ. అనిన విని సౌభద్రుండు కోపోద్దీపితమానసుం డగుచు కటతటంబు లదర నిటలం
బునఁ జెమటకణంబులు పొడమ నేత్రంబు లరుణంబులు గావించి పటపట పండ్లు
గీటుకొని రోమకూపంబుల ధూమంబు వ్యాపింప భ్రూయుగంబు ముడిబడంజేసి
సుభద్రం జూచి యిట్లనియె. 84

తే. జనని హలినిన్నుఁ బల్కినచెనఁటిపల్కు, లేల చదువఁగ వినఁగ నా కింపుగాదు
కర్ణములు రెండుతూటులు గట్టె వినుము, తల్లి నావంటిసుతుఁ డుండఁ దగునె పగవ.

క. అది గాక రణగరిష్ఠుఁడు, పదిపేరులు గలిగినట్టిఫల్గునుఁ డరయన్
ముదమునఁ బతి యైయుండియుఁ, బదపడి చింతింప నీకుఁ బాడియె తల్లీ. 86

చ. కుటిలతరప్రచండరిపుకోటులఁ ద్రుంచి వనాంతరంబులోఁ
బటుతరవిక్రమాఢ్యు లగుపాండవులేవురు సంతసంబుతో

దిటముగ నున్నవా రనుచు దివ్యమునీంద్రులు చెప్ప విందు నీ
కటకట యెందు కీబలుఁడు కన్నె నొసంగకయున్న మేలగున్. 87

వ. అని మఱియును. 88

చ. పడఁతి నొసంగలే దనుచుఁ బల్కినపల్కులు చెల్లఁగాక యా
చెనుగులఁ గౌరవాధముల సీరి నుతింపుచుఁ బాండుపుత్రులం
గడువడి నిందసేయుటకుఁ గారణ మేమని పల్కి యల్కతో
నొడలున ఘర్మబిందువులు పుట్టఁగ నిట్టని పల్కె వెండియున్. 89

క. సదయుఁడు హరి సాత్యకియున్, ముదమొదవఁగఁజూచుచుండ ముసలాయుధునిన్
బద నగుశరముల చేతన్, మద మడఁచెద నన్నుఁ జూను మాతా యిపుడున్. 90

క. అని ధను వొకచేఁ గైకొని, ఘనశరముల నొక్కచేత గ్రక్కునఁ గొనుచున్
దినకరతేజస్స్ఫురణన్, గను లెఱ్ఱఁగఁ జేసి లేచె కవ్వడిసుతుఁడున్. 91

పంచచామరము. కిరీటిసూనుఁ డట్లు లేచి కిన్కతో వచించె హా
విరోధి యాసుయోధనుండు వీరు నేకమే కదా
విరోధు లైరి యాదవు ల్వివేకహీను లందఱిన్
పరేతరాట్పురంబుఁ జేర్చి పాపుకొందుఁ గోపమున్. 92

వ. అని వెండియు. 93

క. పార్థుఁ డొసంగినవిద్య కృతార్థత నొందింపనున్న ధరణీస్థలిలో
సార్థకమే విను తల్లీ, ప్రార్థించెద సెల వొసంగు పనియే మిచటన్. 94

క. తఱియైనవేళ శత్రులఁ, బరిమార్పకయున్న ధనువుబాణము లకటా
పౌరిఁబోరిఁ గాల్పనె నేఁ డీ, హరి సాత్యకిఁ దప్ప నితరులందఱిఁ గూల్తున్. 95

వ. అని యివ్విధంబున. 96

క. రుద్రునివలె వెడలిన సౌభద్రుని వీక్షించి జనని భయమానస యై
భద్రగజవైరివిక్రమ, యుద్రేకము సేయ నేల నుడుగుము తండ్రీ. 97

వ. అదియునుంగాక. 98

సీ. బలుఁడు త న్నాడినపల్కులు విని పోయి కలవి లేనివి కొన్ని కారు లరచి
పుత్రున కత్యంతశత్రుత్వ మొగఁబోసి చయ్యన బలునిపై కయ్యమునకుఁ
బంపె గయ్యాళని పలుకుదు రవనిలో నీ యుకువాదం బదేల మనకుఁ
గామపాలుఁడు నన్నుఁ గఠినోక్తు లాడుట కాలవిశేషంబు గాక వినుము
తే. చిత్తజానితండ్రి యన్నపైఁ గత్తికట్టఁ, దగదు రమ్మని పలికినఁ దల్లిపలుకు
హస్తి కంకుశమును జూపినట్లు లగుట, మరలి యిట్లనిపలికె నమ్మానధనుఁడు. 99

క. ఇప్పని నీహృదయమునకు, మెప్పొదవక నుండెనేని మీ యన్నాడే
తప్పడుకూఁతల కోర్చుచు, నిప్పురమున నుండవమ్మ యీయాసను లేకన్. 100

తే. జనని మాతండ్రిగా రున్నవనికి నేను, బోదు నని లేచి వెడలినపుత్త్రుఁ జూచి
నిన్ను నెడఁబాసి క్షణమైన నిలువ జాలఁ, దండ్రి నను బాసిపో నీకు ధర్మమగునె.

క. అని మఱియు నిట్టులనియెన్, వనములలోఁ బతినిఁ బాసి వగ వెదఁ దగులన్
నినుఁ జూచి వగవ కుండుదు, ననుఁ దోడ్కొనిపో కుమార నగసమధీరా. 102

వ. అనిన విని సౌభద్రుండు సుభద్రాగమనంబున కొడంబడి జనంబులు నిద్రింప నర్ధరాత్రంబునఁ దల్లిం దోడ్కొని ధనుర్బాణపాణి యై వెడలి మహారణ్యంబుఁ జొచ్చి గిరిగహ్వరంబు లాలోకింపుచు నరుగుసమయంబున. 103

క. జననాథాగ్రణి వినుమా, ఘనవేణి సుభద్ర రోషగతి నేమందున్
వనభూమి నరుగువేళన్, దనతల్లిని దండ్రినైనఁ దలఁపదు మదిలోన్. 104

సీ. కలకలధ్వను లిచ్చె ఖగసమూహంబులు చక్రవాకంబులు సంతసించెఁ
దమము దిక్కుల కేఁగెఁ దమ్ములు వికసించెఁ దొలికొండశిఖరిపైఁ దోఁచె రవియు
నభిమన్యుఁ డావేళ నతిరమణీయమౌ కమలాకరముఁ జేరి కాలవిధులు
సల్పినతరువాత సంకర్షణుం డాదువాక్యము ల్పలుమారు వగచి వగచి
తే. విల్లు శరములు తోడుగా విపినభూమి, జననిఁ దోడ్కొనిపోవుచు జనకు లున్న
వనము దెలియక ఘోరకాననముఁ జొచ్చి, పొదల దూరుచు భయదమౌనదులు గడచి.

ఉ. రెండుదినంబు లీపగిది రేయిపగల్లను బోయినంతలోఁ
గొండొకసేపు నిల్చి మృగకుంజరగర్జన లాలకించి కో
దండము నెక్కువెట్టి తనతల్లినిఁ దోడ్కొని ధీరవృత్తితో
వెండియు నేఁగె నాఘనునివీరపరాక్రమ మేమి చెప్పుదున్. 106

వ. ఇవ్విధంబునం జని చని మూఁడవనాఁటిసాయంకాలమునకు ఘటోత్కచువనంబు జేరం జనిరి. ఆవనంబునం దౌదుంబరవటాశ్వత్థజంబూజంబీరనారికేళకదళీఖర్జూరమాకందపున్నాగకదంబచాంపేయ కురంటకపనసరసాలాదిభూజంబులును, శరభసింహశార్దూల చమరీ భల్లూకమదేభవృకఖడ్గజంబుక మార్జాలాదిమృగంబులును, గలహంసమయూరశారికాకీరక్రౌంచచక్రవాకకపోతకౌలూకభరద్వాజటిట్టిభాది పక్షిసమూహంబులుం గల కాననంబుఁ బ్రవేశించి రాసమయంబున సుభద్ర సౌభద్రుం జూచి "తండ్రీ మార్గాయాసంబున దాహం బొదవె శిలాకంటకంబులు దాఁకి చరణంబులు దెమలింప రా దయ్యెఁ గావున గొంతసేపు నిద్రించెద ననిన జననిం జూచి సౌభద్రుండు చింతింపుచు సమీపంబున నున్న జలంబుల దాహంబుఁ బాపి సికతాతలంబున నిద్రింపం జేసి తనమనంబున నిట్లని వితర్కించె. 107

క. కురుకులవార్ధిసుధాకరుఁ, డరిగజకంఠీరవునకు నాత్మజుఁ డగుచున్
వారికి నే నల్లుఁడ నై, సిరికి న్వాలి నుండఁ జేయఁ జెల్లునె విధికిన్. 108

క. సుదతి హలాయుధపుత్త్రిని, ముద మొదవఁగఁ బెండ్లియాడి మురిసెద ననుచున్
మది నే నొకటి దలంచినఁ, దుద దైవం బొకటి తలఁప దుర్దశగాదే. 109

క. విరివింటివానికేళికిఁ, బరిపరిమార్గముల నేను బ్రార్థించినచోఁ
ద్వరపడవల దని చెప్పిన, యరుకుచఁ బెండ్లాడుభాగ్య మున్నదొ లేదో. 110

వ. కావున. 111

క. సతి నన్నొకటిగఁ జేసె, హితు లెవ రున్నా రటంచు నెంచుచు మరలన్
మతి నేఁ గోరినకోరిక, గతజలబంధనముగాక కాఁగలపనియే. 112

సీ. అనుచు వెండియు నతఁ డాత్మలో నిట్లను బలరాముఁ డాడినభాషణములు
తల్లిచే విని చాల తామసంబున నేను జననిఁ దోడ్కొని ఘోరవనముఁ జొరఁగ
బహుళమార్గాయాసభరమున రాలేక నిచ్చట శయనించె నింక రేపు
నెటువలె నడుచు నేనేమి సేయుందుఁ బాండుతనయులు విహరించువన మెఱుంగ
తే. నని తలంచుచు మరల ధైర్యంబుఁ బెంచి, తల్లి రక్షించుకొఱకునై ధనువుఁ బట్టి
గుణము దీర్చినఁ దద్ధ్వని కొండగుహల, బదులుధ్వను లిచ్చెఁ బక్షులు చెదరఁబఱచె.

క. ఆరవము విని ఘటోత్కచుఁ, డీరసమున వినియు లేచి యావనసీమం
జేరినవిలుకాఁ డెంతటి, శూరుఁడొ చని వాని నేను జూచెద ననుచున్. 114

వ. అని మఱియును. 115

క. సురయక్షసిద్ధసాధ్యులుఁ, చొరఁ జాలరు నావనంబుఁ జొచ్చినమీఁదన్
మరణము సిద్ధం బనుచున్, శరములు చాపంబుఁ దాల్చి చయ్యన వెడలెన్. 116

వ. ఆసమయంబున. 117

క. పదఘట్టనమున వరుసన్, పెదపెదభూజంబు లన్ని బెట్టుగ ధరపై
నదరుచుఁ బడుగుం బేకఁగఁ, దుదమొద లని తోఁపనీక దొడఁగెను దఱుచై. 118

వ. ఇవ్విధంబునం జని. 119

చ. చటులతరోగ్రరోషమునఁ జక్షుల నిప్పులు కుప్పలై పడన్
మటమట మండుపావకునిమాడ్కి ముఖద్యుతు లుప్పతిల్లఁగా
దిట మగుదంతఘట్టనకు దిగ్గజయూథము బెగ్గడిల్లఁ దా
నటునిటుఁ జూచుచుం జనఁగ నర్జునసూనుఁడు చూచి యాత్మలోన్. 120

ఉ. కాటుకకొండకైవడినిఁ గాంతులు గ్రక్కెడు వీనిదేహముం
దూఁటులు గట్టఁగాఁ గఱకుతూఁపుల నేసెద నంచుఁ గార్ముకం

జేటుకుఁ బాటుగా గుణము నెక్కిడి యోచన సేసి బుద్ధికిన్
దీటగు బాణము ల్దొడిగి ధీరత నుండఁగ నంతలోపలన్. 121

సీ. హైడింబుఁ డత్యుగ్రయాగ్రహంబున వచ్చి యర్జునసుతుఁ జూచి యాడుఁ గరచి
యెవ్వఁడురా నీవు యివ్వనభూమికి నర్ధరాత్రంబున నరుగుదెంచు
టరయ దైవంబు నా కాహారమునకు నై తెన్నగాఁ బంపిన ట్లున్న దిపుడు
కొమరొప్ప వంటయి ల్కుండేలు సొచ్చిన చందమాయె నటంచు మందలించి
తే. సింహ మవలీల నిద్రింపఁ జేరి గోలఁ, గొట్టువిధమునఁ గోపంబు పుట్టె నాదు
బారిఁ జొచ్చితివిఁక నీవు బ్రతుకఁగలవె, మిడుకమిడుకంగ మ్రింగెదఁ గడుపునిండ.

క. కయ్యము సేయక మానవుఁ, డియ్యెడఱ న్వచ్చి మరల నేఁగం గలఁడే
వెయ్యేల నాదుశరములు, చయ్యన భక్షించు ననిన సౌభద్రుండున్. 123

తే. పటలు పెటిలినసింగంబుచందమునను, గనుబొమలురెండు నుదుటిపైఁగంటువడఁగఁ
బుచ్ఛమును ద్రొక్క భుజగంబుఁబోలెమండి, చురుకుచూపుల హైడింబుఁ జూచిపలికె.

సీ. రాక్షసాధమ నన్ను భక్షింతు నని పల్కుజల్లికూఁతలు మాని విల్లుఁబూని
కయ్య మొనర్పు నీదయ్యంబు మాన్పెద నని పల్కె వెండియు నతనిఁ జూచి
భద్రగజం బెంత పంచాననం బెంత పరపర్వతం బెంత వజ్ర మెంత
గొప్ప కొంచెము లెన్నకొననేల నిను మ్రింగుశరములు గణుతింపఁ జాలఁ గలవు
తే. కాలయాపన మిఁక నేల కయ్య మొసఁగు,మనిన హైడింబుఁ డుగ్రుఁడై యాడుఁ గరచి
చాప మెక్కిడి పొదినున్నశరము లంది,దాఁకె నభిమన్యుపై యాతుధానుఁ డపుడు.

వ. అని చెప్పి వైశంపాయనుండు వెండియు నిట్లనియె. 126

ఉ. అద్దమరేయి పారెరువు రన్నయుఁ దమ్ముఁ డటంచుఁ దోఁచకన్
దద్దయుఁ గోపము న్బొడమఁ దార్కొని విక్రమ మొక్కటీరుగాఁ
బెద్దయుఁ బ్రొద్దు పోరునెడ భీమతనూజుఁడు పార్థపుత్రుతో
నద్దిర నీపరాక్రమము నద్భుత మంచుఁ దలంచి చాపమున్. 127

క. దీటుచుఁ గడువేగంబుల, మూఁడును మఱి నాల్గు నైదు ముప్పదిరెండున్
వాఁడిశరంబుల నేసిన, వాఁ డొకబాణంబుఁ బఱపి వడిఁ ద్రుంచుటయున్. 128

క. దాన నొక్కపం బొదవఁగ, దానవుఁ డభిమన్యుమీఁద దశమార్గణముల్
త్మేనం దూరఁగ నేసిన, దానవుపై నేసె నతఁడు దశవిశిఖములన్. 129

వ. ఇ ట్లేసిన. 130

క. వడముడిసూనుఁడు కన్బొమ, ముడివడఁగోపంబు మదిని ముప్పిరిగొనఁగా
నెడనెడ సౌభద్రునిపైఁ, గడువడిఁ బదియాఱునూరు కాండము లేసెన్. 131

సీ. విజయతనూజుండు వింశతిదశకంబు దానవేశ్వరునిపైఁ దగులనేసె
భీమునిపుత్త్రుఁ డాఖీభత్సుసూనుపై నాగాశుగంబులు నాల్గు చొనిపె
సౌభద్రుఁ డంతలో సప్తాంబకంబులు బకవైరిసుతునిపైఁ బఱపె నపుడు
నరభోజనుం డాఋనారాచముల నేసె నవి త్రుంచి సౌభద్రుఁ డతనిధనువుఁ
తే. దునిమి వెండియుఁ బదియాఱు తూపులేయుఁ, గినిసి రాక్షసుఁడింకొకక్రొధనువుఁ దాల్చి
పదియుం నేఁబదివిశిఖముల్ పార్థసుతుని, వక్షమునఁ గలంగ నేసిన వాఁడు గినిసి. 132

తే. భుజగనారాచములు రెండు భుజయుగంబుఁ, దగుల నేసిన నభిమన్యుధనువు వీడిన
నారి వదలించి పదిరెండునారసములఁ, బార్థతనయుని ఫాలంబుఁ బఱగ నేసె. 133

వ. ఇట్లేసిన 134

క. కన్నులు కెంపొదవఁగ నీయి, గన్నులదొరపౌత్త్రుఁ డదరి ఘనకార్ముకముల్
మిన్నగ నెక్కిడి గుణమునఁ, బన్నగశర మొకటిఁ గూర్చి పటుకోపముతోన్. 135

వ. ఘటోత్కచుం జూచి యిట్లనియె. 136

క. అమరారి యీశరంబున, సమరావని నిన్నుఁ గూల్చి శౌర్యంబమరన్
అమరులు ప్రస్తుతి సేయఁగ, సమవర్తిపురంబుఁ జేర్చి చనియెద ననుచున్. 137

క. ఉరగాస్త్రం బేసినఁ గని, సురవైరియుం బరఁగుకొనక శూరత్వముతోఁ
దిరముగఁ బోదిలో నుంచిన, గరుడాస్త్రముచేత దాని గ్రక్కునఁ దునిమెన్. 138

తే. దునిమి సౌభద్రు వీక్షించి దనుజవిభుఁడు, మానవాధమ యింక నీవు మనఁగలేవు
యాతుధానాస్త్రమున నిన్ను యమపురంబుఁ, జేర్తునని వింటశరమిడి చెప్పె మఱియు.

క. బాలుఁడ నాతో బోరఁగఁ, జాలవు నీకేల సమరసాహసవిధముల్
గాలునిదండముతో సరి, పోలినయీశరముతోన బొలిసెద వనుచున్. 140

క. ఏసినఁ గని వేగంబున, భాసిత మగు వైష్ణవాఖ్యబాణముతో న
య్యాసురవిశిఖముఁ దుండ్లుగ, వాసవిసుతుఁ డేసె నమరవరులు నుతింపన్. 141

వ. ఆసమయంబున. 142

క. ఇరువురిపోరుఁ గనుంగొనఁ, గరి కరి గిరి గిరియుఁ గంధి గంధియుఁ బోలెన్
సురవరుల కనిమిషత్వం, బరయఁగ సార్థక్య మయ్యె హస్తిపురీశా. 143

వ. ఇవ్విధంబున సుభద్రకుమారుం డగు సౌభద్రుండును హిడింబికసూనుం డగు హైడింబుండునుం బోరునెడ నిరువురశరీరంబులఁ దొరఁగురుధిరంబు మడువులు గట్టి ప్రవాహంబులు పాఱె నప్పుడు దివినున్న దేవసమూహంబులు కుసుమవర్షంబులు గురిపించి రాసమయంబున శతానందసూనుం డగునారదుండు సరిగమపదంబుల నాట్యంబు సేసె నపుడు వారిరువురిశస్త్రాస్త్రద్యుతు లంధకారంబు నణంచి దివంబు గాఁ దోఁపించె నాసమయంబున. 144

ఉ. ఇద్దఱి కార్ముకధ్వనికి నింద్రతనూజునిరాణి దిగ్గునన్
నిద్దుర లేచి చూచి తననెమ్మది నిట్టని యెంచె నౌర నా
ముద్దులపట్టిపై ధనువు మోపిడి రాక్షసుఁ డుగ్రమూర్తియై
తద్దయుఁ బోరఁ జొచ్చెనిది తప్పను పాయము నేమి సేయుదున్. 145

సీ. మాధవాగ్రజుఁ డాడుమాటల కలిగి నే నిట వచ్చుటను గదా యింతపుట్టెఁ
దామసం బెవరికిఁ దగ దంచుఁ బెద్దలు చెప్పెడువాక్యముల్ సిద్ధమయ్యె
వాలిపుత్రి నాపట్టి కర్పింతు నన నేల నిభపురేంద్రునిపట్టి కివ్వ నేల
పలుమారు నతని నేఁ బ్రార్థింపఁగా నేల నందుకుఁ బలుమాట లాడ నేల
తే. చేరి సౌభద్రుతో నేను జెప్ప నేల, వీఁడు నన్నుఁ దిల్చుకొని రాత్రి వెడల నేల
ఘోరవనమున నీబాధ నంద నేల, నెట్టు లున్నదో తలఁపఁగా నీశ్వరాజ్ఞ. 146

వ. అని మఱియును. 147

క. కాలిమాలినరక్కసుతో, దురమునఁ బోరాడఁ గలఁడె దురితాటవిలో
నరయఁగ నెవ్వరు లేరీ, సురవైరిని సంహరించి సుతు రక్షింపన్. 148

క. పాపాత్ముని శరముల నా, పాపఁడు మృతి నొందకుండ భయదాటవులన్
గాపాడువార లెవ్వరు, కాపాలియతక్క దిక్కు గలరే మాకున్. 149

వ. ఇట్లు సుభద్ర చింతించుచున్నసమయంబున హిడింబియుం జనుదెంచి వారిరువురు
గయ్యంబు సేయం జూచి తనమనంబున నిట్లను శస్త్రాస్త్రవిద్యాధురీణుం డగు
రాకుమారునితో నాకుమారునకుఁ గయ్యంబు సేయుసామర్థ్యంబు గలదే యని
వితర్కించుచుండె నప్పుడు. 150

సీ. హైడింబుఁ డనలాస్త్ర మడరింప సౌభద్రుఁ డైంద్రబాణంబున నదియుఁ ద్రుంచెఁ
గుంతిమధ్యమపుత్రుకొడుకు యామ్యాస్త్రంబుఁ బరపిన వీక్షించి పార్థసుతుఁడు
పర్జన్యశరమున భస్మంబు గావించి తొమ్మిదివిశిఖముల్ తొమ్మఁ దూర
నాటినఁ గోపించి నరభోజనుం డాఱు విశిఖంబు లేసిన విజయసుతుఁడుఁ
తే. గనలి వింశతిశరముల దనుజు నేసె, మరల రాక్షసుఁ డొకనూఱుమార్గణములు
తనువుఁజొర నేయఁ బార్థునితనయుఁ డాఱు, నూఱుశరములదనుజుమైఁదూర నేసె.

క. ఖండనమున వా రిరువురు, నొండొరుల జయింపలేక నొకరీతిగ వే
దండారియుగముపోలిక, దండధరద్వయముమాడ్కి దర్పోజ్జ్వలులై. 152

వ. పలలంబునకై పెనంగుసాళువంబుల తెఱంగున బెబ్బులులపగిదిం బోరిపోరి హైడిం
బుం డజ్జభవాస్త్రంబుఁ దొడిగినం జూచి సౌభద్రుఁడు నదియె సంధించె నాసమ
యంబునఁ గులాచలంబులు చలించె రవిచంద్రులు మార్గంబులు దప్పి రమరులు

భయాకులితచిత్తులై రపుడుఁ ద్రికాలవేది యగువేదవ్యాసుం డరుగుదెంచి వారిరు
పురమధ్యంబున నిలిచి యిట్లనియె. 153

సీ. ఓభీమనందన యోఫల్గునాత్మజ యిట్టిసాహసకృత్య మేల మీకుఁ
దెలియక కయ్యంబు సలిపితి రిరువురు నన్నదమ్ము లటంచు నతఁడు దెలిపి
వారిమాతలఁ గాంచి మీ రిరువురుఁ దోడి కోడండ్రు గొడుకులఁ జూడ నేల
నని చెప్పి మౌనీంద్రుఁ డాసుభద్రాదుల నీక్షించి వెండియు నిట్లులనియె
తే. మీకు నిఁక మీఁద నాపద లేక పరమ, సుఖము చేకూఱుఁ బతులకు శుభముఁగలుగుఁ
గమలనాభుండు ప్రాపు గాఁగలఁ డటంచుఁ, దెలిపి మౌనీంద్రుఁ డుత్తరదిశకునరిగె.

క. మునివరుఁ డేగినపిమ్మట, దనుజుఁడు నభిమన్యుఁ జూచి తమ్ముఁడ నిన్నే
ననరానిమాట లాడితిఁ, గనలకు మని కౌఁగలించి కన్నీ రిడుచున్. 155

క. తనువున రక్తం బెడలఁగ, సునిశితబాణంబు లేసి స్రుక్కించితి నే
ననుజా యీవిధ మంతయుం, మనజనకులు విన్న నన్ను మన్నించెదరే. 156

క. సిరిఁ బాసి విపినభూముల, కరుదెంచినమీవిధంబు నడుగక వత్సా
కరుణను రమ్మని పిలువక, దుర మొనరింపంగ నెంతదురితాత్ముఁడనో. 157

క. తమ్ముఁడ నాశరములు నీ, యొమ్మున నాటించినపుడు రుధిరాంగముతో
సొమ్మసిలి నేలవ్రాలిన, నిమ్మహి నాజన్మ మరయ నెందుకు దండ్రీ! 158

వ. అని యివ్విధంబున ఘటోత్కచుం డభిమన్యుంగౌఁగలించుకొని చింతించుసమయం
బున హిడింబి సుభద్రం జూచి చెల్లెలా నీ వేలచింతించెద వని యూరార్చి వెండియు
నిట్లను భగవంతుఁ డొనరించుకార్యంబునకుఁ బ్రతిసేయం గలరే? పరాశరసూనుం
డెరింగింపకుండెనేని మీరిరువురు గయ్యంబున సమయుందు రమ్మహాముని కారుణ్యం
బున జీవించితి రదియునుంగాక నాసుతుఁ డొనరించినదుష్కార్యంబు క్షమించు మని
పల్కుపల్కు లాలించి ఘటోత్కచుండు సుభద్రపాదంబులపై వ్రాలి యిట్లనియె.

క. జననీ! చిరకాలమునకుఁ, జనుదెంచినమిమ్ముఁ, జూచి సంతోషముతో
ననుజుని లాలనసేయక, తనువున విశిఖంబు లేయఁ దప్పని మఱియున్. 160

క. ఎఱుఁగక చేసినకార్యము, మఱిమఱి మది నుంచవలదు మాతా నన్నుం
గరుణించి బ్రోవవే యని, కరములు ముకుళించి మ్రొక్కె గాండివిసతికిన్. 161

వ. ఇట్లు మ్రొక్కినఘటోత్కచుం జూచి సుభద్ర యిట్లనియె. 162

క. అన్నా! నీ వీలాగున, ఖిన్నుఁడవై దీనవృత్తిఁ గీడ్వడనేలా
మ న్నెఱుఁగని మోసంబున, నిన్నియుం సమకూడె మనకు నీవనభూమిన్. 163

క. బలియుఁడ నీ విట నుండుట, తెలియదు మా కించుకైనఁ దేకువచెడి మే
ఘులనట నిట కేతెంచుట, నలఘుమతీ నీవెఱుంగ వది యట్లుండెన్. 164

ఉ. అన్నయుఁ దమ్ముఁ డీపగిది నాహవరంగమునందుఁ బోరుటల్
సన్నుతపాత్రుఁ డై పరఁగు స్వామికృతం బని చెప్పవచ్చు లే
కున్న దయావిశాలురకు నుగ్రపుకృత్యము లేల గల్గు నో
చిన్నికుమార యింకొకటి సెప్పెదఁ జేకొని యాదరింపవే. 165

క. నీ వీలాగున వగచుట, పావనిసుత నిన్నుఁ జూచి పార్థాత్మజుఁడు
న్నీవలె వగచుచు నున్నాఁ, డీవిధమునఁ జింతసేయ నెందుకు వత్సా! 166

చ. యతివరుఁ డన్నదమ్ములని యెంతయుం వేడ్కతో వచ్చి చెప్పఁగా
బ్రతికితి రింత చాలు గ్రహబాధవిశేషము లింత జేసెఁ గా
కితరము లేదు భీమసుత యింకఁ బదంపడి చింత సేయఁగా
గతజలసేతుబంధనము గాదె మదిం దలపోసి చూడఁగన్. 167

క. ఇవ్విధమునఁ బల్కిన యా, కవ్వడిసతివాక్యములకుఁ గడుమోదముతో
నవ్వుచు భీమతనూజుఁడు, పువ్విలుతుని బోలు పార్థపుత్రుని వేడ్కన్. 168

తే. కౌఁగిటను జేర్చి సంతోషకలితుఁ డగుచు, విశద మైనట్టి శశిశిలావేదియందుఁ
దల్లులును దాను గూర్చుండి యుల్లమలర, నూరువులయందుఁ దమ్ముని నుంచుకొనియె.

సీ. ఇవ్విధంబున నుండి కవ్వడిపత్నితోఁ బలికె హైడింబుండు పరమభక్తిఁ
గరములు ముకుళించి ఘనులు మజ్జనకులు వనవాసు లైనట్టివార్త దెలిసి
హరి మిమ్ము ద్వారకాపురికిఁ దోడ్కొనిపోవఁ బోయితి రిప్పు డీపుత్రుతోడ
నర్ధరాత్రంబున నరుదెంచుటకు నేమి హేతువు దెల్పవే మాత యనిన
తే. దనుజు వీక్షించి పార్థునిదార పలికె, వినుము చెప్పెద దనుజేంద్ర విశదముగను
పాండవులయొద్ద మే మున్నఁ బద్మనాభుఁ, డచటి కేతెంచి ధర్మజు నతఁడు గాంచి.

వ. కుశలసమాచారంబు లడిగి మమ్మిర్వురం దోడ్కొనిపోయి ద్వారకానగరంబునకుం జని సుఖంబున్న సమయంబున. 171

సీ. నీలాంబరునిపుత్రి నెలరేక యనుకన్య నభిమన్యునకు నిత్తు ననుచుఁ బలుక
నాఁడాదిగా మేము నమ్మి ద్వారక నుంటి మంతలోఁ గురువిభుం డవనిసురులఁ
బంప వారలు వేడ్కఁ బరతెంచి హలిఁ గాంచి రారాజుపుత్రుఁ డౌ లక్ష్మణునకుఁ
దనపుత్రి నడిగినఁ దద్బ్రాహ్మణులఁ జూచి బలరాముఁ డానందభరితుఁ డగుచుఁ
తే. బలికె నేఁటికి నెనిమిదివాసరములఁ, దశమిలగ్నంబు గల దింకఁ దడవు వలదు
తద్ధిరం బని పల్కుచుఁ దక్షణంబ, పరిణయంబును బ్రకటింపఁ బనిచె భటుల. 172

వ. ఇవ్విధంబునఁ బనిచిన వా రేఁగి శశిరేఖాపరిణయోత్సవంబుఁ బురంబునఁ జాటించి రా సమయంబున. 173

క. జలజాక్షుఁ డరిగి హలితో, పల దని వాదింప నతనివాక్యము వినకన్

బలరాముఁ డనియెఁ గృష్ణ!, తలఁపఁగ నీ తెరగు పాండుతనయులయందున్. 174

తే. పక్షపాతంబుతో నిట్లు పలుక నేల, యనిన గోవిందుఁ డలిగి తా నరిగె నపుడు
ముసలిచరణాబ్జముల కేను మ్రొక్కి వేడఁ, గన్నులరుణంబుగావించి నన్నుఁ గాంచి.

క. ఆడవులఁ గాయలు నమలెదు, బడుగులతోఁ జేతురమ్మ బంధుత్వములున్
జడమతివై పుత్త్రునకున్, బడఁతుక నిమ్మనుచుఁ బలుకఁ బాడియె నీకున్. 176

క. పోఁడిమి చెడి రా మీకున్, గూడొసఁగుట చాలు ననక కోడ లటంచున్
వేఁడెదవు సిగ్గులేకన్, చేడియ నీ కిట్టికోర్కి చెల్లునె తలఁపన్. 177

తే. ధార్తరాష్ట్రుఁడు మిక్కిలి ధైర్యశాలి, కీర్తికాముఁడు విభవనాకేశతుల్యుఁ
డతనిసుతునకుఁ బుత్త్రి నర్పింతుననుచుఁ, బల్కుపల్కులు చెవులకు ములుకులగుచు.

క. నాటినఁ గనలుచు నే న, చ్చోటును వెడఁబాసి వచ్చి సుతునకుఁ జెప్పన్
గాటపుఁ జీఁకటియన కీ, పాటున ననుఁ దోడుకొనుచు భయదాటవికిన్. 179

క. వచ్చినవే ళెటువంటిదొ, యిచ్చటఁ గయ్యంబు గల్గె మీయిరువురకుం
జెచ్చెర మునివరుఁ దద్దయు, చొచ్చుట దనుజేంద్ర పరమశోభన మయ్యెన్. 180

ఉ. నీ విట నుండు టే మెఱుఁగ మైలి మెఱింగిన నట్టులౌనె యో
పావనిపుత్త్ర నాసుతుఁడు పాండుతనూజులఁ బాసి చింతలన్
భావమునందు నక్కరుణ మాని హలాయుధుఁ డింత చేసినాఁ
డీవనరాశిమధ్యమున నెచ్చట నుందురొ పాండునందనుల్. 181

క. వా రున్నజాడ లరయుచు, ధీరమతి న్నడువ నాల్గుదినములు చనె మ
మ్మేరీతి నైన వారలఁ, జేరిచి రక్షింపు దనుజశేఖర యనినన్. 182

వ. అని యిట్లు సుభద్ర చెప్పినమాటలు చెవింబడిన ఘటోత్కచునకు. 183

సీ. బలుఁడు దుర్యోధనుపక్షమై యాతని గొప్పచేసె నటంచుఁ జెప్ప నపుడు
మదిలోన నిప్పులు కుదురుగా నిడినట్టు లుండె వెండియుఁ బుత్త్రి నొసఁగ ననిన
నంగాంగమునఁ బొగ ల్నింగికి వ్యాపించె బెట్టుగా జనకులఁ దిట్టె ననిన
వింటనె నోటిలో మంటలు ప్రబలించె వీరరోషావేశవివశుఁ డగుచుఁ

తే. ప్రళయకాలార్కబింబంబుపగిది నొప్పి, చురుకుచూపుల రోషము ల్జుంజురింపఁ
గనుల నిప్పులురాలంగఁ గటము లదరఁ, బండ్లు పటపటఁ దీడుచుఁ బలికె నతఁడు.

ఉ. వింతలుపుట్టె యాదవులవీట హలాయుధుఁ డేనుగల్గ నో
క్కింతభయంబు లేకిటుల కిల్బిషకృత్య మొనర్చి వెండియుం
గుంతితనూజు లేవురను గొంకక నిందలు పల్కుటారయన్
దంతిపురాధినాయకునిఁ దద్బలము న్మది నమ్మినాఁడొకో. 185

వ. అని మఱియు నిట్లనియె. 186

క. హలపాణి పల్కు పల్కుల, ఫల మతనికిఁ గుడిపి పార్థుపట్టికి మఱలన్
జలజాక్షి నొసఁగు తెఱఁ గే, సలిపెనఁ జింతింపవలదు జననీ నీకున్. 187

క. బలునకు మనకు న్భేదముఁ, గలిగించిన ధార్తరాష్ట్రుఁ గయ్యములోనన్
బొలియించి యతనితమ్మునిఁ, జెలుచన్ ధరఁ గూలవైచి పీచమడంతున్. 188

వ. అని పలికి మఱియును. 189

సీ. సింధురాజును బట్టి బంధించి కానీక ముక్కుకర్ణంబులు మోటు చేసి
శకునికండలు చెక్కి వికలంబు గావించి భూరిశ్రవుని నాఁడు బోడవడంచి
దుర్ముఖాదుల నెల్లఁ దునుమాడి ధృతరాష్ట్రు నెంచక వార్ధిలో ముంచిముంచి
వెండియుఁ గురుపక్షవీరుల వరుసఁగా మ్రింగెద వారికై మే లొనర్ప
తే. వలసి యాదవు లందఱు వచ్చిరేని, వారివారిని బంధించి వార్ధివైచి
నపుడు హాలి నిన్నుఁ బల్కిన యట్టిపలుకు, తప్పిదం బని మదిలోనఁ దలఁచుఁ గాక.

క. మాజనకు లడవిలోపల, భోజనరహితాత్ము లగుచుఁ బొక్కుచు నుండన్
రా జగుదుర్యోధను నే, వాజిసి బరిమార్పకున్న నది సాహసమే. 191

వ. అని మఱియు నిట్లనియె. 192

తే. కొండలను బట్టి పెకలించి కుతలమెల్లఁ, గ్రిందుమీఁ దగునట్లుగాఁ బొందుపఱచి
జలధులన్నియుఁ బోచ్చ్వగాఁ గలఁచి పొందు, సుతులకోపంబు మాన్పెదఁ జూపు నన్ను.

క. శశిరేఖఁ దెచ్చి యిచ్చటన్, దశమీలగ్నంబుఁ జేసి తద్దంపతులన్
శశికులు లగుకొంతేయులు, వసియించెడితావుఁ జేర్తు వగవకు మమ్మా. 194

క. జననీ నీదుఃఖమునకు, ఘన మగునుపశాంతి గాఁగఁ గయ్యములోనం
దునిమెద యదుకులవీరుల, నన విని భీభత్సుపత్ని యసురేంద్రునితోన్. 195

వ. వెండియు ని ట్లనియె 196

క. అలదుర్యోధనసుతునకు, లలనామణి నిత్తు ననుచు రాముఁడు పలికెన్
నిలిచిన యదుపుంగవులకుఁ, దలఁపఁగ నిష్టంబు లేదు దానవనాథా. 197

క. యాదవు లందఱు వరుసన్, గాదిలి బాంధవులు గాక కడవారలె దా
మోదరునకు మనకున్ మఱి, భేదము లే దెంచి చూడ భీమతనూజా. 198

వ. అదియునుం గాక. 199

క. ధృతరాష్ట్రసుతులఁ జంపను, బ్రతినలు మీతండ్రిగారు పల్కుట వినియున్
మది నెంచ కీవు ద్రుంచినఁ, గుతుకము చెడి పాండుసుతులు గుందుదు రమ్మా.

తే. కాన వారలమది నున్నగర్వ మణఁచి, భంగపాటును బొందింపు సాగరమునఁ
బోడ వడంచుట దక్క నీబుద్ధి కెటులఁ, దోఁచు నంతయుఁ జేసి రా దోషరహిత.

క. మూఁడుదినంబులు గల దా, చేడియలగ్నం బటంచుఁ జెప్పుచు మఱియుం

బోఁడిమితో నీతమ్ముని, వేడుక లలరంగఁ జేయుం వేగము గాఁగన్. 202

క. అని పల్కు పార్థురాణిం, గనుఁగొని దనుజేంద్రుఁ డనియెఁ గ్రక్కునఁ దల్లీ
మనమున నీ కటుఁ దోఁచినఁ, దునుమాడక గర్వ మణఁతు దుష్టాత్ములన్. 203

తే. ధార్తరాష్ట్రులఁ గనుఁగొన్నఁ దగినమాడ్కిఁ, బొగరుమాన్పకయున్న నాభూరిరోష
పటిమ వదలదు విను పెక్కుపల్కు లేల, పొలఁతి పెండిలివేళ కేఁబోదు ననుచు.

క. తల్లులఁ దమ్మునిఁ దోడ్కొని, మెల్లఁగఁ దనగుహకు నేఁగి మేలోగిరముల్
ఉల్లము రంజిల నొసఁగుచు, సల్లలితము లైనమధురసంభాషణలన్. 205

వ సుభద్రాభిమన్యులకు సంతోషంబు జేయుచు శశిరేఖావివాహమహోత్సవకాలంబు
నిరీక్షించుచుండె ననుచు. 206

క. మునివరుఁ డెఱిఁగించిన విని, జనమేజయధరణివిభుఁడు సంతోషితుఁ డై
అనఘాత్మ వారిచందము, వినుటకు నామదికిఁ జాల వేడుకవొడమెన్. 207

కలహంసోత్సాహవృత్తము.
సరసిజాక్ష దనుజశిక్ష సకలలోకనాయకా
శరధితల్ప నగముదాల్ప శమదమాదిసద్గుణా
హారినరాంగ భవవిభంగ అమరమానివందితా
కరుణశీల కనకచేల కమలప్రాణనాయకా. 208

గద్య. ఇది శ్రీమత్సూర్యనారాయణకరుణాకటాక్షవీక్షణాలంకార సుస్థిరామృతవాక్య
జనితకవిత్వరత్నాకరవంశ పయఃపారావార రాకాసుధాకర రాంజనయాఖ్యతనూజ
అప్పప్పనామధేయప్రణీతం బైనశశిరేఖాపరిణయం బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.



# తృతీయాశ్వాసము.



శ్రీలలనాహృత్పుష్కర
లోలస్ఫుటచంచరీక లోకస్తుత్యా
పాలితసురమునిగోత్రా
నీలాంబుదరుచిరగాత్ర నీరజనేత్రా. 1

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్లు వైశంపాయనుండు
జనమేజయున కిట్లనియె. 2

చ. రమణి నొసంగలే దనుచు రాముఁడు పల్క సుభద్ర దీనత
న్గుములుచుఁ బుత్త్రిఁ దోడుకొని ఘోరవనాంతరసీమ కేగుట
న్గమిగొని ద్వారకాంగనలు కొందలమంది వచించి రయ్యయో
అమవసమ బ్బటంచనక నద్దమరేయిని బోవు టెట్లొకో. 3

క. అని కృష్ణునికాంతలకు, న్వినిపించిన లేచి వారు విస్మయమతులై
కనలుచు రామునిపత్నిం, గని యిట్లనిపల్కి రాత్మగతి తెలియఁటకై. 4

సీ. పెనిమిటి నెసకొల్పి పేదరాలి సుభద్రఁ బురివెళ్లఁగొట్టితే సరసిజాక్షి
ఆటప్రాయమునాఁడె యభిమన్యునకుఁ బుత్త్రి నిచ్చెద నని మాతో నుచ్చరించి
యది మాని కురురాజుననుఁగుఁబుత్త్రుని కిచ్చుచింత దాఁ బొడమెనే దంతిగమన
కల్మిపై నాకాంక్ష గల్గెనా నీకును వంత మీఁడేరనే భాసురాంగి
తే. అనుచుఁ గృష్ణునిభార్యలు మొనసి పలుకఁ,జింతచేఁ గుంది బలరాముకాంత వారిఁ
గాంచి నిర్దోషి నగునన్నుఁ గానలేక, నిట్టు లాడంగ మీకు నో రెట్టులాడె. 5

వ. అని మఱియు నిట్లనియె. 6

సీ. జలజాక్షి శశిరేఖ సంభవం బాదిగా నభిమన్యుఁ డల్లుఁ డౌననుచుఁ దలఁతుఁ
గూఁతురు గాండీవికోడ లాయెనటంచు మోద మందుదుఁ గాని భేద మెఱుఁగ
నక్కటా! నాకోర్కె కనుకూలముగ వచ్చుటెఱుఁగరే మీబావ తెఱుఁగు మీరు
ఎఱిఁగి యొఱింగి యి ట్లేల దూఱెద రమ్మ యని బాష్పజలపూరితాక్షి యగుచు

తే. వివశతను జెందు రేవతివిధముఁ గాంచి, వారిజాక్షునిమగువలు వనటఁబొంది
గుములు గట్టుకయుండిరాసమయమునను, జలజలోచన లరుదెంచి బలునిఁ గాంచి. 7

తే. వినుము నీమీఁద నలుకచే విసివి రాత్రి, మనసు భద్రంబు గావించి మనసుభద్ర
పుత్త్రు నభిమన్యుఁ దోడ్కొని భూరిభయద, విపినభూమికిఁ జనె నని విన్నవింప. 8

వ. వినియు నీలాంబరుండు వినని తెఱంగున నవ్వాక్యంబులు పెడచెవులం బెట్టి చెల్లెలి
పైఁ గరుణ లేకయుండె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 9

ఉ. క్రోధము గల్గి చెల్లెలును గొబ్బున బుత్త్రుని వెంటఁబెట్టుక
న్బాధలు వొందుచు న్వగపుఁ బాసి ఘటోత్కచుఁ జేరియుండుట
న్మాధవుఁ డాత్మలోఁ దెలిసి మర్మము రామున కీక దుష్టదు
ర్యోధనుపుత్త్రు ఖండించుటకు యోచన సేయుచునుండె మానియై. 10

వ. ఆసమయంబున. 11

సీ. చెలికత్తె లావేళ బలుపుత్త్రికడ కేగి వినవమ్మ నీతండ్రి వెఱ్ఱితనము
అలసుయోధనుపక్షమై సుభద్రను గొన్ని యవమానవాక్యంబు లతఁడు పలుక
నర్ధరాత్రంబున నభిమన్యుఁ దోడ్కొని వనభూములకు నేఁగె వారిజాక్షి
నిను లక్ష్మణున కిచ్చునియమంబుఁ గావించె నని చెప్పినంతలో నాత్మఁ గుంది
తే. పరవశత్వంబు నొందుచు భాసురాంగి, పైఁటకొంగును దనదుకన్నీటఁ దడిపి
మాటిమాటికి జనకునిమతముఁ దలఁచి, గుట్టుతనమునఁ దనకుఁ దా నిట్టు లనియె. 12

చ. జనకుఁడు బంధువర్గములసమ్మతి నుత్తముఁ డైనవానికిం
దనుజ నొసంగుటల్ పరమధర్మఫలం బని పల్కువాక్యముల్
వినియు సుయోధనాత్మజుని వేమరు రాముఁడు గోరు టారయన్
బనివడి యేనొనర్చుఘనపాపఫలం బని యెంచఁగాఁ దగున్. 13

వ. అని వెండియు. 14

క. ఎక్కడిదుర్యోధనుఁడో, యెక్కడిలక్ష్మణుఁడొ వాని కే నెక్కడనో
అక్కర గలనివరునకు, నక్కట! ననుఁ బెండ్లిసేయ నగునే తనకున్. 15

వ. అదియునుంగాక. 16

క. కంతుజయంతులరూపును, బంతంబునఁ గెల్వఁజాలుపార్థుని బతిగాఁ
జింతింతుఁగాని యితరులఁ, జింతించుట యుచిత మగునె చిత్తములోనన్. 17

క. ఆయభిమన్యున కీయక, యీయువలక్షణున కొసఁగి యిచ్ఛామతియై
న్యాయముఁ దప్పి నటించిన, నాయనమం బతఁడు నాకుఁ దండ్రనఁ దగునా. 18

క. సుందరమూర్తి సుభద్రా, నందనుతోఁ గలసి మెలసి నవ్వేడుభాగ్యం
బందంద తలఁచి చూడఁగ, నందనిఫల మాయె నంచు నాత్మలో నెంచున్. 19

క. మేన త్తకొడుకుకొఱకై, మే నెత్తితి నతనిరతుల మెప్పొదవంగా
మే నత్తు సేయకుండిన, మేనెత్తియు నిష్ఫలంబు మేదినిమీఁదన్. 20

వ. అని వగచి. 21

సీ. మఘవపౌత్రుని దొల్త మగనిగా మది నెంచి పరుని వివాహమై బ్రదికి యేమి
ఫల మని నవరత్నభవనంబులోఁ జొచ్చి సీటితోఁ దాటితో నేఁటితోను
దనువుఁ బాసెద నంచుఁ దాలాంకువరపుత్త్రి యత్నించునంతలో యతివరుండు
దిగ్గున నటకురాఁ దెఱఁగొప్ప వీక్షించి నారదుం డని యెంచి భూరిభక్తి
తే. మ్రొక్కి నిలిచిన శశిరేఖమోముఁ జూచి, బాల యిటువంటిసాహసం బేలనమ్మ
పార్థతనయుని నిన్ను దంపతులుగాఁగ, తామరసచూలి నిర్మించెఁ దలిరుఁబోణి.22

క. కొమరొప్ప నీదుకోరికె, సమకూడెడు దీని కింతసాహస మేలా
కమలాక్షి వినుము తెల్పెద, సుముహూర్తము వేళ కతనిఁ జూచెద వీవున్. 23

వ. అని యిట్లు నారదుం డెఱింగించి చనినయనంతరంబ శశిరేఖ సంతోషసాగరంబు
నం దేలుచు సఖీజనంబులతో నాడుచుండె నానమయంబున. 24

తే. కన్యకార్థంబు బలరాముకడకుఁ జనిన, వసుధగీర్వాణు లేతెంచి వారణేంద్ర
పురము సొత్తెంచి కొలువున్న కురునరేంద్రుఁ, గాంచి యిట్లని రత్యంతకౌతుకమున.

క. మీ రనుప నరిగి మే మా,ద్వారకనగరంబుఁ జొచ్చి తాలాంకునకున్
మారాకఁ దెలుప నాతఁడు, సారెకు మీక్షేమ మడిగె సంతోషముతోన్. 26

వ. ఇట్లు క్షేమసమాచారంబులు విచారించి మదాగమనంబునకుఁ గారణం బడిగె నాస
మయంబున మంగళద్రవ్యంబు లొసంగి భవత్సూనునకు శశిరేఖ నొసంగు మని
వేఁడిన నతం డొడంబడి దశమిముహూర్తంబు నిశ్చయంబు చేసిన విని కృష్ణుండు
సుభద్రం దోడ్కొని వచ్చి సౌభద్రునకుఁ గన్యాదానంబు సేయు మని వేఁడిన
నతండు ప్రతికూలంబుగాఁ బలికిన విని దామోదరుం డలిగిపోవుటయు సుభద్ర
బలభద్రుం బ్రార్థించినఁ గోపించి కర్ణకఠోరంబు లైనవాక్యంబులు పల్కిన విని
సుభద్ర యచ్చోటువాసి పోవుటయు శిపివరుం డన్నపైఁ గోపించి నిష్ఠూరంబు
లాడిన విని సంకర్షణుం డనుజునివాక్యంబులు వినలోలక మమ్మిరువురఁ జూచి దశ
మిలగ్నంబునకు ధార్తరాష్ట్రుం దోడ్కొనిర మ్మనినవిధం బంతయు సవిస్తరంబుగా
నెఱింగించి వెండియు నిట్లనిరి. 27

క. సీరాయుధుతో వియ్యము, గారవమునఁ జేయఁ గోర్కె గలిగిన రేపే
భూరితరవైభవంబున, ద్వారకపయనంబు సేయు ధరణీనాథా! 28

క. అని యిట్లు నేలవేల్పులు, వినిపించినఁ గురువిభుండు వికవికనగుచు

న్నను బాఁ దగుదుస్ససేనుం, గనుఁగొని ముదమంది పలికె ఘనవాక్పటిమన్. 29

క. హలపాణితోడ బాంధవ, మెలమిన్ సమకూడె నింక మేదినిమీఁదన్
బలు రగుశత్రులఁ బంపను, బాలకన గద దీనికంటె శుభముం గలదే. 30

వ. అని మఱియు నిట్లనియె. 31

సీ. బలుఁడు మనయతఁడయి పాండునందనులను నిందించి పార్థునినందనునకు
నబ్జరేఖ నొసంగ నని పల్కె గోవిందుఁ డన్నతోం దనలేక నరుగువిధము
నరయంగ మైత్రికి నరుదెంచుఁ గావునఁ దడవు సేయక వేగఁ దర్లవలయుం
మనము వా రేకమై వనవాసు లగుపాండురాజపుత్రులఁ బంపి రాజ్యమెల్ల
తే. శాశ్వతంబుగ నేలెడునమయ మబ్బె, భటవితతి నెల్ల రప్పించి పట్టణమున
సకలగృహములు వీథులు సౌధములును, బరమశృంగార మొనరింపఁ బంపు మనుజ.

చ. తొలుతను బంధువర్గములఁ దోడ్కొని రమ్మనిచెప్పి పిమ్మటన్
జలజభవాననోద్భవుల శాస్త్రవిధిజ్ఞుల వైశ్యశూద్రులన్
పలుపురఁ బుష్పవిక్రయులఁ బాటలనీటులఁ గుల్కువేశ్యలం
బిలువఁగఁబంపు వేగమునఁ బెండ్లికి రాఁదగువారి నందఱిన్. 33

తే. కావలసినట్టిద్రవ్యము లక్కరితురంగ, శకటవృషభోష్ట్రముల కెత్తి పరఁగ నీటఁ
గలుగు ప్రజలకుపయనము దెలిపి యన్నిపనులు నెఱవేర్చు మిఁక పెక్కుపల్కు లేల.

క. అని సెలవిచ్చిన దుర్యోధనునాజ్ఞ శిరంబునందుఁ దాలిచి దుశ్శా
సనుఁ డాలాగునఁ జేసిన, పనులకు ముదమందె రాజు పార్థివనాథా. 35

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 36

క. రాముఁడు తమ కిష్టుఁ డనకుఁ, గోమలి నర్పించు టెఱిఁగి గోవిందుఁడు తా
నేమియుఁ బలుకక చనె నని, భూమిసురాగ్రణులు తెల్ప భూపతి మదికిన్. 37

క. తెలియక లగ్నముకొఱకై, బొలుపుగ యత్నించురాజపుంగవుఁ గని యీ
తులువా నీ కిది తగ దని, పలుకరు గా ద్రోణభీష్మబాహ్లీకు లైనన్. 38

వ. అని యి ట్లడిగినపారిక్షితునకు వైశంపాయనుం డిట్లనియె. 39

చ. కురుపతిఁ గాంచి భీష్ముఁడును కుంభజముఖ్యులు కార్యభంగమా
తెఱఁగు నెఱింగి యిట్లనుచుఁ దెల్పిరి భూవర నీ వొనర్చు నీ
పరిణయయుత్సవం బిపుడు బాగుగ నుండ దదెట్టులన్న నా
శరివరయాన రామునకుఁ గల్గినయవ్వడె పార్థపట్టికిన్. 40

ఉ. దారయటంచుఁ బల్కె రది తప్పదు కృష్ణుఁడు సవ్యసాచిపైఁ
గూరిమి గల్గి యెల్లపుడుఁ గోర్కె లొసంగుచు నుండు నిప్పు డా

సిరియుం నీహితుం డగుచుఁ జేడె నొసంగెద నంచుఁ బల్కిన
న్వారము ముట్టనేర దది పంకజనాభుఁడు సమ్మతింపమిన్. 41

వ. అదియునుంగాక. 42

క. భూధరముల్ చలియించిన, నాధారము దప్పి భానుఁ డవనిం బడిన
న్వాథోధు లింకిపోయిన, మాధవుఁ డాపార్థు విడిచి మనవశ మగునే. 43

ఉ. ఎక్కువమాట లేమిటికి నిందుకులోద్భవ నీదుపట్టికిన్
దక్కఁడు యిందురేఖ హరి ధర్మవిధిజ్ఞుఁడు ఒప్పుకున్న నీ
విక్కడిబంధువర్గములనెల్లను దోడ్కొని పెండ్లి కేఁగినన్
పక్కన నవ్వరే జనులు బాంధవులందఱు నింద సేయరే. 44

క. బలరాము నమ్మిపోయినఁ, బలుచనయగు టింతె దీనిభావములోనన్
దలఁపకు మన లక్ష్మణునకు, గలుగుదు రెచ్చోటనైనఁ గమలదళాక్షుల్. 45

క. ఇప్పగిది ద్రోణభీష్ములు, చెప్పిన విని కురువిభుండు సింహాసనమున్
గుప్పునఁ దట్టుచుఁ గోపం, బుప్పతిలం బలికె సకలయోధులు వినఁగాన్. 46

సీ. ఎఱుఁగుదు నేను మీయిరువురతెఱఁగెల్లఁ బరగఁ బాండవపక్షపాతు లగుట
దిగ్విజయంబుగా దీవించు టావంక దూషించు టీవంక దుష్ట లనుచు
భావించి చూడఁగా జీవించు టీవంక యావంక విశ్వాస మతిశయిల్లు
దివ్యతరం బైనదేహంబు లీవంక యావంకఁజిత్తంబు లలరుచుండు
తే. నెట్టికార్యంబుఁ దలఁచిన నెదురవచ్చి, చెడును జెడు నంచు విఘ్నముల్ సేతురిపుడు
వెడలిపొమ్మన్నఁ బాండవు లడవి కేఁగి, రిట్లు పట్టంగఁబడరు వారెంచిచూడ. 47

ఉ. ఎక్కువ యైనకార్యమున కేము ప్రయత్నము చేసినప్పుడున్
గ్రక్కున వచ్చి పల్కుదురు కాదని మావెనువెంట పత్తు రిం
కెక్కడఁ జొత్తు మేదితెఱు వీముదిపోరును మాన్ప శక్యమా
బొక్కను దూరిన న్విడరు పూర్వము నే నొనరించుపాపమో. 84

క. మాటలు నేర్చినకతమున, మేటిధనుర్ధరుల కైన మిక్కిలిభయమా
మాటలు సెప్పుచు దబ్బున, కోటలు దాఁటుదురు పనికిఁ గొఱ దా రగుచున్. 49

వ. అని మఱియును. 50

క. యాదవు లే మొకటగుటన్, భేదము గావింపఁ దలఁచి భీతి జనింపన్
వాదింతురు మిమ్మేమన, రా దని నే నూరకున్న లక్ష్యము లేకన్. 51

వ. అని వెండియు నిట్లనియె. 52

క. నేమధిక లని మిమ్మున్, బ్రేమాతిశయంబు సేయ జేలత్వముతో
మీమీహృదయములరయఁగ, గోముకవ్యాఘ్రంబు లనుచుఁ గరుపలి మఱియున్.

ఉ. అర్జునుఁ డైననేమి హరుఁ డైన మురాంతకుఁ డైననేమి య
త్యూర్జితశస్త్రసంపదల నొప్పినసౌబలసైంధవాదులున్
నిర్జరనాథసన్నిభుఁడు నీరజబాంధవపుత్త్రుఁ డుండ నీ
కర్జము లేల చెప్పెదరు గాంగతనూభవ కుంభసంభవా! 54

క. పని సాగనిండు మా కిది, కనకస్నానంబు మీరు గావించు క్రియన్
మనమున నెంచెద భుక్తికిఁ, గొనుఁ డిచ్చెదఁ గొఱఁతపడిన గొబ్బున మీకున్. 55

వ. అని పల్కి సుయోధనుండు వెండియు నిట్లనియె. 56

క. ఉసిరూత లింకఁ గూసినఁ, బశుపతిపాదంబు లాన ప్రాణంబులతోఁ
గుశలముగ బ్రతుక లే రిఁక, వసియింపక లేచిపొండు వదరకుఁ డిచటన్. 57

సీ. బలరాముఁ డొకఁడు మాకర మైన కార్యముల్ సఫలంబు లగుగాక విఫలమగుచు
పెండ్లిఁ జూడఁగ మీకుఁ బ్రీతి గల్గిన రండు కల్గకుండిన నిండ్లకడకుఁ బొండు
మీరు రాకుండిన మిక్కిలిక్షేమంబు విఘ్న మించుక లేక లగ్న మగుచు
మావెంట మీరు రా మర్కటశతకంబు గుంపుబాయక జతఁ గూడినట్టు
తే. లనుచు బహునిష్ఠురోక్తుల నాడుచున్న, యధిపుఁ డైనట్టికురుపతియాననంబుఁ
గాంచి సిగ్గును గోపంబుఁ గడలుకొనఁగఁ, బలికె రప్పుడు భీష్ముండు బాణగురుఁడు.

క. కాలుఁడు ప్రేరేపఁగ నీ, వీలాగునఁ బెద్దపిన్న లెఱుఁగక పల్కె
వేలా దుర్యోధన నీ, కాలము సమకూడినట్లు గనఁబడె మాకున్. 59

ఉ. భానుతనూజుఁడున్ శకుని పల్కినపల్కులు పథ్య మంచు నీ
వీనులఁ జేర్చి యెల్లపుడు వీరిఁడికార్యము లాచరించుచో
మానవనాథ నీ కిదియు మంచిది గా దని బుద్ధి చెప్పినన్
మానసమందు నిప్పు లిడుమాడ్కిఁ గనంబడె నీకు దుర్మతీ. 60

క. నాగారిగమనుఁ డొప్పమి, సాగదు లగ్నం బటంచుఁ జయ్యనఁ దెలుపన్
రోగికిఁ బథ్యాన్నం బిడు, లాగున నీమదికిఁ దోఁచెరా పాపాత్మా. 61

ఉ. పెక్కులు పల్క నేమిటికిఁ బెండ్లిని జూడఁగ మేము రాము నీ
కక్కఱగల్గుబంధువుల నందఱఁ దోడ్కొనిపొమ్ము కార్యమున్
జక్కఁగఁ జేసుకొ మ్మనుచు సభ్యులు చుట్టలు చూచుచుండ వా
రక్కడ నుండక స్వ్వడలి రాగ్రహరోషకషాయితాత్ములై. 62

వ. అట్టిసమయంబున. 63

క. గురుఁడును శంతనుపుత్త్రుం, డిరువురు దక్కంగ భూసురేంద్రులు నృపులున్
పురజను లందఱు లక్ష్మణ, పరిణయవీక్షాత్తు లగుచు బహువేడుకతోన్. 64

వ. అత్యంతముదంబునం బొదలుచుండి రాసమయంబున. 65

సీ. పాండ్యపౌండ్రవిదర్భబంగాళనృపతులు గజతురగాందోళికముల నెక్కి
వచ్చిరి వేగమె వంగకళింగాంగరాజు లేతెంచి రాలగ్నమునకు
మాళవ మలయాళ మగధ నేపాళాధిపతులు దంపతులతో భద్రదంతి
యూథంబు లెక్కి రాయోధులతోఁ గూడఁ బరతెంచెఁ గాశ్మీరధరణివిభుఁడు
తే. మఱియు గాంధారకోసలమనుజపతులు, ద్రవిడకొంకణకొంకణధరణివిభులు
వత్సమత్స్యకరూశాంధ్రవసుమతీశు, లవని గంపింప వచ్చి రాహాస్తిపురికి. 66

వ. ఆసమయంబున. 67

తే. సర్వకేతనుఁ డత్యంతసంతసమునఁ, బప్పు కలమాన్న మొబ్బట్లు పాయసంబు
లాజ్యధారాప్రవాహ మై భోజ్యమమర, ధరణిసురులకుఁ జేసె సంతర్పణంబు. 68

వ. ఇట్లు సంతర్పణంబు గావించి భోజనానంతరంబునఁ దాంబూల గంధమాల్య వస్త్రభూషణంబులఁ బూజించి ప్రయాణోత్సవంబు పాటించి రాసమయంబున భానునందన బృహద్బలపృషసేనవింశత్యగ్ని కోప సుశర్మశకునిజయద్రథభూరి శ్రవకృపాచార్యద్రోణ సోమదత్తాది రథికవరులు పుత్త్రమిత్త్రకళత్త్రంబులతో రథాశ్వాదివాహనంబు లారోహించి రాసమయంబున ధార్తరాష్ట్రుం డొక్కరథం బుపైఁ గూర్చుండె నప్పు డంతఃపురకాంత లందలంబుల వసియించి యేతేర లక్ష్మణుం డొక్కమహాగజంబుపైఁ గూర్చుండె నివ్విధంబున దుర్యోధనుండు బంధువర్గంబులం గలిసి బ్రాహ్మణవైశ్యశూద్రవైతాళికవారాంగనాదినివహంబులతోఁ బృథివి కంపింపఁ బురంబు వెడలె నప్పుడు. 69

సీ. శ్రీరస్తు తే యంచు క్షితిసురశ్రేష్ఠులు చెలఁగి పల్మారు నాశీర్వదింప
ధృతరాష్ట్రగర్భవిస్తృతవార్ధి చంద్రమ యని వందిమాగధు ల్వినుతి సేయ
హాస్తిపురాధీశ యమరేంద్రసంకాశ యనుచు వైతాళికుల్ ఘనతఁ బొగడ
ఫణిహారు లోకలఁక బంగారుబెత్తముబట్టి ముందఱ బరాబరులు సేయ
తే. తుడుము తప్పెట ఢక్క తుత్తుంభికలును, ఝర్ఝరీభేరిమర్దలఝల్లరీలు
మొదలయినవాద్యనాదముల్ మ్రోయుచుండ, ద్వారవతిఁ జేరె నవమిశా ధరణివిభుఁడు. 71

వ. ఇవ్విధంబున.

మ. కురురాజేంద్రుఁడు వచ్చురాక బలుఁ డాగోవిందుతోఁ దెల్పక
న్వరమామోదముఁ బొంది బ్రాహ్మణులతో బాహూద్భవశ్రేణితో
నరసాగ్రేసరు లైనబాంధవులతో సామంతయూథంబుతోఁ
దరుణీబృందముతో రథాశ్వములతో దంతావళశ్రేణితోన్. 72

వ. ఎదురుకొని ధార్తరాష్ట్రుం గాంచి కుశలసమాచారంబు లడిగి తదనంతరంబ భూరి భేరీరవంబులు చెలంగ వందిమాగధులు కైవారంబులు సేయ వారాంగనలు నాట్యం

బులు గావింప పరశుపట్టిసభిండివాలాదియాయుధంబులు ధరించి వీరభటులు నడువ
సంకర్షణుండు దుర్యోధనుం దోడ్కొనివచ్చుసమయంబున. 73

క. ద్వారకనగరంబునఁగల, నారీమణు లాత్మ నలరి నవరత్నములన్
దీరిన సౌధాంతరములఁ, జేరి తదాలోకనంబు చేయుచుఁ దమలోన్. 74

మ. చెలియా కన్గొను హస్తికక్ష్యసిడముం జెన్నొందునాతేరుపై
గలవాఁ డంబుజమిత్రదత్తవరసత్కారంబుచేఁ గుంతికిన్
దొలుచూలీతఁడు సూతపుత్రుఁ డనఁగా దుర్యోధనుం జేరి యా
బలభిత్సూనుని నాజి గెల్తు ననుచు న్భాసిల్లుఁ గర్ణాఖ్యతోన్. 75

క. అతిరమ్యం బగురథమున, సతియుతుఁడై వచ్చువాఁడు సభలోఁ గృష్ణ
న్నలిఁ గ్రొవ్వి చీర లొలిచినఁ, బలితుఁడు దుశ్శాసనుండు పద్మదళాక్షీ. 76

మ. తురగారూఢులు చుట్టునుం గొలువ ఖద్యోతప్రభాతుల్య మా
నరదం బందు వసించి వచ్చుకతనుం డబ్జాక్షి వీఁడే కదా
కరుణాసాగరులైనపాండుసుతులం గాపట్యవృత్తంబుతో
సిరికిం బాసినదుష్టచిత్తు శకునిన్ శీఘ్రంబె వీక్షింపుమా. 77

తే. సింహలాంగూలభూషితసిడము కలుగు
రథమునం దభ్రమణిమాడ్కి రహి వహించి
చూడ్కులకు వేడ్క మిఱుమిట్లు చూనుపు నతఁడు
ద్రోణసుతుఁ డశ్వత్థామ తోయజాక్షి. 78

ఉ. బంగరుగోవృషధ్వజము భాసిలుదివ్యరథంబుమీఁద సా
రంగధరుండు నాఁ బరగి రాజిత మాఘనబాణశస్త్రపా
రంగతుఁడై మహిం గలుగురాజులకెల్లను శిక్ష సెప్పువాఁ
డంగన చూచితే కృపుఁ డహస్కరతేజుఁ డరాతిరాత్రికిన్. 79

మ. ఉరగేంద్రధ్వజ మొప్పియున్నరథమం దుల్లాసియై సారెకున్
దరహాసద్యుతు లుప్పతిల్ల మమతం దాలాంతు వీక్షించుచుం
బరమానందము నొంది బాంధవులతో భద్రేభయూథంబుతోఁ
దురగశ్రేణితొ వచ్చుదుష్టుఁ డతఁడే దుర్యోధనుం డంగనా. 80

వ. నవరత్నస్థగితం బైనరథంబున నర్కువగిదిం దోఁచు నతని. 81

క. మేరునగధైర్యధుర్యుని, సారసరిపువంశవార్ధిచంద్రోదయునిన్
వారిజముఖి వీక్షించితె, భూరిభుజాటోపబలుని భూరిశ్రవునిన్. 82

చ. కనకమణీమయాభరణకాంతులు దిక్కులు నిండ సారెకు
న్నినరుచి నడ్డగించుమదమేనుఁగుమీఁద వసించునాతఁడే

మనశశిరేఖకు న్మగఁడు మన్మథసుందరతుల్యు లక్ష్మణున్
గనుఁగొను మంబుజాక్షి యనఁగా విని యొక్కలతాంగి యి ట్లనున్. 83

సీ. కలకంఠి యభిమన్యుఘనపరాక్రమశక్తిమహిమ నెన్నఁగ నొక్కమాస మగును
భూరిసంగరరంగధీరోద్భవస్ఫూర్తి రోష మెన్నఁగ నొక్కఋతువుపట్టు
శస్త్రవిద్యాభ్యాసచాతుర్య మనుదాని జాడ నెన్నఁగ నొక్కయేడుపట్టు
అంగాంగసౌష్ఠవశృంగార మనియెడు గరిమ నెన్నఁగ నొక్కకల్ప మగును
తే. అట్టిసౌభద్రునకు లక్ష్మణాహ్వయునకు, జలధితోఁ గాల్వ పులితోన జంబుకంబు
దంతితో దోమ భానుతో దర్పణంబు, పాటలాధరి గణుతింప సాటియగునె. 84

వ. అని యిట్లు పురంధ్రీజనంబు లనేకవిధంబులఁ బలుకుచున్నసమయంబున నీలాంబ
రుండు దుర్యోధనుం దోడ్కొని వచ్చి కాంచనమణిమయం బగుమందిరంబున విడి
యించి భక్ష్యపాయసపదార్థంబులఁ దృప్తులం గావించి తాంబూలంబు లిప్పించు
సమయంబున. 85

క. కలహంసనువాక్యంబులు, జలజానన యిందురేఖ సఖిబృందముతోఁ
దెలుపక వస్త్రాభరణం,బులు దాల్పక పాన్పుమీఁదఁ బొరలుచు నుండెన్. 86

వ. ఆసమయంబున. 87

తే. పడఁతు లరుదెంచి శశిరేఖపజ్జఁ జేరి, మజ్జనము సేయ లెమ్మని బుజ్జగింప
మానివచనంబు లూఁతగా మగువ లేచి, విమలమణిపీఠిపై నుండుసమయమునను. 88

క. లలనలు సంపఁగినూనెన్, తలయంటుచుఁ బాటపాడి దరహాసముతో
కలశము లిడి పన్నీటన్, జలకము గావించి సఖులు సంతోషముతోన్. 89

సీ. తడియొత్తె నొకచెలి తరుచైనజలతాయిఫూలచీర యొకర్తు పొందుపరచె
వనిత యొకతె మంచి వజ్రాలకాంతుల రహిమించు చంద్రపూరవికెఁ దొడిగె
జడవేసె నొకబోటి కటిచొక్కమపరంజి కుప్పెరేకడి యొక్కకొమ్మ పెట్టె
పద్మరాగప్రభాభాసితం బై మించు పాపటబొ ట్టొకపడఁతి గట్టె
తే. మణులుదాపినకమ్మలు మౌక్తికముల, నొప్పుబొగడలు బావలీ లొకతె పెట్టె
సరిగెముక్కరయును బన్నసరము తీఁగె, మొదలుగాఁగలసొమ్మొకముదిత దాల్చె.

క. విరిసరు లొకసతి దురిమెన్, పరిమళగంధంబు నొక్కపణఁతియె పూసెన్
తరుణియొక తైణమదమున, తెరవగుఫాలంబుమీఁదఁ దిలకము దీర్చెన్. 91

క. పాటలగంధికిఁ గన్నులఁ, గాటుక వెస దీర్చె నొకతె గండస్థలులన్
నీటుగ మకరికరేఖలు, బోఁటి యొకతె వ్రాసె నచటిపొలఁతులు మెచ్చన్. 92

వ. ఇట్లు సఖీజనంబు లచ్యుతాగ్రజపుత్త్రిక కలంకారంబు గావించుతటి లగ్నకాలం
బరుదెంచె నని బాంధవు లత్యంతసంతసంబునం దేలుచుఁ బరిమళద్రవ్యంబులు

కాంచనరజితపాత్రలం దిడుకొని పరతెంచువారిం గని శశిరేఖ తనమనంబున నిట్లని వితర్కించె. 93

క. అనిమిషమునివాక్యంబులు, విని నమ్మితి నెదురుకోలువే శివ నచ్చెన్
జనపతులందఱు గుములై, చనుదెంచిరి పిమ్మ మింక జరుగునె తలఁపన్. 94

క. మనసిజమూర్తి సుభద్రా, తనయుని వీక్షింతు ననుచుఁ దర్కాలు పలుకన్
మునికేమివినముఁ బోసితి, నని వెండియు నాత్మయందు నమకొనసాఁగన్. 95

తే. వివిధభూషలఁ ద్రిమ్మరువిజయసూనుఁ, డిచటి కేతెంచుటకు హేతు వెద్ది కలదు
మేనితో పొత్తు విడువనిదాన నగుట, నొరుల నననేల నేనేయుమురితమునకు. 96

క. ఈలక్ష్మణునకు సతినై, యేలాగునఁ గాపురంబు నే నొనరింతు
న్నీలాంబరుఁ డవివేకుం, డీలాగునఁ జేసె ముందు నేలా గగునో. 97

క. గళమున వరకాంచనమం, గళసూత్రము లక్ష్మణుండు గట్టక మునుపే
నలకూబరతుల్యుం డగు, బలభిత్సుతసుతునిఁ జూపు పరములు గలరే. 98

క. అని యీలాగున వగచుచు, ఘన మగుతాపంబుచేతఁ గళవళపడుచుం
జని నవరత్నఖచితపు, పనిగలమంచంబుమీఁదఁ బవళించెఁ దగన్. 99

వ. అంత నక్కడ ఘటోత్కచుండు. 100

సీ. వనజాక్షి శశిరేఖ వైవాహికదినంబు సనుదెంచె నని లేచి సంభ్రమమునఁ
బినతల్లితోఁ జెప్పి తనతల్లి కెఱిఁగించి యభిమన్యునకుఁ దెల్పి యంతరిక్ష
వీథికి నెగసి ము న్వినతాతనూజుండు నమృతసంహరణార్థ మమరపురికిఁ
జనుదెంచువిధమునఁ జని ద్వారవతిచుట్టు విడిచినగజహయవితతు లరసి
తే. మణిమయం బగురథముల మనుజపతుల, వెంటఁ జనుదెంచు సేనల వీరభటుల
వసుధగీర్వాణకోటుల వైశ్యశూద్ర, జనులవీక్షించి నవ్వుచు దనుజవిభుఁడు. 101

వ. సాయంకాలంబునకుఁ బురసమీపంబునకుం జని యదృశ్యత్వంబున నంతశిపురంబుఁ జొచ్చి బలభద్రునగరు ప్రవేశించి పరిణయవస్తువు లొకరికొకర రందిచ్చునందడిగొను వారిజాక్షుల వీక్షించుచుం జని మఱికొంద ఱైరువలు పన్నీరుకలశంబులం దిడుకొని నానారత్నఖచితంబు లైనభూషణంబులు దాల్చి పువ్వుహారంబులు దుఱిమి పట్టుపై తిణీచెంగావిచేలంబులుగట్టి దీపికాకళికలచెంత నిలువంబడి యొకరిసింగారంబొకరు వర్ణించువారలం గడచిపోన మఱికొంద ఱంగనలు పెండ్లికొడుకువా రరుదెంచిరి పొండుపొండని మూఁపులువట్టి ద్రోచువారలఁజూచుచు ఘటోత్కచుండు లోపలికిం బోవ నొకమందిరంబున దివ్యమణిమయం బగుమంచంబుపైఁ బవళించియున్న శశిరేఖం జూచి సుభద్ర చెప్పినప్రకారంబున రూపలక్షణంబు లగుపడుట నెఱింగి శశిరేఖగా నిశ్చయించి తనమాయచే నిద్రింపంజేసి తనతమ్మునికిఁ దగినకన్యయని

సంతోషించి మఱఁదలి న్నెత్తుట దోషం బని యెంచి మంచంబు శిరంబునం దిడు
కొని మాయాబలంబున నొరుల కగుపడకుండ సురసమూహంబు లౌరా యని విను
తింప గగనమార్గంబునం బఱతెంచి తనవనంబున శశిరేఖం డించి సుభద్రాకుమారు
నితో హిడింబానందనుం డిట్లనియె. 102

క. ఏమని చెప్పుదు నే నీ, రామామణికొఱకుఁ జనిన రారా జటకున్
సామజరథహయసైన్య, స్తోమముతోఁ బుత్రమిత్రసోదరయుతుఁ డై. 103

క. చనుదెంచినాఁడు మఱలం, జని రాజును సూతసుతుని సైంధవదుశ్శా
సనులమదం బణఁగించెద, ననుజా నీ విచట నుండుమని పల్కుటయున్. 104

క. విని సౌభద్రుఁడు వడముడి, తనయుని వీక్షించి పలికెఁ దగునా నీకున్
నను డించిపోవ దుర్యో, ధను నామము విన్న నెట్లు దాళుదు నన్నా. 105

క. నిర్జరపతినందనుఁ డగు, నర్జునునకు నుద్భవించి యనిమొనలోనన్
దుర్జను లగుకౌరవులను, నిర్జింపక యున్న బ్రతుకు నిష్ఫల మరయన్. 106

క. ఇలలోఁ దండ్రికిఁ దనయుఁడు, గలిగినఁ దనతండ్రికంటె ఘనవిక్రముఁ డై
విలసిల్లినఁ గొడు కనఁదగు, బలహీనుఁడెఁ గొడు కటంచుఁ బలుకం దగునే. 107

క. పోటబ్బినసమయంబున, బోఁటివలె న్నణఁగియున్న భుజబలశౌర్యం
బేటికి శస్త్రాస్త్రము లిం, కేటికి నీకార్ముకంబు నింకేమిటికిన్. 108

క. జనకులఋణంబుఁ దీర్పఁగ, మన కిది సమయంబు గనుక మఱి యిచ్చోటన్
పనియేమి నాకు నీతోఁ, జనుదెంచెద నంచుఁ బల్కె సౌభద్రునితోన్. 109

చ. వడముడిపుత్రుఁ డిట్లనియె వాసరవల్లభురశ్మి లేనియి
య్యడవిని ముగ్ధల న్విడిచి యాజికిఁ బోయిన నిందురేఖయున్
దడబడుచుండు వెండియును దల్లిమనంబునఁ దల్లడించుచున్
గుడిగొనుచింత రేబగలు గుందుచు నుండరె నీవు వచ్చినన్. 110

సీ. ఎఱుఁగుదు నాకంటె నెక్కువౌ విలువిద్యఁ బారంగతుఁడ వీవు పార్థపుత్ర!
ధృతరాష్ట్రపుత్త్రులత్రుళ్ళణంచుటకుఁ గా నిరువురు చన నేల నేనచాలు
నదిగాక మేనల్లుఁ డై మేనమామపై ధనువు బూనుట నీకు ధర్మ మగునె
నిలువు మిచ్చట నీవు నే నేగి క్షణములో గంతులువేయింతుఁ గౌరవులను

తే. యదుకుమారులఁ గొందఱి మదమణంతు, ననుచు మీసము లొకచేత బట్టి లీడి
భీకరాకారమున లేచి కేక వేసి, కామగమనంబుతో నేఁగె భీమసుతుఁడు. 111

వ. అట్టి సమయంబున. 112

తే. ఆఘటోత్కచుమాయచే హాయిఁ జెంది, నిద్రబోయెడుశశిరేఖనేత్రయుగముఁ
దెఱచి మిన్నందుభూజము ద్దేరి చూచి, కలవరింపుచు దిగ్గున నులికి లేచి. 113

తే. కట్టెదుట నున్నసౌభద్రుఁ గాంచి మఱియు, ఫల్గునునిరాణి వీక్షించి పాదములకు

మ్రొక్కి సిగ్గున శశిరేఖ మోము వంచి, గట్టుతనమునఁ దనకుఁ దా నిట్టులనియె.

క. ఎక్కడ ద్వారకనగరం, బెక్కడ యీవిపినభూమి యేగూర్కెడుటల్
యొక్కడ మేల్కాను టెక్కడ, నిక్కము యిది చిత్రమంచు నెమ్మది నెంచున్.

వ. ఇట్లు తలంచి మఱియును. 116

సీ. ఎవ్వరు నను దెచ్చి రివ్వనభూమికి నెంతపుణ్యాత్ములో యెంచిచూడ
మునినారదునిమాట ముంగొంగుమూటగాఁ దలఁచి యోతనికేను దండమిడుదు
నతఁడు చెప్పినమాడ్కి నభిమన్యుఁ గనుఁగొంటి నానోము ఫలియించె నలినగర్భు
వ్రాఁత ధారుణియందు వ్యర్థంబు గా దనుపలుకులు దప్పునే తలఁచి చూడ

తే. నద్దమునఁ దోఁచులిబ్బి చెయ్యబ్బినట్లు, విపినభూముల కేఁగినవిజయసూను
సురుచిరంబైనరూపంబుఁ జూడఁగలిగె, బుదమినేఁ జేయుసుకృతంబుఁ బొగడవలదె.

వ. అని యిట్లు తలంచుచు మఱిమఱినగవుతో లజ్జానన యై యూరకున్నకోడలిం జూచి
సుభద్ర యిట్లనియె. 118

క. ఇలుఁ బాసి వచ్చినా నని, తలఁపకు నీబావ భీమతనయుం డుండే
నిలయము మనయిల్లనుకో, బలభద్రతనూజ వలదు పలుసంశయముల్. 119

వ. అని సుభద్ర వెండియు నిట్లనియె. 120

క. ఇంచుక శంకింపక రాత్రించరుఁ డట కేగుదెంచి ధీరాత్ముఁ డై
మాచమతో నిటు దెచ్చెను, పంచాననమధ్య నిన్ను ఫాల్గునికొఱకై. 121

వ. అని చెప్పి మఱియును. 122

క. కూరిమి గలతలిదండ్రులు, లేరని చింతింపవలదు లేమా యెల్లుం
దూరికిఁ బోదము నీకున్, గోరికగలవిధముఁ దెల్పు కొంకక నాతోన్. 123

క. అని యివ్విధమునఁ బల్కిన, ఘనవేణి సుభద్ర మోముఁ గని ముద మలరన్
వనజారిరేఖ యెంతో, వినయంబున నిట్టు లనియె వ్రీడానన యై. 124

క. బొత్తిగ బాల్యంబున నా, చిత్తము నీసుతునియందుఁ జేర్చినదానన్
చిత్తము లే దెవ్వరిపై, నత్తా యిది నిశ్చయంబు హరితో దనినన్. 125

తే. వినియు ముదమంది యావేళ విజయుపత్ని, కోడలిగుణంబు లగ్గించి కొడుకుఁ గాంచి
రాత్రి రాజుకు రోహిణి రతికి మదనుఁ, డొప్పి నటువలె వీరికి నొప్పె ననుచు. 126

వ. సుభద్ర తనకొడుకు కోడలికిం గలశృంగారంబు మనంబున నెన్నుచుండె నని వైశం
పాయనుండు జనమేజయునితో మఱియు నిట్లనియె. 127

తే. ఇందురేఖకు నభిమన్యునందుఁ గలుగు, మోహ మేమని చెప్ప దామద్దుగుమ్మ
జననిజనకులఁ దమ్ముల సఖుల నైనఁ, దలఁప దించుక మదిలోన ధరణినాథ. 128

వ. అట్టిసమయంబున ఘటోత్కచుం డక్కడ. 129

ఉ. ద్వారక కేఁగి చిత్తమునఁ దా నొకయోచనఁ బన్ని వేగమే
సీరి గృహంబులోపలికి శీఘ్రమె పోయి ముదంబునొందుచున్
నీరజనేత్రి ముందుశయనించిన చిత్తరుచవికెలోపలన్ (?)
జేరి శశాంకరేఖవలె చేడియ యయ్యె నరేంద్రచంద్రమా. 130

వ. అని వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 131

ఉ. మోమును గన్నులు న్నాసలు ముక్కును జెక్కులు చొలు దంతము
లోకమల మైనవెంట్రుకలు గొప్పకుచంబులు కౌను పాదముల్
సామజయాన మవ్వగలు చక్కనిపల్కులు కుల్క లన్నిటన్
రామునిపుత్రిగా మెలఁగె రాక్షసమాయల నేమి సెప్పుదున్. 132

వ. ఇట్లు శశిరేఖయాకారంబు ధరించి ఘటోత్కచుండు. 133

ఉ. నిక్కము పెండ్లికూఁతు రని నిర్మలరత్నపుగద్దెఁ జేరి తా
దిక్కులు చూడ కాసువతి దివ్యతరం బగునాణిముత్తెపున్
ముక్కరమీఁద జాక్కలిడి ముగ్ధతెఱంగున మోముసెత్తకన్
యెక్కడలేనిసిగ్గు తలకెక్కినమాడ్కి శిరంబువంచుచున్. 134

వ. ఇట్లున్నసమయంబున. 135

సీ. బలభద్రుఁ డరుదెంచి బంధుజనాళితోఁ జనుదెంచె వైవాహసమయ మనుచు
వినుపింప నెఱిఁగి యామనుజేంద్రునకుఁ దెల్పఁ గురురాజు తమ్ముల దొరలఁ జూచి
యెదురుకోల్వేళయ్యె నెందుకు తడవింక నని చెప్పి యాదవాంగనలఁ బిలిచి
మనలక్ష్మణునిఁ బెండ్లితనయునిఁ గావింపుఁ డని పల్కఁగా విని యబ్జముఖులు
తే. శిరము మజ్జన మొనరించి కురులు చలువ, చేలమున నొత్తి తడియార్చి చిక్కఁబాపి
వెంటనే సాంకువము నంటి గంటువేసి, పసులదీరిన బంగారుపాగఁ జుట్టె. 136

తే. బంగరుపుతీఁగెపనిగల్గు నంగరేకఁ, దొడిగి కెంబట్టుఁగి మించుదుప్పటంబు
వల్లెవా టందముగ వేసి మల్లెపూల, సరము లొకకొన్ని శిరమునఁ దఱిమి రఱియు.

సీ. గోధిపై కస్తూరి గొప్పతిలకమిడి యాణిముత్తెంబులహార మేసి
పద్మరాగంబుల భాసిల్లుకడియము ల్కరముల ధరియించి కనకరత్న
ములచేత విలసిల్లుమొలత్రాడు కటిఁ జుట్టి వెలగల్గు నుంగరాల్ వ్రేళ్లఁ దొడిగి
యింద్రనీలద్యుతు లింపొందుపోగులజత లంద మమరఁగా శ్రుతులఁ జేర్చి
తే. తరుణులందఱు బంగారుతట్టలందుఁ, జారుకలశంబు లిడి మహాసంతసమున
నెదురుకోల్వేళఁ జనుదెంచె నేఁగుఁడంచు, లక్ష్మణునివెంట వెడలిరా రాజముఖులు.

వ. అట్టియెడ సుయోధనుండు తనకుమారుం డయినలక్ష్మణుని సామజేంద్రంబుపైవసింప
నియోగించి గంధతైలంబునఁ బ్రకాశించు కరదీపికాసహస్రంబులు వెలుఁగఁ బరి

చారికజనంబులు మౌక్తికతోరణంబుల నొప్పుగొడుగు లనేకంబులు పట్టి నడువ నేలవేల్పులు క్రమోచితంబుగా స్వస్తివాచనంబులు చదువ వందిమాగధబృందంబు లప్పటప్పటికిఁ గైవారంబు లొనరింప వేత్రహస్తులు మహారజితరత్నమయంబులైన బెత్తంబులు పట్టి బరాబరులు గావింప వేశ్యాంగనలు మృదంగతాళాదివాద్యంబులు మ్రోయ సూచీముఖకటకాముఖతామ్రచూడపతాకాత్రిముఖాది హస్తభావంబుల నాట్యంబులు సలుప నానాదేశంబులనుండి వచ్చినధారుణీపతులు పుత్త్రకళత్త్రంబులతో నడువఁ గర్ణాదిరథికవరులు బాణబాణాసను లై పెండ్లికుమారునిదంతికిరుపార్శ్వంబుల రా దుశ్శాసనాదిసోదరులతో దంపతీసమేతంబుగా మహేంద్రుండునుంబోలె జనుదెంచురారాజునకు నీలాంబరుండు సారణకృతవర్మోద్ధవాదియదుకుమారులతో వారివారికళత్త్రంబులతో నెదుర్కొనియె నాసమయంబున నుభయపార్శ్వంబులవా రొండొరులక్షేమలాభంబు లడుగుచు గంధకలపంబులఁ బూయుచు వారివారికిం దగినయుపచారంబులు గావించుతఱి సంకర్షణుపత్ని యగురేవతీదేవి తనపుత్త్రిని లక్ష్మణున కొసంగుట మనంబున కసమాధానంబుగా నుండుటం జేసి పతియాజ్ఞానుసారంబున దుర్యోధనుపత్నికి గంధపుష్పతాంబూలంబు లొసంగి పసిలోఁ బదునొకొండుమాడ్కిఁ గుశలంబు లడుగుసమయంబునఁ బౌరజనంబు లొండొరులమొగంబు వీక్షించుచు నిట్లనిరి. 139

క. దానవభంజనువాక్యము, మానసమున నిడక బలుఁడు మతిహీనుండై
మానిని సోదరితోడన్, మేనల్లుని నడవి కనిచి మిక్కిలిసిరికిన్. 140

క. ఆసించి దురాత్ములతోఁ, జేసెను బాంధవము ముందుచే టెఱుఁగక తాఁ
జేసినయవివేకమునకు, గాసిల్లును నితఁడు ముందు గాండివిచేతన్. 141

క. బలశౌర్యశస్త్రకుశలత, కలిమిన్ ప్రఖ్యాతి నొందుకౌంతేయులకున్
చెలి నొసఁగక తాలాంకుఁడు, తులువలకున్ బుత్త్రి నొసఁగె దురితాత్ముఁడై.

క. అని యివ్విధమునఁ బౌరులు, ననుకొనఁగా వారువారు నతివేడుకతోఁ
జని పచ్చనితోరణములు, గనుపట్టెడు మందిరంబుఁ గని యచ్చోటన్. 143

క. పులుఁగిండిప్రస్తరంబుల, విలసిల్లెడుభిత్తు లమరి విద్రుమలతలన్
చెలువొందెడుదూలంబులు, తళతళ మనుస్వర్ణరత్నస్తంభంబులతోన్. 144

తే. తులరహితమైనముత్తెంపుతోరణములఁ, జాల రాణించుపరిణయశాలఁ జొచ్చి
కళలు దేరెడుచిత్రకంబళులమీఁదఁ, జేరి వసియించి రానందచిత్తు లగుచు. 145

వ. అట్టిసమయంబున. 146

సీ. తొలుత హైడింబుండు తొయ్యలిఁ గొనిపోయి తనవనంబున డించి తత్క్షణంబ
చనుదెంచి శశిరేఖయాకారమును దాల్చి మందిరంబున నుండుమార్గ మెఱిఁగి

పంకజనాభుఁ డాపవమానపౌత్రుని సాహసంబున కాత్మ సంతసించి
ముసలితోఁ దెల్పక ముసిముసినగవుతో నరుదెంచి మధ్యకక్ష్యాంతరమున

తే. శినివరుఁడుఁ గొందఱాప్తులుఁ జేరి కొలువఁ
గొలువులో నున్నహరిఁ జూచి కురువిభుండు
హంసనందనదుశ్శాసనాదు లైన
హితులఁ దమ్ములఁ గనుఁగొని యిట్టులనియె. 147

క. బలదేవుఁడు మనకొఱకై, జలజాక్షునిఁ జాల దూరి సౌభద్రనకుం
జెలి నొసఁగ ననుచుఁ బల్కిన, హలిపైఁ గోపించి చనినహరి తెఱఁగరయన్. 148

క. తనపూన్కి తప్పినందున, వనమున విహరించుపార్థు వదలినవాఁడై
మనతెగలోఁ జొచ్చుటకున్, మనమున యోచించు నితనిమర్మము దెలిసెన్. 149

క. నేను కనుసన్నఁ జేసినఁ, దానును దనతమ్ముఁ డిటకుఁ దర్లుదు రైనన్
నే నేల పిలుతు నీపనిఁ, దా నిఁకఁ దప్పింపఁగలఁడె దామోదరుఁడున్. 150

తే. మతిరహితు లగుచుఁ గౌంతేయు లితని నమ్మి, విఱ్ఱవీగుదు రది మాన్ప వేళగనుక
హాలిని జేకొని కృష్ణసాత్యకులనెల్ల, వరుసఁ బొలిమేర దాటింపవలయుననుచు. 151

చ. గుసగుసలాడ కౌరవులఁ గోపమునన్ గని కృష్ణతమ్ముఁడున్
వెస నొఱ నున్నవాలుఁ గొని వేగమె యీ ధృతరాష్ట్రపుత్త్రులన్
వసుమతిఁ గూల్చి వత్తు నన వారిజనాభుఁడు చూచి తమ్ముఁడా
యసదృశు లైనపాండుసుతు లాపుప్రతిజ్ఞలు నీ వెఱుంగవే. 152

క. సమరము సేయఁగ నీకున్, సమయముగా దుడుగు మనుచు శైనేయునితోఁ
దమకము వల దని వెండియుఁ, గమలాక్షుం డిట్టు లనియెఁ గలకల నగుచున్. 153

క. సిరిచేత మత్తు లగుచున్, గురుభీష్ములబుద్ధి వినక కుత్సితమతు లై
పరతెంచి వీరలందఱు, పరిపరిమార్గములఁ ద్రుళ్లిపడియెద రైనన్. 154

క. ఇంకొకగడియకు లోఁగా, సంకర్షణధార్తరాష్ట్రసౌబలకర్ణుల్
బింకము చెడి భయమున నే, వంకలకేఁగెదరో చూడు వాసవిశిష్యా. 155

క. అని హరిపల్కినపల్కులు, విని గ్రక్కునఁ గోప మణఁచి వేఱొకటనకన్
తనచేతివాలు మరలన్, శినివరుఁ డొరయందుఁ జేర్చి చింతిలుచుండెన్. 156

వ. అట్టియెడ సుయోధనునిపౌరోహితు లత్యంతసంతోషంబున లక్ష్మణుం సుచితపీఠం
బున నునిచి మంత్రోచ్చారణోన్ముఖు లగుచు నియతోపకరణంబు లొనరించి కన్యకా
మణిని రప్పింపుఁ డనిన విని నీలాంబరుండు సఖీజనంబులతో శుభలగ్నం బేతెంచె
సత్వరంబుగాఁ బెండ్లికుమార్తెం దోడ్కొనిరం డనిన వారేఁగి యామాయా
శశిరేఖం జేరి యిట్లనిరి. 157

క. వనితా సౌభద్రుని పై, మనసుంచకు లక్ష్మణుండు మగఁ డని నుదుటన్
వనజభవుఁ డిడినలిఖితముఁ, బనివడి తప్పింప మఱియు భవునకు వశమే. 158

క. సిరిఁ బాసి విపినభూములఁ, బరదేసులమాడ్కిఁ దిరుగు పార్థాత్మజుని
న్వరియింప నీకుఁ జెల్లునె, సరసీరుహనేత్రి వినుము సంతోషమునన్. 159

క. విపులముగ నీవు చేసిన, తప మేమని చెప్పవచ్చు ధనపతిసుతుతో
నుపమింపఁదగినలక్ష్మణుఁ, డపురూపపుమగఁడు దొరకెనమ్మా నీకున్. 160

క. పురుహూతసన్నిభుం డగు, కురురాజున కరయ ముద్దుగోఁడల వైతో
కరిరాజగమన మమ్మున్, మఱువకు మామీఁదఁ గూర్మి మానకు మమ్మా. 161

క. అబ్బుర మగుభాగ్యము నీ, కబ్బెను అత్తింటి కీవు నరిగినతఱి నీ
యబ్బలు చూడఁగ వత్తురు, నిబ్బర మగుబుద్ధి గలిగి యేలుము మగనిన్. 162

వ. అని యివ్విధంబున లతాంగులు కాలోచితానుభాషంబు లాడిన విని మాయాశశిరేఖ
యిట్లనియె. 163

క. ధృతరాష్ట్రసుతుఁడు మామై, యతనిసుతుం డీశుఁ డైన నాపాలి నేఁడీ
యతిశయ మెన్నఁగ మీకున్, మతి చాలదు సుదతులార మఱి యేమందున్. 164

తే. పతియు ననుఁగూడి భూమిపై బ్రతికె నేని, మదనసౌఖ్యంబులో మిమ్ము మదిఁ దలంపఁ
జూడవచ్చినఁ గన్నెత్తిచూడ నేను, ముసలిపాదంబులాన యో ముగుదలార. 165

తే. తాలధరుఁ డైన హరుఁ డైన ధాతయైనఁ, దొడరి నాయింటివాకిలి ద్రొక్కఁగలరె
నేఁడుమొదలుగ నాకు మాటాడిరేని, అత్తమామల ధరణిపై నట్టె రాతు. 166

వ. అని పల్కి మఱియును. 167

క. మీకందఱకున్ బుద్ధులు, జోకతో నేఁ జెప్పఁగలను సుందరులారా
నాకడ వదరితిరేనిన్, జీకొట్టెద నంచుఁ బల్కెఁ జెలి కఠినోక్తుల్. 168

క. చెలులందఱు విని భీతిన్, పలుతెఱఁగులఁ జింత నొంది పల్కిరి తల్లీ
అలుకవహించుట నీకున్, వల దిఁక కల్యాణవేళ వచ్చెను లెమ్మా. 169

తే. బలుఁడు తడవైనఁ గోపించు జలజగంధి, యనిన విని మాయశశిరేఖ యాత్మఁ గనలి
బలుఁడు కోపింప నాకేమిభయ మటంచు, వెడలెఁ గలకంఠులందఱు వెంటనడువ.

వ. ఇట్లరుగుసమయంబున. 171

సీ. ఎన్నఁడు మగవారి నెఱుఁగ దన్నట్లుగా మఱుక్క నేలను జూడ మోము వాంచి
వెనుకొండ తలమీఁదఁ బెట్టినచందాన శిర మెత్తనేర దాసరసిజాక్షి
చరణనూపురములు చప్పుడు గాకుండ గట్టిగాఁ గాళులు పట్టి నడుచుఁ
దిలమాత్రమైనను దేహంబు జూపక కనకాంబరము మేనఁ గప్పుకొనుచు
తే. మందయానంబుతో వచ్చు సుందరాంగిఁ, గరయుగంబులు పట్టుచుఁ గంజముఖులు

మెల్లమెల్లనఁ దోడ్తెచ్చి యుల్లమలరు, బలుని చెంగటఁ గైతవపణఁతి నునిచి. 172

వ. అవ్విద్రుమాధర లత్యంతముదంబునఁ గల్యాణంబులు పాడ ననేకవాద్యంబులు మ్రోయ బ్రాహ్మణోత్తములు స్వస్తివాచనంబులు చదువుచు నన్వయగోత్రనామంబు లుగ్గడింప శకునికృతవర్మసైంధవాదిబాంధవు లిరుగడల నిలువంబడి వధూవరులమధ్యంబునఁ దెరఁబట్టి రాసమయంబున నీలాంబరుండు లక్ష్మణునకుఁ గన్యాదానంబుఁ గావించె నప్పుడు. 173

క. అప్పద్మనయనరూపముఁ, జెప్పఁగ విని లక్ష్మణుండు చెలఁగుచు మదిలో
నెప్పుడు తీఱురో తెర యిం, కెప్పుడు శశిరేఖమోము నేఁ జూచెదనో. 174

క. అని లక్ష్మణుఁ డివ్విధమున, మనమునఁ జింతించినపుడు మహిగీర్వాణుల్
మును బట్టినతెర వంచుచుఁ, గనుఁగొను డొండొరు లటంచు గ్రక్కునఁ దెలుపన్.

వ. ఆసమయంబున. 176

సీ. చూడ లక్ష్మణున కాసుదతి కుందేలుగా గంతులువైచుచుఁ గానఁబడియె
వెంబడి నతఁ డాత్మ వెఱగంది చూడఁగా పిండి బొక్కుచు గండుపిల్లియయ్యె
వగచుచుఁ దెరవంచి వాఁడు వీక్షింపఁగాఁ గొక్కరింపుచు పందుక్రోఁతియయ్యె
నిది చిత్రమని యెంచి పదిలంబుగాఁ జూడ రోమముల్ పెరిగి భల్లూకమయ్యె
తే. మఱినిభ్రమ జెందితినోయంచు మఱియుఁ జూడ, మినుకుకోఱలసర్పమైమీఁదికెగసె
నపుడు భయమున రెప్పలల్లార్చుకొనుచుఁ, బండ్లనిగిలించి విలపించెఁ బెండ్లికొడుకు.

వ. ఆసమయంబున. 178

క. ధరణీసురులును రాజులు, సరసిజముఖు లొకరికొకరు సరసోక్తులతో
సురవైరిమాయ నెఱుఁగక, పరిపరిమార్గముల వారు పలుకుచు నగుచున్. 179

వ. వీక్షించుచుండి రని చెప్పి వైశంపాయనుండు వెండియు నిట్లనియె. 180

సీ. పెండ్లికొడుకుచూడఁ బెక్కురూపంబులై కనిపించుఁ దక్కినజనుల కెల్ల
ముద్దుమొగంబుతో మిసిమిసినగవుతోఁ గాటుకద్యుతులొప్పు కనులతోడఁ
బవడంపుమోవితో ఫాలంబుపై మించు కస్తూరితిలకంపుఁ గాంతితోడఁ
బొదలుముంగురులతో నెదమీఁద రాణించు బిగువుపాలిండ్లతో వగలతోడ
తే. వజ్రమణిమయభూషణావళులతోడఁ, జాల రుచు లీనుబంగారుచేలతోడ
సిగ్గు తలకెక్క వంచినశిరముతోడ, మరునిరాచిల్కవిధముగా మగువ తోఁచె. 181

వ. ఆసమయంబున. 182

సీ. లలనామణులు నవ్వ లక్ష్మణుఁ డొక్కింత ధీరత్వమున మోముఁ ద్రిప్పిచూడ
మును బెక్కురూపులై గనిపించు హైడింబుఁ డత్యుగ్రశార్దూల మగుచుఁ దోఁచెఁ

దోఁచినఖిలిల్లి రాచవారలఁ జూచి 'పెద్దయెలుంగుతోఁ బెండ్లికొడుకు
అబ్బబ్బ యిది గండుబెబ్బులి యగుఁగాని పిన్నది కాదు నాకన్నులాన
తే. ఇంటిమరుఁగునఁ బెంచి వా రిటకుఁ దెచ్చి, దీనివాతికి ననుఁ ద్రోయఁ బూనినారు
పెండ్లికూఁతురు గా దిది పెద్దమెకము, కన్నులకుఁ దోఁచుచున్నదో యన్నలార. 183
క. పులివాతఁ దప్పిపోయినఁ, దలిదండ్రుల నోళ్ల బంధుతతి నే నోళ్లన్
హాలపాణిపుత్త్రి నోళ్లన్, బలుసాకొకయింత మెక్కి బ్రతికెద ననుచున్. 184
వ. అని మఱియు నిట్లనియె. 185
సీ. తలఁచి చూడఁగఁ బెండ్లి తలమీఁద నున్నది యీసారి తప్పింపుఁ డింత చాలు
మీభాగ్య మిఁక పెండ్లిమేరకు రా నింక యెక్కడిశశిరేఖ యేటిపెండ్లి
త్రొక్కిచంపును గాని తొలఁగ దీబెబ్బులి నవ్వుచు నున్నారు క్రొవ్వుబట్టి
నామాట మీకును నవ్వునుగాఁ దోఁచె మాయబ్బసాక్షిగా మగువ గాదు
తే. పెక్కురూపంబులై తోఁచెఁ బెండ్లికూఁతు, రిచట లే దని తలఁచెద నిపుడు నాకు
అంతకులగుంపు గూడిలి రైననేమి, యింక నైనను దొలఁగిపోనిండు నన్ను. 186
వ. అని పలికిన లక్ష్మణునకు రాచకుమారు లిట్లనిరి. 187
క. నగవుచ మోముఁ గనుంగొని, దిగు లొందుచు నోరుఁ దెఱచి దీనోక్తులతో
మృగ మని పల్కుచు సారెకు, నిగిలించుట రాజకొడుక యిది మగతనమే. 188
వ. అని మఱియు నిట్లనిరి. 189
క. చక్కనిబంగరుబొమ్మిది, దక్కెనె యవలక్షణునకుఁ దననిర్భాగ్యం
బిక్కరణి నున్న దనుచున్, పక్కన నగి రొకరికొకరు బాంధవులెల్లన్. 190
వ. అట్టిసమయంబున. 191
ఉ. భానుమతుండు సౌబలుఁడు పల్కిరి లక్ష్మణ ముద్దుచేడియన్
గానక నిందచేసెదవు గాదిలిబాంధవు లాప్తు లార్యులున్
మానిని గాదు వ్యాఘ్ర మని మాటికిఁ బల్కెద వేమిచేటురా
ధీ నినుఁ జూడి మాకుఁ గడుసిగ్గునుగల్గెను బంధురాజిలోన్. 192
క. మామకుఁ దలవంపులుగా, మామదికిన్ సిగ్గువొడమ మగువలు నవ్వం
గోమలిఁ గాదని పలుకుట, సామజపురనాథపుత్త్ర సహజమె నీకున్. 193
తే. పలువురము మేము నీచుట్టునిలచియుండ, మిన్నుఁదూఁటుగనొనరించి నిన్ను మ్రింగఁ
బెద్దపులి యెట్లు వచ్చెరా పెండ్లికొడుక, కలవరించెదు నిద్దురకన్ను లగుట. 194
వ. కావున. 195
సీ ఇంకొక్కసారి నీ వీక్షింపు మని వానికన్నులు నీటితోఁ దిన్నగాను
దుడిచి లక్ష్మణుఁ బట్టి పడఁతివంకకుఁ ద్రిప్ప నంధునివిధముగా నాతఁ డున్న

బంధువులెల్ల నిర్బంధంబు సేయఁగాఁ గడుభీతి మూసినకనులు దెఱచి
గదగదవడఁకుచుఁ గ్రక్కునఁ జూడఁగా దనుజనాథుఁడు ఘోరదంష్ట్రలొప్ప
తే. జడలు దాల్చుచుఁ గనుబొమల్ ముడిగొనంగ, వదనగహ్వరమున నిప్పు లుదిరిపడఁగ
శూల మొకచేతఁ బూని యాభీలమైన, భూతమై తోఁచెఁ గురుబలిపుత్త్రునకును.

క. ఆసమయంబున లక్ష్మణు, గా సేమని విన్నవింతుఁ గరిపురనాథా
మూసినకన్నులు దెరువక, గోసియుఁ దలచీర పీడ గొబ్బున వ్రాలెన్. 197

వ. ఇట్లు వ్రాలి. 198

క. సొలసి తెలివంది యచ్చటఁ, గలవారలఁ జూచి మీరుఁ గరుణింతైనం
గలుగదు ఎక్కడిమూర్ఖులో, తొలఁగరు రవ్వంతయైనఁ ద్రోవాసఁగ రయో. 199

క. పద నగు శూలముఁ గైకొని, యదె భూతం బెదురువచ్చె నని భయపడుచుం
బెదవులు దడవుచుఁ గాల్లన్, గుదిపడఁ దనవారిఁ జూచి గొబ్బునఁ బలికెన్. 200

సీ. మది భయంకర మైనవదనగహ్వర మొప్ప దంష్ట్రాద్వయంబుతో దయ్య మిపుడు
నేతెంచె మీమొగ మేమిచూచెదరింక మాటు కేఁగెద నన్న మార్గమిదరు
ఇంకెన్నటికిఁ బెండ్లి సేనొల్ల మీతూన యీగండ మొకటి యీఁడేర్చరయ్య
నీలాంబరుఁడు మిమ్ము నెరనమ్మి నిలువగాఁ దరమె దయ్యము వెంటఁ దగిలినపుడు
తే. పదపదం డని మూపులు పట్టి తోఁచి, బెబ్బరింపుచు జనులెల్ల భీతిఁ బొందఁ
దండ్రులందఱు దిగులొంది తత్తరింప, లలనబృందంబులో దూరె లక్ష్మణుండు. 201

క. దూరినలక్ష్మణు వెంబడి, నారాక్షసభూత మరుగ నరచుచు వాఁడున్
సారెకు నయ్యలఁ జేరొక్కను, సీరిని బలుమారు దిట్టు శిర మెదఁ దట్టున్. 202

ఉ. ఆతఱి భీమనందనుఁడు నాసురమాయ సృజింప సర్పముల్
మూతులు జాపుచు న్వెదలి మూరెఁడుమూరెఁడు జివ్హ లార్చుచున్
భూతలనిర్గతములబృందములన్ వెసఁ జొచ్చి వారికిన్
భీతి జనింపఁగా నపుడు భీషణ మైనఫణంబు లెత్తుచున్. 203

క. బుసకొట్టుచు వెంబడిరా, వసుధామరు లవనిమీఁదఁ వ్రాలుచు భీతిన్
వెస లేచి గోఁచు లూడఁగఁ, బసిబాలుర నీడ్చుకొనుచుఁ బరువిడి రంతన్. 204

క. పరువెత్తలేక కొందఱు, ధరణీసురవరులు లేచి తత్తరపడుచున్
శిరమునఁ జుట్టిన శాల్వలు, నరుదెంచెడుసర్పములకు నడ్డం బిడుచున్. 205

క. జరుగుచునుండఁగ మీఁదికిఁ, బరతెంచిన భీతిఁ బొంది బ్రాహ్మణు లని రో
కురుపతి! నీవెంబడిరా, నురగంబులవారిఁ ద్రోయ నుచితమె నీకున్. 206

క. పరిణయముఁ జూచువేడుక, నరుదెంచితి మింతేకాని యహికాటులతోఁ
బోరిఁబోరిఁ జచ్చెద మని మే, మెఱిఁగిన నిట కేలవత్తు మిభపురనాథా. 207

క. అని వాపోవుచు నుండఁగ, ఘనవృశ్చికసముదయములు కాకోదరముల్
దనుజునిమాయన్ బొడమినఁ, గనుఁగొని భీతాత్ము లగుచు గంతులుగొనుచున్. 208

క. పరువిడినఁ బెక్కుమృగములు, కురుసేనల సంచరింపఁ గురుపతికర్ణుల్
వెఱగందుచుండఁ గైతవ, పరిణయపుంబుత్త్రి గానఁబడ దెవ్వరికిన్. 209

వ. ఇవ్విధంబున మాయాశశిరేఖ మాయమైపోయిన. 210

సీ. మఱియును ఘటోత్కచుమాయచే సింగముల్ పులులు సాళువములు భూతములును
గరులు భల్లూకముల్ కాలసర్పంబులు కోటిసంఖ్యలు కూడి గుంపు లగుచుఁ
గలిసిన నచ్చోటఁ గలవారలందఱు దిగులొంది వెడలిపోఁ దెరువు లేక
వాపోవుచుండఁగా వరపన్నగంబులు గట్టిగాఁ గాళ్లకుఁ జుట్టుకొనిన
తే. వాటి విడిపించుకొనలేక నోటితాళ, వాక్యములచేత వసుధపై వ్రాలిలేచి
యార్భటింపుచు వనటతో నవనిసురులు, కొండ తమమీఁదఁ బడినట్టు లుండిరపుడు.

సీ. వేండ్రమౌ తేళ్లను మండ్రగబ్బలు కొన్ని గుట్టిన నెదనెద గొట్టువారు
విలపించి పాదముల్ విదలించుకొనువారు ఇండ్లలోపలఁ గంతులేయువారు
బెబ్బులుల్ గలసిన బొబ్బలు వెట్టుచు గొబ్బున నొండొరుల్ ద్రొబ్బువారు
ఎదురైన కౌరవయింతుల కడ్డమై మెడఁ బట్టుకొని చాల మిడుకువారు
తే. ఎలుఁగుసింగంబులనుజూచి యేడ్చుచున్న, పడుచుమగువలఁగని మీఁదఁబడెడువారు
దుప్పులనుజూచి కన్నులు గప్పుకొనుచు,నొండుదెసఁ బోక యూరకయుండిరపుడు.

సీ. గాటంపుమృగములఁ గని భీతినొందుచుఁ దమవారలను డించి తర్లువారు
మోటుమొద్దులభంగి మొలచీర లూడిన వారిజాక్షులలోన దూరువారు
తత్తరింపఁగఁ జూచి దారపుత్త్రాదుల గోడచాటునఁ జేర్చి గొణుగువారు
ఇండ్లలో నుండక పెండ్లిఁ జూడఁగవచ్చి యెలులపా లైతిమం చేడ్చువారు
తే. కడిఁదిమెకములఁ గనుఁగొని కంప మొందు, వనితలకు భీతిమాన్పుచు వగచువారు
పెద్దభూతంబులను గాంచి దద్దరిల్లు, పుత్త్రులను జూచి యాత్మలో బొగులువారు.

వ. ఇట్లున్నసమయంబున. 214

ఉ. కోరలుగల్గుభూతములు గొప్ప మెకంబులు పన్నగంబులున్
గౌరవకాంతలం గదిసి గర్జనచేసిన బొబ్బరింపుచున్
పౌరులఁ జేరి మీ రయినఁ బాముల గాములఁ దోలి మమ్ములన్
గారవమొప్ప బ్రోవుఁ డని కాళ్లకు మ్రొక్కుచు విన్నవింపఁగాన్. 215

చ. పెదపెదమండ్రగబ్బలును జేరులుపేరులు వృశ్చికంబులున్
బుదబుదమంచుఁ దాఁ బొడమి బోఁటులకాళ్లకుఁ బ్రాకనప్పుడా
సుదతులు చీరలుం బెఱికి నూడు సెఱుంగక గంతు లేయుచున్
ఎదురగువారిఁ బట్టుకొని యేడ్చుచు నుండి రదేమిచెప్పుదున్. 216

సీ. మఱికొంద రంగనల్ మంద్రగర్భలఁ జూచి యబ్బబ్బ యని ద్రొబ్బులాడువారు
ఇంటికంబంబుల కెగఁ బ్రాకి భూమిపై దెబ్బునఁ బడి నోరుఁ దెఱచువారు
అమ్మక్క యిదియేమి యన్యాయ మని వచ్చి దుప్పి మెకముఁ గాంచి తొలఁగువారు
ఎదురగునేలాటిహీనజాతుల నైన వేగఁ బ్రోవుమటంచు వేఁడువారు
తే. అట్టిమగువల వీక్షించి యవనిపతులు, చేతులును గాళ్లుఁ దెమలింపఁ జేష్ట లుడిగి
చిత్రముననుండుప్రతిమలచెలువు దోఁప, మేను లెఱుఁగక నుండిరి దీనులగుచు.

వ. ఆసమయంబున. 218

చ. అనుజసమేతుఁడై చెలఁగునంబుజనాభుని వారివారిఁ బె
ల్చనవిడి రాక్షసేశ్వరుఁడు సౌబలకర్ణసుయోధనాదులన్
మునుమిడి వారివారలను మూలలదూరినయాదవాదులన్
పనివడి ధారుణీపతుల బ్రాహ్మణకోటుల వైశ్యశూద్రులన్. 219

వ. నానావిధంబుల బాధించుచుకుటోత్కచునిమాయల నివారించుసామర్థ్యంబు గోవిందు
నకుఁ గలిగియుం నర్జునుపైఁ బక్షపాతంబునను గౌరవులకు గర్వభంగంబు గావలయుం
ననుతలంపునం జేసి మానియై యుండె నప్పుడు కర్ణశకునిదుశ్శాసనజయద్రథకృపా
శ్వత్థామ మొదలగురథికులం జూచి దుర్యోధనుం డిట్లనియె. 220

సీ. మీ రివ్విధంబున ధీరత్వ మెడఁబాసి వెలవెలఁ బోవఁగా విహిత మగునె
యిది పాండుసుతులకు హితులైనవారలు గావించుకార్య మై కానఁబడియె
నిండ్లలోపల నున్న నిది పనిగా దింక బాణబాణాసనపాణు లగుచు
తెరిపికేఁగిన మన తెరువు రా రెవ్వరు సదపదమని చెప్పి భటులఁ జూచి
తే. కాల్బలంబుల రథములఁ గరిహయాది, పరికరముతోడ రండని పనిచి తాను
రవితనూజుండుఁ దక్కినరథికవరులుఁ, బరిణయపుశాల వెలువడి బయలు దేరి. 221

వ. ఉండె రని వైశంపాయనుండు చెప్పిన. 222

క. పురుహూతసన్నిభుం డగు, కరిపురపరిపాలకుండు కలకల నగుచున్
వరమునిఁ గనుఁగొని యవ్వలి, చరితము వినిపింపు తపసిచంద్రమ నావున్. 223

పంచచామరము. సరోజనాభ చక్రహస్త సన్మునీంద్రసన్నుతా
ధరాతనూజ బాహుపర్వతామరేంద్రయాయుధా
పురారిమిత్ర నీరజాంగ పుండరీకలోచనా
ధరాధరుండు నిన్నుఁ గొల్చి ధన్యుఁ డయ్యె మాధవా. 224

గద్య. ఇది శ్రీమత్సూర్యనారాయణ కరుణాకటాక్షవీక్షణాలంకార సుస్థిరామృతవాక్య
జనితకవిత్వరత్నాకరవంశపయఃపారావార రాకాసుధాకర రాంజనేయాఖ్యతనూజ
అప్పప్పనామధేయప్రణీతం బైనశశిరేఖాపరిణయం బనుమహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము.



లలితమిత్రవిందా
బాలామణిలక్షణాదిమానితవనితా
లోల జనార్దన మునిజన
పాలా కారుణ్యశీల ధర్మసుచేలా. 1

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు వైశంపాయనుండు
జనమేజయున కిట్లనియె. 2

చ. కురుపతి కర్ణుఁడున్ శకుని కుంభజసంభవుఁ డాదివీరు లా
పరిణయమందిరం బెడలి బాణశరాసనశూలపాణులై
పురబహిరంగణంబునను భూరిపరాక్రమ మొప్ప నిల్చినన్
గెరలి ఘటోత్కచుం డరిగె ఘీంకృతి సేయుచు నభ్రవీథికిన్. 3

వ. అని చెప్పి వైశంపాయనుండు మఱియు నిట్లనియె. 4

చ. సురపథవర్తియై దనుజసోముఁడు మాయ సృజింప నంతలో
నరిమురి నీలమేఘములు నంబరమెల్లను గప్పెఁ గప్పినం
దెరిప యొకింత లేక నలుదిక్కులు చూచినఁ గన్నుమూసినన్
బోరిఁబోరి నొక్కటై పరగె భూరితమం బదియేమి చెప్పుదున్. 5

క. జడుపుపొడ మెఱుము మించులు, పిడుగులు వడగండ్లు నీళ్లు పెవపెవ శిలలున్
గడువడి దొరఁగించుచు న, వ్వడముడిసుతుఁ డార్చె దనుజవైరులు బెదరన్. 6

సీ. పార్థివేశ్వర విను పదినూఱుకోటులు గూబలు గుంపులై కూసినట్లు
చెఱువు నిండిననాఁడు చెలరేఁగి కప్పలు పరిపరిధ్వనులతోఁ బలికినట్లు
పైకిమోరలు సాచి భైరవాశ్వంబులు మొఱపెట్టి మొఱపెట్టి మొఱగునట్లు
నాఁటిపెల్లున నతిభీషణంబుగా రోషించి బెబ్బులు ల్రొప్పినట్లు
తే. ఎలుఁలు కోరిందలోఁ జిక్కి యేడ్చినట్లు, కొదమసింగంబు లందంద కూసినట్లు
డాసి యాఁబోతులును ఱంకె వేసినట్లు, నదరి మార్జాలశతము గాట్లాడినట్లు. 7

క. మారుతిసుతుఁ డీలాగున, ఘూరితరధ్వనుల నభము పూరటిలంగా
వైరులు కంపము నొందఁగ, సీరియు భయమంద సకలసేనలు చెదరన్. 8

సీ. ఒకచోట జావాన లుర్విపై వర్షించు వర్షించి దుందుభివాద్య మొసఁగు
నొకచోటఁ బిడుగుల నుగ్రుఁడై యడరించు నడరించి భేరివాద్యంబు సేయు
నొకచోటఁ జలితేల్లు ప్రకటంబుగా రాల్చు రాల్చి భీషణశంఖరవ మొసంగు
నొకచోట మిక్కిలి యురగముల్ దొరగించుఁ దొరగించి మేఘంబుకరణి నార్చు
తే. దనుజనాథునిసాహసధైర్యములకు, సమరభోజనుఁ డాత్మలో సంతసించి
గాసిపడి తాను జేసిన కార్యమునకు, నధికతర మైనఫలకాల మనుచుఁ దలఁచి. 9

క. సరిగమపదములు పాడుచు, తరికిటతైథై యటంచుఁ దాళము లిడుచున్
పరిపరివిధముల నాడుచు, నరుదుగ నాట్యంబు చేసె నమరులు పొగడన్. 10

క. ఆసమయంబునఁ గౌరవు, లాసురమాయాప్రభావ మారా యని వా
రీసున బాణపరంపర, వేసిరి నలుదిక్కులందు నిభపురనాథా. 11

క. అదియెల్లం గని దనుజుఁడు, రదనంబులు బెట్టు గీటి రౌద్రోద్రేకం
బొదవఁగఁ గార్ముక మెక్కిడి, ప్రదరంబులు నారిఁ గూర్చి పౌరుషమతియై. 12

సీ. దుర్యోధనుని నూఱుతూపుల నొప్పించి యువరాజు నాల్గింటఁ జవ మణంచి
శకుని షడ్వింశతిసాయకంబుల నొంచి సైంధవు నారింట సాధుఁ జేసి
నలినాక్షసుతు నూఱునారసంబుల నొంచి దుర్ముఖు నైదింటఁ దూల నేసి
కృపునిఁ బదేనింటఁ గృపిపుత్త్రు నారింట భూరిశ్రవుని రెంటఁ బొంక మణఁచి
తే. పరిణయముఁ జూచువేడుక నరుగుదెంచు, రాజపుత్త్రులఁ దక్కినరథికవరుల
నూఱునిన్నూఱుమున్నూఱునారసంబు, లేదు వెరిగినవిధముగా నేసె నతఁడు. 13

క. తురగంబులపైఁ దురగము, లరదంబులమీఁద రథము లతిచిత్రముగాఁ
గరిఘటలమీఁదఁ గరులన్, బోరిఁబోరిఁ దొరఁగించి వానిఁ బొలియం జేసెన్. 14

శా. ఆరక్షోవిభుమాయలం బొదముపంచాస్యమ్ము లొక్కుమ్మడిన్
రారాజద్విరదేంద్రపఙ్క్తి చెదరన్ రౌద్రంబుగా రొప్పుచున్
క్రూరాభీలనఖంబులన్ జిదిపిన న్కుంభంబులున్ భగ్నమై
పీరవ్రాతము తల్లడిల్లఁ గరులున్ విశ్వంభరన్ గూలినన్. 15

వ. మఱికొన్ని మృగంబులు కాల్బలంబులం గదిసి శిరంబులం బగులింపుచుఁ గంఠంబుల నొక్కుచు నరంబులఁ ద్రెంచుచుఁ గరంబుల నములుచు నురంబులఁ జీల్చుచు నుదరంబుల ప్రచ్చుచు నూరువుల ఖండించుతఱి హైడింబుం డనేకశరపరంపరలఁ బరగించిన మ్రొగ్గుగజంబులును జేడ్పడుతురంగంబులును దుత్తుమురైనరథంబులును ధరం బొరలు సైన్యంబులునై గొడుగులు పుండరీకంబులు చామరంబులు శైవాల

తతులు దుందుభులు మకరంబులు బాణంబులు మీనంబులు గజంబులు శైలంబులు బాణాసనంబు లురగంబులు రుధిరంబు ప్రవాహంబు లై సముద్రంబునకు సామ్యంబుగా నుండె నప్పుడు. 16

క. జనకులపన వాసస్థితిఁ దనమది నిడి దానవుండు తద్దయుఁ గోపం
బినుమడిఁ బొడమిన వాఁడుం, గను లెఱ్ఱగఁ జేసి ప్రళయకాలునిమాడ్కిన్. 17

చ. అగణితసాయకప్రతతు లాసురసైన్యముఁ దాఁక నేసినన్
జగడము మాని కాల్బలము సందుల గొందులఁ దూరి మిక్కిలిన్
దగఁగొనఁ బాఱువారు శరతాపము నొందుచు మూల్గువారు ప
న్నగములు కాల్గను న్బెనఁగ నాట్యముఁ ద్రొక్కుచు సేద్చువారు నై. 18

వ. అట్టిసమయంబున. 19

సీ. శరము లుఱముఁ దూరఁ గరములు ముకుళించి హాసురయోధన ప్రోపు మనెడువారు
పులికాటులకు నొచ్చి భూమిపైఁ బొగలుచుఁ గొన ప్రాణములఁ దన్ను కొనెడువారు
భల్లూకనఖఘాతబాధ కోర్వఁగలేక బెట్టు రారాజును దిట్టువారు
చలితేళ్లు మీటిన సలుపుల కలుకుచు నిది యేటిపెండ్లి యం చేడ్చువారు
తే. పరువులిడువారిఁ గని భీతిఁ బరచువారు, నెలులఁ గనుఁగొని మాటున కేఁగువారు
నరదముల క్రింద దూరుచు నణఁగువారు, దిక్కు తెలియక యందంద తిరుగువారు.

సీ. శిరములు తెగిపడ్డ ధరణిపైఁ బడువారు చరణముల్ దునిసిన నొరుగువారు
యూరువుల్ విఱిగిన నుర్విఁ బ్రాఁకెడువారు నడుములు రెండైన మడియువారు
నుఱములు పగిలిన గొరగొర మనువారు భుజములు తుండైనఁ బొగలువారు
డొక్కలు చీలినఁ బక్కపోయినవారుఁ బిక్కలు తునియలై బెగడువారుఁ
తే. జాల నెత్తురు నదులలోఁ దేలువారు, మొనసి మాంసపురొంపిలో మునుఁగువారు
బడియపోటులఁ బ్రాణముల్ విడుచువారు,నొండొరులఁబట్టి యేడ్చుచు నుండువారు.

వ. అట్టిసమయంబున. 22

క. అసురసేన న్గొందఱు, రాకొమరులు భూరిరోషరసమానసులై
భీకర మగుమృగములపైఁ, దాఁకిరి రారాజుమదికి ధైర్యము వొడమన్. 23

క. కొన్నిఁటి కోరలుపెకలుచుఁ, గొన్నిఁటి శీర్షములు వ్రచ్చి కూరాస్త్రములం
గొన్నిఁటి గళములు ద్రుంచిన, నన్నిఁటి వీక్షించి రాక్షసాధిపుఁ డలుకన్. 24

క. అలసురసైన్యముమీఁదన్, మలమూత్రముతోడ మఱియు మాంసాస్థులతో
మొలపొడుగు గురిసె నప్పుడు, కలహాశనుఁ డాడె మింటఁ గలకల నగుచున్. 25

వ. అని వైశంపాయనుండు మఱియు నిట్లనియె. 26

క. శరముల మృగములతోడన్, కరివ్రాతముతోడ మంద్రగబ్బలతోడన్

ధరపైఁ బొరలుచు నుండిరి, గురిసెడుమలమూత్రమంబుఁ గ్రుంకుచు నేనల్. 27

వ. ఆసమయంబునందు. 28

క. ధృతరాష్ట్రసుతులు రథికులు, ధృతి శరములు బాఱవైచి దుర్వ్యాసనతన్
మతిఱోఁపి పరువు లెత్తిరి, క్షితితలపరిపాల యేమిచెప్పుదు నేనున్. 29

వ. ఇట్లు తనసైన్యంబు పలాయితం బగుట గని సుయోధనుండు కర్ణశకునిదుశ్శాసనాది రథికులం గూర్చుకొని యోచించుచున్నరాజుం జూచి ఘటోత్కచుం డిట్లనియె.

చ. ఇనతనయాదివాక్యములె యింగితమంచుఁ దలంచి పాండురా
ట్తనయుల సింహవిక్రముల దైవతనాథసమానమూర్తులన్
జెనకఁగలేక జూదమునఁ జేకొని సంపద వారలేవురన్
వనులకుఁ బంపి నీవిపుడు వాసవిపుత్త్రున కిచ్చుచేడియన్. 31

చ. కొడుకుకుఁ బెండ్లిచేసికొనుకోరిక మిక్కిలి మానసంబునన్
బొడమి సురేంద్రునిం దెగడుభోగముతోఁ జనుదెంచునిన్ను నీ
కొడుకుల బంధులన్ హితులఁ గూరిమితమ్ముల నాప్తమంత్రులన్
మెడలు దెగంగ నేసి రణమేదినికి న్బలిచేసి పిమ్మటన్. 32

క. సింధురపురమునకుం జని, యంధునిఁ బాపాత్మునంబికాత్మజు వేగన్
బంధించి తెచ్చి నేఁ డీ, సింధువునన్ ముంచిముంచి సిగఁ దెగవైతున్. 33

సీ. అనుచు ఘటోత్కచుం డవనిపై కేతెంచి కురుపతిమకుటంబుఁ గూలఁ దన్ని
శకునిచెవు ల్వట్టి చంపలు వెసఁ గొట్టి హాసనందను నెత్తి నదరఁ గొట్టి
సింధురాజును దుస్ససేను నర్ధము చంపి భూరిశ్రవుని నేలఁ బొరలఁ దన్ని
కృపగురుపుత్త్రులకోపంబు లణఁగించి తక్కినరథికుల నుక్కణంచి
తే. మఘవసుతుపల్కి చెప్పినమాటఁ దలఁచి, కౌరవులఁ జంకనొల్లక గగనవీథి
కెగసి శరములు బరపిన నింద్రజిత్తు, మాయయుద్ధంబుగా నుండె మనుజనాథ. 34

వ. ఆసమయంబున. 35

చ. అతిరథు లెల్ల కార్ముకము లస్త్రములున్ ధరవైచి పల్కి రో
క్షితిపతి నీకు మాకు నిఁక క్షేమము లే దది యెట్టులన్న యా
పతగకులాధిపధ్వజుని పల్కరు గేలి యొనర్చినందు కీ
గతి మనకున్ లభించె విను కౌరవనాయక యంచుఁ బల్కఁగాన్. 36

వ. విని సుయోధనుండు దీనాననుం డగుచు రాధేయుం జూచి కర్ణా! మనపరిణామంబు దక్కు నుపాయం బరయుమ మని రహస్యంబుగాఁ జెప్పినం గని కృపాచార్యుం డిట్లనియె. 37

సీ. ఎప్పటిగుసగుస లెందుకు రాజేంద్ర సకలసైన్యంబులు చచ్చుపనికి
మాయయేనుఁగులచే మడిసె నీయేనుఁగుల్ మాయగుఱ్ఱములచే మడిసె హరులు

మాయదెబ్బలలతో మాయమై రందఱు కొఱగానిమోచవల్ గూడ దిచట
పాండునందనులకుఁ బరమాప్తుఁ డైనట్టి పుండరీకాక్షుని భూరిమహిమ
తే. కర్ణునకు నీకుఁ దెలియక గర్వమెత్తి, గేలిచేసిన చేటది యేలదప్పుఁ
దొలుత మిన్నేటికొడుకును గలశజుండు, వలదు వలదంచుఁ జెప్పిన వారి దూఱి.

క. కరిపురవల్లభ నీ పీ, దురితాత్ముఁడు చెప్పినట్టిదుర్నీతులతో
నరుదెంచి సకలసేనలఁ, గురుకులజుల నీఁగి తింక గుసగుసలేలా. 39

సీ. శైవశాయిని గేలిచేసినప్పుడె నీకుఁ జేటుమూడెను వేఱె చెప్ప నేల
వక్రమానసుఁడ వీ వొక్కఁడు చక్కఁగాఁ గొఱవితోఁ దలగోఁకుకొందురయ్య
మిన్నుఁజూచినముల్కి మించులు గనిపించు మన్నుఁ జూచినఁ బాము తెన్నొతోఁచు
బెగడి దిక్కులుచూడ దెబ్బలుల్ గనుపించుఁ గావునఁ బాచికల్ గావు నేఁడు
తే. నిలువ శక్యముగా దింక నీకు మాకుఁ, బ్రాణములుదక్కనొక్కింత బాహుబలము
లేదు విను కర్ణుఁ డాప్తుఁడై రేపు మాపు, నీకుఁ గఱపినదుర్నీతి నింతవుట్టె. 40

చ. అన విని కర్ణుఁ డాకృపునియాగ్రహ మొప్పఁగఁ జూచి వీనులన్
వినఁ జవిగానివాక్యములు విప్రకులాధమ యింకఁ బల్కితే
నినరుచు లీనుఖడ్గమున నిందఱు జూడఁగ నీదుకంఠముం
దునిమెద నంచుఁ బల్కవిని ద్రోణతనూజుఁడు క్రోధమూర్తియై. 41

ఉ. ఏమిర కర్ణ కౌరవులయెంగిలికూడు భుజించి మత్తుఁడై
భూమియుఁ మిన్నుఁ గన్పడక పొంగెద వింతియె కాక భూరిసం
గ్రామమునందు శత్రుఘనకాండము సోఁకినఁ బారు నీవు సి
గ్గేమియు లేక ప్రేలెదవు యించుక సెంచవు గొప్పకొంచెముల్. 42

సీ. నీజల్లుకూఁతలు నిశ్చయం బని యెంచి రాజ్యమదాంధుఁ డీరాజరాజు
తుక్కుశౌర్యము నమ్మి కొదమసింగంబుల నెదిరించువిధముగా విదితయశుల
రణపండితులఁ బాండురాజనందనులతోఁ బగఁ బూనె నదిగాక పద్మనాభు
సరకుసేయక గేలి సలిపితి రిఁకమీఁద బ్రతుకుమార్గం బేదొ వెతుకు మనిన
తే. ద్రోణి నీక్షించి యిట్లనుఁ దరణిసుతుఁడు
తావిగలమంచిఘృతముచేఁ దప్తమైన
మండిగెలు లడ్డు లొబ్బట్లు మడుఁగుఁబూలుఁ
మొదలుగాఁగలభక్ష్యముల్ ముదముఁ జెంద. 43

క. బరు లుబ్బఁగఁ బృష్ఠోష్మము, పర్యంతము మెక్కి పెక్కువలుకులు పలికే
ధరణీబృందారకులకుఁ, దరమే సంగ్రామవిధము ధరణీస్థలిలో. 44

ఉ. పౌరులు పూజనీయుఁ లని భావమునందుఁ దలంచి మిక్కిలిన్
దూరము నోర్చికొంటి విను ద్రోణతనూభవ నన్నుఁ గూర్చి వీ

రారడికారు లాడినఁ గరాసినిఁ ద్రుంచెద నంచుఁ బల్కినన్
ధారుణినిర్జరోత్తముఁడు తద్దయు రోషకషాయితాక్షుఁడై. 45

క. ఒఱ నున్నవాలుఁ బెఱికిన, గురుపుత్త్రుని మోముఁ జూచి కోపము వల దీ
తఱి యని చెప్పుచు నాతని, కరమిడి ఖడ్గంబుఁ గొనియెఁ గ్రక్కునఁ గృపుడున్.

వ. ఆసమయంబున రారాజంగరాజులం గదిసి యిరుగేలం బట్టి యనేకవిధంబులఁ బ్రా
ర్థింప నాతనిం జూచి కుంభసంభవసంభవుం డిట్లనియె. 47

క. విడువిడు వానిం బట్టకు, కడుమదమున మన్ను మిన్నుఁ గానఁడు నృపతీ!
మెడపోసరమున నువ్వాఁ, దుడుగుసె నాదెబ్బ తాఁకి యుండిగినభంగిన్. 48

క. అనుతఱి శిలలున్ బిడుగులు, ఘన మగుశరార్పములఁ జెరుగుగతి ధారుణిపై
దనుజుఁడు వర్షించినవో, జననాథులఁ జూచి కృపుఁడు చయ్యనఁ బలికెన్. 49

తే. బయల నిల్చిన మనకింక బ్రతుకవశమె, చూడఁ జూడంగ నెప్పటిచోటె మేలు
ధనువు లస్త్రంబు లన్నియుఁ దునుకలయ్యె, బిరుదుమగలకు లేదు పోబింక మరయ

క. అనవిని కర్ణుఁడు శకునియుఁ, జనపతి మొదలైనరథికజనములు భీతిన్
గునగునఁ బర్విడి శోభన, ఘనభవనముఁ జొచ్చి రంత కౌరవనాథా. 51

క. క్రూరమృగంబులబాధకుఁ, బౌరులు కౌరవులు చాల భయవిహ్వలులై
పరుచు పరువులు పాఱఁగ, సీరాయుధుఁ డార్తి నొంది చిడిముడిపడుచున్. 52

చ. అసురులమాయగాఁ దెలిసి యంగజభంగసమానమూర్తియై
ముసలము దివ్యమౌ హలము మూఁపునఁ దాలిచి పండ్లు దీడుచుం
బసగలమందిరం బెడలి పర్వతగహ్వరసీమనుండి బ
ల్వెసఁ జనుదెంచుసింహ.మన విక్రమ మొప్పఁగ వచ్చి యచ్చటన్. 53

చ. పగతుఁ డగోచరుం డగుటఁ బల్మరు దిక్కులు చూచునంతలో
గగనమునందు రక్కసుఁడు గర్జన సేయఁగ నాలకించి తా
నగములు వ్రక్కలించుకులిశాయుధుఁడో యన వేగ సీరమున్
నొగతుదఁ గేలఁ బట్టుకొని నూఱువిధంబుల వీచె రాముఁడున్. 54

సీ. ఆసమయంబున హైడింబుఁ డుగ్రుఁడై పెళపెళధ్వనులతోఁ బిడుగు లవనిఁ
దొరఁగించి వెంటనే తోరంపువిశిఖంబు లెడసందు లేకుండ నేసి మఱియు
నిగనిగద్యుతు లొలుకు నిప్పులవర్షంబు గురిపించి వెండియుఁ గోప మొదవ
హలసాధనునిమీఁద మలమూత్రపంకంబు నించిన నచ్చోట నిల్వలేక

తే. పరిణయపుశాలలో దూరి పద్మనాభు, నగరిలోఁ జొచ్చి నాఁగేలు జగతి వైచి
పిదప రోఁకలి గోడకుఁ బెట్టి హరిని, జూచి గోవింద యిదియేమిచోద్య మనుచు.

వ. అని మఱియును. 56

సీ. ఇందిరేశ్వర నీకు నేమని వివరింతుఁ బులులు సింహంబులు ఘూకములును
మండ్రగబ్బలు తేళ్లు మఱియును సర్పంబులు జగతిపై నెరపినచంద మయ్యెఁ
గూళ లార్భటులతోఁ గుధరముల్ వాపోయెఁ గాని కూఁతురిపెండ్లి కాకపోయె
నదిగాక శశిరేఖ యరయంగ లేదాయె నెచ్చోట డాఁగెనో యెఱుఁగ నేను
తే. మొదట లక్ష్మణుఁ డిగిలించి మొఱలువెట్ట, నపుడె నామది కనుమానమయ్యె నంతఁ
జీర లెఱుఁగక బారికి చెలులు భీతి, బ్రాహ్మణోత్తము లందఱుఁ బరువులిడిరి. 57

వ. ఆసమయంబున. 58

క. అనిసేయుటకై కొందఱు, జనపతు లచ్చోటి కేఁగి సంయమపురికిన్
జని రని చెప్పుచు వెండియు, వనజాక్షునిఁ జూచి ముసలి వగచుచుఁ బలికెన్. 59

సీ. పెండ్లిఁ జూడఁగఁ జిన్నపెద్ద లందఱు వచ్చి గుండ్లు పైఁబడి నేలఁ గూలి చనిరి
కాల్బలంబులు చచ్చెఁ గరు లన్ని హతమయ్యెఁ దురగముల్ తేరులు తునుకలయ్యె
ధనువు లింతింతలై ధరమీఁదఁ బడిపోయె శస్త్రాస్త్రములపోళ్లు జగతి నిండె
పరశుపట్టిసఖడ్గప్రాసంబు లన్నియుఁ జేరులేకుండఁగా బెంచులయ్యె
తే. రుధిరనదములు బాఱియంబుధులఁ జొచ్చె, మెదడురక్తంబు మెక్కుచుఁ బదియు నైదు
కోట్లభూతంబు లందంద గుంపులగుచుఁ, దిరుగుచున్నవి పురిచుట్టు సరసిజాక్ష. 60

సీ. కయ్య మొనర్ప నే నొయ్యనఁ జని నాల్గుదిక్కులు చూడ నాద్రుక్కులకును
వైరి దృశ్యుఁడు గాక వారిదంబున డాఁగి యొకచోట భాషించు నొకటఁ దిట్టు
నొకచోట దిరుగు నొండొకచోట ఘోషించు నొకచోటనేడ్చుచు నొకట నవ్వు
నాజి వాని జయింప నలవిగా దదిగాక నశనిపాతంబులు నస్త్రములును
తే. శిలలు దొరఁగింప నచ్చోటుఁ దొలఁగి నేను, త్రాసమును బొంది వచ్చితి వాసుదేవ!
యలసుయోధను గలిసెమొ తెలియదాయె, యింతపనిసేయుఁడెవ్వఁడు హేతువేమి.

క. తెలిసిన దాఁచకు మదిలో, వలమురిధర యీవిధంబు వాస్తవ మెప్పన్
దెలుపు మటం చని వేఁడిన, బలరామునిఁ జూచి శౌరి పకపక నగుచున్. 62

తే. ఎఱిఁగి చేసినపని కేల యింత వగపు, కర్ణశూలంబులైనట్టి కాఱు లఱచి
తోడఁబుట్టును యిలు వెళ్లఁ దోలినట్టి, చేటు వాటిల్లెఁ బో నీకు సీరపాణి. 63

తే. తూర్పు మాగాణిఁ బాలించు దొరతనూజు, పడఁతియిలు బాసి నిశివేళఁ గొమరుతోడఁ
గదలి పాండవు లుండినకాననంబుఁ, జేర వెఱుంగక యడవిలో నరిగి యరిగి. 64

తే. సురఁటిపీవులపుట్టువు సుతునిపట్టి, కోన కేఁగిన నాతఁడు కుశల మడిగి
పట్టణము వాసి మీరిట్టె భయము లేక, ధీరులై వచ్చు హేతువుఁ దెల్పుఁ డనిన. 65

క. నీవాడిన వాక్యము లా, దేవారికి విన్నవింప దిక్కులు ప్రేలన్
దేవసమూహము బెదరన్, పావనసుతుఁ డార్చె మేరుపర్వత మదరన్. 66

వ. ఇట్లు సింహనాదంబు సేసి యప్పుడు. 67

క. నిటలభ్రూకుటి ముడివడఁ, బటపట మని పండ్లు కొఱికి పటుకోపముతో
నిటవచ్చి యిందురేఖన్, కుటిలాలక నెత్తుకొనుచు గొబ్బున నేఁగెన్. 68

వ. ఇట్లేఁగి తనవనంబున శశిరేఖం డించితక్షణంబ. 69

తే. మరలఁ జనుదెంచి మగువయై మాయతోడ, లక్ష్మణుని భీతిఁ బొందించి రాజసుతుల
గర్వభంగంబు గావింప గగనవీథిఁ, కెగసి మిక్కిలి యుగ్రుఁడై యింత చేసె. 70

క. అని యివ్విధమునఁ జెప్పిన, విని నల్లనివలువతాల్పు విస్మయమతితో
వనరుహనేత్రునిఁ గనుఁగొని, మనసోవరి యిట్లు సేయు మంచిద తనకున్. 71

తే. శశిరేఖను ఇవ్వలే దంటిఁగాని, యిల్లు వెడలఁబాఁపి పొమ్మంచు నెవ్వ రనిరి
కొడుకుతో లేనికొండెముల్ కొన్ని చెప్పి, మనకు నవమాన మొనరింపఁ దనకు మేలె.

క. అని దుక్కివాలుదాలుపు, మనమునఁ గోపంబు వొడమి మఱి యేమనకన్
మునిబోలె నుండి వెండియుఁ, దనతమ్మునిఁ జూచి లేచి తానిట్లనియెన్. 73

క. దిట్టయయి తాను పంపిన, బెట్టిదుఁ డగురక్కసుండు బెదరక యెదుట
న్నెట్టుకొని కయ్య మొసఁగినఁ, గొట్టుదు జముపురముఁ జేర గోగణరక్షా. 74

వ. కావున నాచూడ్కులకు దృశ్యుండుగాక నదృశ్యుం డగుటం జేసి రక్కసుని సామ
ర్థ్యంబు చెల్లె నని చెప్పి వెండియు సుభద్ర నుద్దేశించి హలాయుధుం డిట్లనియె. 75

సీ. తా నెంత చేసినఁ దనతనూజునకు నా పట్టినిత్తునె పట్టిభ్రమలుగాక
దానవేశ్వరుఁ డున్నకొనకు నే నేఁగి యిందురేఖను దెచ్చి యిభపురేంద్రు
సుతున కిచ్చెదఁ గాక సుదతి సౌభద్రునకిచ్చిన జనులెల్లహీనుఁ డనరె
వనజాక్షు నేఁ బోయి వనితఁ దెచ్చెద నంచు ముసలంబు నాఁగేలి మూపుఁ జేర్చి

తే. పైనమై పోవురామునిఁ బారఁ జూచి, మొదటఁ గోపంబు పొడమిన మది నడంచి
పిన్ననగ వొప్ప జనులెల్ల సన్నుతింపఁ, జుట్టుకైదువబోదు తా నిట్టులనియె. 76

చ. చెల్లెలి దక్రమం బనుచుఁ జెప్పెద వించుకనీతి లేక యీ
కల్లలు పల్కినన్ జనులు కాపురుషుం డనఁ బోరె రేవతీ
వల్లభ కూటికై గృహమువాఁకిలిఁ గాచితి వంచు దూరుటన్
ఇల్లును వెళ్లిపొమ్మనుట కించుక భేదము లేదు చూడఁగన్. 77

తే. తోఁడఁబుట్టువు పుత్త్రునిఁ దోడుకొనుచు, విపినభూముల కరిగినవిధము దెలిసి
యించుకైనను వగవ కాయింతియందు, నెగ్గు గలదని చెప్పుటకో సిగ్గు గాదె. 78

వ. అని మఱియుం గోవిందుఁడిట్లను వీరపత్నియుం, వీరమాతయుం నగుసుభద్ర మనయందుఁ
గల కృపాతిశయంబున యాదవాదికౌరవులనెల్లఁ జంపవల దని సెల వొసఁగుటం
జేసి రక్షించెం గాక లేకున్న లోకవిద్రావణుం డగురావణునకు సమానవిక్రముం

ఈఘటోత్కచుని జయించుట యింద్రాదుల కసాధ్యం బదియునుంగాక రేవెల్లి
రేకం దెచ్చుట కీవు చనిన సౌభద్రునకుఁ బలికిఁ గండం గనినవిధం బగుట నిశ్చ
యం బనంతరంబు ప్రతి వచ్చుట కసాధ్యంబుగానుండు నని చెప్పి దామోదరుండు
వెండియు నిట్లనియె. 79

క. కాననభూములఁ బన్నియుఁ, బూనుఁదువిహరించువిధము సురముని దెలుపన్
వానరపతి కెక్కమువా, డీనిసపులివోలె వచ్చు నెఱుఁగవె యతనిన్. 80

వ. అదియునుం గాక. 81

క. వనసూకరంబు కొఱకై, మినుసిగదయ్యంబుతోడ మిక్కిలికయ్యం
బొనరిచి పాశుపతాస్త్రం,బును బడసినపార్థుఁ బోలుభూపతి గలఁడే. 82

తే. అధనంజయు జంటగా నరుగుదెంచు, బకహిడింబులఁ ద్రుంచిన బాహుబలుఁడు
వసుధ వినుమూలి సంతోషవార్థిఁ దేలి,వరధనంజయు జంటయై వచ్చినట్లు. 83

క. ధృతరాష్ట్రపుత్త్రకానన, వితతన్ గుమలించి వరుస విజయానలుఁ డీ
క్షితి కెల్ల ధర్మసూనునిఁ, బతిఁగా నొనరించు సురలు ప్రస్తుతి సేయన్. 84

వ. కావున. 85

సీ. ఉరుమృగేంద్రస్నేహమొల్లక గోమాయువులను జేకొనువానిచెలువు దోఁప
వినతాత్మజుని మేటివిశ్వాసమును మాని చెలిమి కాకులతోడఁ జేసినటుల
ఖండనరిపుకాండఖండనుం డగుపార్థు వియ్యమందక నీవు వెఱ్ఱి వగుచుఁ
జెడుగుమనుజులతోడఁ జేసినవియ్యంబు కొనసాఁగునే పట్టికొఱ్ఱ గాక
తే. అదురాత్మకు లీపురి కరుగుదెంచు, ఫలము యాదవులకుఁ గొంత ప్రాప్తమయ్యె
ననిన విని రాముఁ డౌను తా దనక శిరము, వంచి తర్జని నాసిపై నుంచియుండె. 86

వ. ఆసమయంబున. 87

సీ. అసదాగతిపాత్రుఁ డతిరౌద్రమూర్తియై తనమాయఁ జేసిన దానఁ జేసి
పుడమి కుమ్మరసానవోలికె దిద్దిరఁ దిరిగె నంబరమెల్ల ధరణిఁ బడిన
విధమయ్యె మెఱుపులు విస్తారముగఁ దోఁచెఁ దోఁడనె పిడుగులు దొరఁగె నపుడు
ప్రజలెల్ల దిగులొంది ప్రళయకాలం బని చిత్రరూపంబుల చెలువుదోఁప
తే దీనులై యున్నవారిఁ జేరి చూచి, దానవేశ్వరుఁ డావేళ దశసహస్ర
కింకరులఁ బంప వా రలబింక మమర, బలుసియిలుజొచ్చి రందఱు పార్థివేంద్ర. 88

క. బకవైరిసుతుని బలగము, ప్రకటంబుగఁ జేసినట్టిపను లేమందున్
సకలపదార్థము లన్నియుఁ, బకరాలయమందు వైచి మఱి యాపురిలోన్. 89

క. చరియించు రాక్షసులలో, ఖరకరుఁ డనురక్కసుండు కడుకోపమునన్
గురుపలితమ్మునిఁ గనుఁగొని, దురితాత్ముఁడ వీవు మున్ను ద్రుపదాత్మజకున్. 90

క. వలువల సభలో నొల్చిన, ఫలమంతయుం నీకుఁ గుడిపి బహువేడుకతో
విలసిల్లెద నని పల్కుచుఁ, దలపైఁ గుడిపాద మెత్తి తన్నెన్ గడఁకన్. 91

క. ఇంకొక దానవనాథుఁడు, పంకజహితసుతునిఁ జూచి పాండవపత్నిన్
వంకరకూఁతలు కూసిన, సంకటమును మాన్ప నాకు సమయం బబ్బెన్. 92

క. అని కర్ణునిఁ బెడతలపైఁ, దన డాఁపలిపాద మెత్తి తన్నిన వాఁడున్
పెనుగాలిచేతఁ గూలిన, ఘనభూజము మాడ్కి నేల గ్రక్కున వ్రాలెన్. 93

తే. పలలభోజనుఁ డొకఁడు సౌబలునిఁ జేరి, కపటనేత్రంపుఁబాచికల్ గావటంచు
నొక్కకరమున సిగఁ బట్టి చంక లెగర, గొఱిగెఁ దలవాఁడికత్తితోఁ గురుకులేంద్ర.

సీసమాలిక:—

మఱియొక్క రాక్షసుం డరుదెంచి దుస్సలపతి జయద్రథు నేలఁ బండబెట్టి
తొడఁబడ మోముపై నడిచి యంతటఁ బోక కొనకాలు పట్టీడ్చెఁ గొంతదవ్వు
వెండియు నొకరాక్షసేశ్వరుఁ డేతెంచి బలియుఁడౌ బాహ్లికుపజ్జఁ జేరి
ముసలిముప్పునఁ బెండ్లిమురిపెంబు వీక్షింపఁ జనుదెంచి తీపాటు ననుభవింపు
మనుచు మూపును బట్టి ఘనరౌద్రమూర్తియై నీటుగా వెన్ను మోకాట నూఁద
సురవైరి యొక్కఁ డాగురుతనూభవుఁ జూచి బాగాయెనో పెండ్లి బాపనయ్య
మరలఁ బెండ్లికి మీరు తర్లిపోదురు నేఁడు సంయమపురి కంచు సాఁగి మ్రొక్కె
నొకఁడు కృపాచార్యు నొయ్యన వీక్షించి భూసురోత్తమ పప్పుబువ్వకొఱకు
బ్రతిమాల ధృతరాష్ట్రసుతుని వెంబడి వచ్చి బోసేసితివి గాదె పొట్టనిండ
నాచార్యభాగంబు లర్పింతు రిఁక మీకు నిచ్చోట నుండుమం చేఁగె వాఁడు
రాక్షసుం డొక్కఁడు లక్ష్మణు వీక్షించి పెండ్లయ్యె నేమిరా పెండ్లికొడుక
గాము సోఁకినవానిగతి వేల్పువచ్చిన మనుజునిరీతి నున్మాదిమాడ్కిఁ
దలవంచుకొనియున్నఁ దప్పదు మృతి నీకు లె మ్మంచు సిగఁ బట్టి లేవనెత్తె
నొకపూర్వగీర్వాణుఁ డుగ్రుఁడై చనుదెంచి ధారుణీసురులలోఁ దూరి పలికె
నాజ్యభక్ష్యమ్ముల నాసించి యీకార్య మాను కా దనక మీ రరుగుదెంచి
తత్తఱిల్లిన మీకుఁ దప్పదు చా వంచు గుదికాళ్లు బంధించి కూల నేసె
దుందుభి యనువాఁడు వందిమాగధబృంద మంతయుం వీక్షించి సంతసిల్లి
పన్నలతలచీర లన్నియుం విదళించి గట్టిగా దామెనల్ గట్టివైచె
వెంటనే యొక్కఁడు వేశ్యాంగనలఁ జేరి సూచీముఖం బెట్లు చూపుఁడనుచు
ఖరకరద్యుతిగల కరవాల మంకించి ముక్కులు వరుసగా మోటుచేసె
నదియెల్ల వీక్షించి యతిభీతచిత్తులై పౌరు లొండొరులతోఁ బలికి రార
బలరాముఁ డత్యంతపాపాత్ముఁడై తోడఁబుట్టువు నిలు వెళ్లగొట్టి యిట్టి

పాపమానవులతో బాంధవం బొనరించుకతమునఁ బ్రజలకు గాసి గలిగె
మన సొమ్పియుండిన మాధవుం డిది మాన్పఁ గన్నెత్తి చూడఁ డీకర్మ మేమొ
సదనంబులం దున్న సర్పవృశ్చికబాధ తలలెత్తి చూడఁ బో శిలలబాధ
అని విలపింపఁగా నంతలోఁ గొండఱు పడఁతు లొండొరులతోఁ బలికి రహహ
అత్తగారింటికి నల్లుఁడు క్రొత్తగాఁ జనుదెంచి పిడుగుతోఁ జచ్చెనమ్మ
కలకంఠి యొక్కతె కపిలధేనువు పెద్దపుఁ నోటఁ బడి నేఁడు పోయెనమ్మ
ముదితరో వినురెండుమంతలపా లిచ్చు నెనుములు పెనుబొబ్బ కీల్గెనమ్మ
తొయ్యలి నూటాఱుతో డేళ్ల గుంపులై కూడి మేఁకలదొడ్డిఁ బాడు సేసెఁ
బదునైదు పాములు పదముల కెగఁబ్రాఁక భీతయై మాయత్త బెబ్బరించె
తలనిక్కిచూచినఁ దటుకున శిల దాఁకి యక్కకంటికి మోసమాయెనమ్మ
పాషాణ మొక్కటి బఱతెంచి తాఁకిన మఱిదికాల్ విఱిగెనే మందగమన
మిక్కిలిచలిలేళ్లు మీఁటిన మాతాత పెక్కుగంతులు వైచి పొగులసాఁగె

తే. ననుచుఁ బల్కుచు నాబాలవృద్ధ మంత, నక్కడక్కడ గుంపులై పెక్కువగల
మొఱలుపెట్టుచుఁ దాలాంకు మోముఁ జూచి, బలుఁడ నీవల్ల నా కింతబాధ గలిగె.

క. అని జనులందఱు పల్కఁగ, విని రాముఁడు శిరము వంచి వేఱొకటనకన్
తనమది రోయించెదుకటః, గనుఁగొని భీమాత్మజుండు గ్రక్కునఁ బలికెన్. 96

చ. వనమునఁ బాండవుల్ దిరుగ వారలవెంటఁ జరింపఁ బాలకన్
తనయుఁడుఁ దాను నిచ్చటికిఁ దద్దయుఁ గోర్కెను వచ్చి చేరఁగన్
మన మలరంగ సోదరిని మక్కువసేయక యాదరింపకన్
వనరుహనేత్రి నీవటుల వంకరమాటలు పల్కుటొప్పునే. 97

క. మేనల్లుని వరకన్యా, దానార్హునిఁ బార్థసుతుని దర్పకసమునిన్
మాని సుయోధనసుతునకు, మానిని నర్పింపఁ దగునె మామా నీకున్. 98

క. విజయతనూజున కొసఁగిన, గజగామిని లక్ష్మణునకుఁ గైకొనువాఁడై
విజయము చేసినవాఁ డీ, గజపురివల్లభుని బాగుఁ గనుఁగొను మింకన్. 99

క. పావనిపట్టికి మేనన్, జీవములుం గలిగియున్న సీరాయుధ! నీ
భావమునఁ దలఁచుకార్యముఁ, గావింపఁగ వశమె నీకుఁ గౌరవపతికిన్. 100

వ. అదియునుంగాక. 101

క. కురుపతి ననుజన్ములతో, సరసిజహితసుతునితోడ సౌబలుతోడన్
పరిణయదీక్షాత్తకులై, యరుదెంచినవారితోడ నవనిం గూల్తున్. 102

క. అని మీసంబులు దువ్వుచుఁ, గను కెంజిగఁ జేసి ప్రళయకాలసముం డై
వనమాలిపూర్వజానకున్, గనుపింపక నేఁగె వాఁడు ఘనపథమునకున్. 103

వ. ఇట్లంతరిక్షచరుండై ఘటోత్కచుం డతిభయంకరంబగు మాయ ప్రబలంబుగావింప

దానం జేసి కౌరవులయంగాంగంబులు ఈడ్చి ధరాతలంబునం బొరలిన ట్లంతఃపుర
కామినీజనంబులమూఁకలకుం దోఁప భయాకులచిత్తలై విలపించువారలం జూచి
నీలాంబరుండు దనమనంబున నిట్లని వితర్కించె 104

సీ. చిన్నతమ్మునిపల్కు లన్నియుఁ నిజమయ్యె నదిగాక సకలాత్ముఁ డచ్యుతుండు
శరణాగతత్రాణబిరుదు దాల్చినమేటి శ్రీరమారమణుండు శేషశాయి
వేణునాదవినోది బాణాసురచ్ఛేది ఖగవాహనామోది కైటభారి
నరసఖుం డానందనందనుం డసురారి గోపికాలయవర్తి కృష్ణమూర్తి
తే. ఆత్మఁ దలఁచిన నణువు బ్రహ్మాండమగును, క్షణములోపల జగమెల్ల తృణము సేయుఁ
నట్టిహరి పక్షపాతియై నందువలన, రక్కసులఁ జోని కీపరాక్రమము చెల్లె. 105

వ. అని గోపాలదేవుని మాహాత్మ్యంబు వర్ణించి మఱియును. 106

తే. ఇతనిఁ జేపట్టి పాండవుల్ బ్రతుకఁ గలరు, కౌరవేంద్రుఁడు మిక్కిలి గర్వియగుచు
సరకుసేయక కర్ణాదిసహితముగను, జెఱుట నిశ్చయమని యెంచి సీరపాణి. 107

సీ. అబ్జనాభునిపల్కు లాలకింపక నేను వెట్టితి శశిరేఖ విజయసుతున
కీయక పాపాత్ముఁ డిభపురేంద్రునితోడ వియ్యమందెద నంచు విజ్ఞప్తి
చేసిన కార్యంబుఁ జేసేత గుడిచితి హరిచిత్త మరయ లేనైతి ననుచుఁ
దనలోనె చింతించుతాలాంకు నీక్షించి వికవిక నగుచు గోవిందుఁ డనియె
తే. ప్రళయకాలంపురుద్రునిపగది మింట, సంచరింపుచు మనమీఁదఁ జలము పట్టి
రాక్షసేంద్రుఁడు వచ్చినరాజసుతుల, వసుధపైఁ గూల్చు గావున వగపు మాని. 108

క. అన్నా నాపల్కులు విను, కన్నియ శశిరేఖమనసు కవ్వడిసుతుపై
నున్నది సౌభద్రునకుం, గన్నియపైఁ గోర్కి గలదు గావున వారిన్. 109

క. ఎడబాపఁ దగదు నీకున్, గడుపాపము సంభవించు గలిఁ బోనేలా
యెడయఁడు మనశశిరేఖకు, వెడఁగల్తునిఁబోలునట్టి విజయాత్మజుఁ డా. 110

తే. పరశురాముఁ జయించినబల్లిదునకు, వాయుభుగ్భక్షణోత్తమవాహనునకుఁ
దుల్యుఁ డభిమన్యు లక్ష్మణతుల్యుఁ జేయ, హస్తిమశకంబునకు సామ్యమనుట రామ.

వ. అని చెప్పి మధుసూదనుండు మఱియు నిట్లనియె. 112

క. సామంబునఁ జక్కంబడు, భీమునిసుతుఁ డంచుఁ బల్కి పీతాంబరుఁ డా
రాముని దోడ్కొని సంధికి, భూమిజను ల్మనముఁ జెందఁ బోయెడువేళన్. 113

సీ. కరకంకణధ్వనుల్ గల్లుగల్లని మ్రోయ రమణీమణులు చామరములు వీవ
వందిమాగధులు కైవారము ల్గావింప నుర్వీగీర్వాణు లాశీర్వదింప
వేత్రహస్తులు నూరువేలఁ దువతోడ బహుపరాకని బరాబరు లొనర్ప
డమరు వీణా మృదంగ ఢక్కాదివాద్యముల్ శ్రుతుల కంతంతకు సొంపొనర్ప

తే. తమ్ముఁ డత్యంతభక్తిఁ గైదండయొసఁగ, రత్నమయ మైనకొన్ని ద్వారములు దాఁటి
పాకశాత్మజుఁడు వేగమె బయలుదేఱి, గట్టిగాఁ దాను దనుజున కిట్టులనియె. 114

సీ. ఓహో ఘటోత్కచ యో భీమనందన మెచ్చితి నీధైర్యలక్ష్మిమహిమ
రావణాసురపాటవరణగరిష్ఠుఁడ వీవు నిన్ను సాధింపంగ నెవ్వఁడోపు
తమ్మునికొఱకునై తక్షణంబున వచ్చి వనిత నెత్తుకపోయి వనముఁ జేర్చి
పెండియుఁ జనుదెంచి వేపంకపురనాథు కండక్రొవ్వణఁగించి కర్ణు నొంచి
తే. పరిణయంబున కరుదెంచుధరణిపతులఁ, జంపఁ జూచెద విది యేమిసాహసంబు
చలము సాధించుకొంటివి చాలుచాలు, రాక్షసేశ్వర దయయుంచి రమ్ము రమ్ము.

ఉ. కాలవిశేషమున్ గనక గాండివిపత్నిని నిందురేఖకై
నీలపటంబుతాల్ప నవనీతిగఁ గొన్ని వచించినందు కీ
యాలముఁ గల్గఁజేసితి వయారె విరోధము మామగారిపైఁ
జాలఁ గృపారసంబు నిడి సంధికి రమ్ము బకాంతకాత్మజా. 116

క. కల్లలు గావివి రాక్షసవల్లభ నాపలుకు నమ్మి వచ్చితివేనిన్
ఉల్లము రంజిలఁ బార్థికిఁ, జెల్లెలు ముదమందఁ బెండ్లి జేసెద మింకన్. 117

క. అనిపల్కిన గోవిందుని,మునుగని యాభీమసుతుఁడు ముకుళితకరుఁడై
వనరుహలోచన మాధవ, సనకనుత వాసుదేవ సామజవరదా. 118

క. కందర్పజనక వినతా,నందనకంఖాణ నందనందన హరి గో
వింద జనార్దన నీకు, న్వందన మిదె వాసుదేవ వారిజనాభా. 119

వ. అని మఱియు నిట్లనియె. 120

సీ. పాకశాసనపుత్త్రుపత్నియై గోవింద నీకు తోఁబుట్టువై తనరినట్టి
యాసుభద్రను రామఁ డాడరానటువంటి కఠినవాక్యము లాడి కౌరవులకు
రమణి నిచ్చెద నంచు రప్పించి వెంటనే పరిణయం బొనరింప భావ్య మగునె
మాబోఁటిపెద్దలు మేరఁ దప్పినయంత మాబోఁటిమూఢులమది దలంప
తే. నిబ్బరముఁ బట్టఁజాల దోనీరజాక్ష,సామమున కీవు రమ్మని ప్రేమచేతఁ
బిలిచినటువలె హాలపాణి పిలువఁ డితఁడు, పిలువకుండిన నేనేల నలుగ కుందు. 121

వ. కావున. 122

క. కౌరవుల వారివారలఁ, బోరున మర్దించి పిదప పురుషోత్తమ యీ
ద్వారకనగరముతోడన్, నీరధిలోఁ గలిపి పోదు నిమిషార్ధమునన్. 123

క. అని సింహనాద మొనరుచు,దనుజేంద్రునిఁ జూచి సీరి తగ నిట్లను నా
తనుజ యగునిందురేఖను, దనుజేశ్వర రమ్ము నీదుతమ్మున కిత్తున్. 124

వ. అని పల్కి బలభద్రుఁడు ఘటోత్కచునితో మరియు నిట్లనియె. 125

క. శశివదనుఁడు మాధవుండును, ననుదూఱుదు రదియుఁగాక నగరములోనన్
జనులెల్లఁ దిట్టుచుందురు, దనుజేశ్వర నీవు దానిఁ ద్రవ్వఁగ నేలా? 126

క. మీకంటెను బంధువు లేక, నా కెవ్వరు లేరు వినుము నా కపకీర్తిన్
రాకుండ నిటకు వచ్చిన, రాకొమరుల బ్రతుకఁ జూడు రాక్షసనాథా. 127

క. వలమురితాలుపు చెప్పిన, పలుకులు చెవి సోఁకనీక పాపాత్ముఁడ నై
చెలియలి నవమానించిన, ఫలమంతయు నేఁడు నాకుఁ బ్రాప్తం బయ్యెన్. 128

క. లలనామణి శశిరేఖను, బలభిత్సుతసుతున కీక పాపాత్మకులా
తులువల కొసఁగినకతమునఁ, గలహము జన్మించెఁ గాక కలుగునె మనకున్. 129

వ. అని మఱియును. 130

క. ధరణీనాథు లనేకులు, పరిణయవీక్షాత్ము లగుచు బహువేడుకతో
నరుదెంచినారు వీరిన్, కరుణారసపూర విందుకఁ గావుము వత్సా. 131

క. అని పల్కిన బలరాముని, వినయోక్తుల కాత్మ నలరి వికవిక నగి య
ద్దనుజశిఖామణి వెండియు, ననరూర్గ నిట్టులనియె నీలాంబరుతోన్. 132

ఉ. మంజుల మైననీవచనమాధురికి న్మది సంతసిల్లె నీ
కంజలి చేసి వేఁడెద హలాయుధ విన్నప మాలకించి యా
కుంజరపట్టణాధిపుని కూరిమితమ్ములఁ బుత్త్రమిత్త్రులన్
కంజదళాక్షుల న్వరుసఁ గ్రక్కునఁ బ్రోల్వెడలింపు మింతటన్. 133

వ. అని చెప్పిన ఘటోత్కచునివాక్యంబులకుఁ బ్రతివచింపంజాలక తనసహోదరుండైన
సాత్యకిం జూచి హలాయుధుం డిట్లనియె. 134

ఉ. తమ్ముఁడ నీవు తత్క్షణమె దంతిపురేంద్రునిఁ దత్సహోదరులన్
దమ్ములఁ బుత్త్రులన్ హితులఁ దామరసాప్తసూతవాములన్
బొమ్మనిచెప్పి రమ్మనిన బుద్ధి పరా కని చెప్పి యప్పుడే
పమ్మదమందుచు న్వెడలి సాత్యకి వారలఁ జేరి యిట్లనెన్. 135

సీ. ఓరి దుర్యోధన యోజయద్రథ కర్ణ యోదుస్ససేన యోరోరిశల్య
ఓద్రోణనందన యోకృప వృషసేన యోసోమదత్త యోరోరిశకుని
ఓరిబాహ్లీక మీ రూరక మాయూరిపంచను బడి యేలపరితపింప
మెచ్చి మా పెద్దన్న మిముఁ దెచ్చినందుకు మీరు చావకయున్న మేలుచాలు
తే. ధార్తరాష్ట్రులు త్రొక్కినస్థానమెల్లఁ, దలఁచి చూడంగ నిర్ధూమధామ మగును
కేశవుని మీరు పలుమారు గేలిచేసి, నట్టిఫలమెల్ల ననుభవ మయ్యె మీకు. 136

వ. అని వెండియు. 137

తే. ఇనుములోఁగూడి తొలుత యజ్ఞేశ్వరునకు, దబ్బు సమ్మెటదెబ్బలు తగిలినట్టు

మీరు పాపాత్ములగుట మాయూరుజొచ్చి, రాఁగ జనులకు శిలవెట్లు ప్రాప్తమయ్యె.

వ. కావున. 139

క. పనియేమి యిచట మీకుఁ, మనుజాధములార యింక మసలితిరేనిన్
దనుజశిఖామణి మిమ్ముఁ, దునుమాడుట నిశ్చయంబు దుర్మతులారా. 140

క. అని శినిపౌత్రుఁడు పల్కిన, విని యొండొరుమోము లట్టె వీక్షింపుచు న
జ్జననాథులు తమకాంతలఁ, గనుసైఁగలఁ బిల్చికొనుచుఁ గదలెను వేగన్. 141

చ. కురుపతి మోము వంచుకొని కుందినడెందముతోడ ద్వారకా
పురిపొలిమేరయుం గడచిపోయెడురాజును జూచి తమ్ములున్
తరుణులు పుత్త్రమిత్త్రులును దక్కినభూపతు లెల్ల భీతులై
కరిపురిత్రోవఁ బట్టుకొని గ్రక్కున సేరి రేమిచెప్పుదున్. 142

వ. ఆసమయంబున. 143

ఉ. అంతిపురాంగనల్ పలికి రౌర సుభద్ర యొనర్చుపుణ్యమున్
ఎంతనిచెప్పవచ్చు సుతు లింతపరాక్రము లాజ్ఞ మీరకన్
ఇంతటికార్యము న్సలిపి రిట్టితనూజులు లేనిమాకు నీ
దంతిరథాశ్వసైన్యధనధాన్యవిశేషము లేల కాల్పనే? 144

వ. అని మఱియుం గిట్లని ర్జునుం డరణ్యంబున ముక్కంటితోఁ బెక్కుటేఁ బోరి పాశుపతాస్త్రంబుఁ గొని కాలకేయాదినివాతకవచుల నిర్జించి పాకశాసనుచేత దివ్యాస్త్రలాభంబు నొందినట్టిభీభత్సునకుఁ బత్ని యగుటం జేసి వీరపత్నియయ్యె, కంస నరకాసురబాణాసురమర్దనుం డగురథాంగపాణితోఁ బుట్టు వగుటం జేసి వీరసోదరియయ్యె, అభిమన్యు ఘటోత్కచులకు మాత యగుటం జేసి వీరమాతయయ్యెఁ గావున సుభద్రపురాకృతపుణ్యఫలం బెంతయని గణుతింతు మని కౌరవాంగన లొకరితో నొకరు భాషించుచుం జనుచున్న సమయంబున. 145

సీ. భూసురుల్ గుంపులై పురిఁ బాసి పోవుచు నెక్కడిపెండ్లి వీఁ డేటిరాజు
క్షాత్త్రంబు వర్జించి సమరంబు సేయక యొక్కరక్కసునకై యోడి పారె
వీనిసంభావన వీసమైనను లేదు సూపాన్నమెట్టిదో చూడలేదు
ఆజ్యభక్ష్యంబులు పూజ్యమైపోయెను తాలదెబ్బలు చాల లభ్యమాయె
తే. రాజరాజను పేరు యీరాజు కేల, ప్రధన మెందుకుఁ గరులేల రథములేల
సాధనము లేల హరులేల సైన్యమేల, యేల నిర్భాగ్యునకు రాజ్య మేల యేల. 146

సీ. అనినకొందఱువిప్రు లసురచే నీరాత్రి చావకుండిన మేలు చాలు చాలు
గుండ్లుదెబ్బలె కదా పెండ్లిసంభావన పదమని చెప్పుచుఁ బరువు లిడఁగ

వారాంగనామణు ల్వగచుచు గుమిగూడి దిక్కుమాలిన పెండ్లి దీర్పరాఁగ
ముక్కుకోఁతలు గల్గె నక్కరో యింకేమి గతి యంచుఁ జింతించు కమలముఖులఁ
తే. జూచి యొకబోటి పలికె నోసుందరాంగి, తాళగాఁ డీల్గె సుతికాఁడు ధరణిఁగూలె
వరుస మద్దెలవాయించువాఁడు చచ్చె, సామజముచేతఁ బులిచేతఁ బాముచేత. 147

క. అని యిట్లు వారవనితలు, దనుజేంద్రుని భీతిఁ దవిలి తత్తరపడుచున్
మును వచ్చినమార్గంబునఁ, జని రండఱు గుంపులగుచు జగతీనాథా. 148

వ. ఇవ్విధంబునఁ గౌరవసైన్యంబునం గలజనంబులు శార్దూలంబుబారిం బడి వెడలుధేనువులమాడ్కిఁ గంఠీరవంబులం గని బెగడుగజంబులపగిది వృకంబులం గనినయజంబులరీతి పలాయనం బగుట వీక్షించి భీష్మద్రోణులవాక్యంబు లుగ్గడించి దీనాననుండై చింతించుచున్న సుయోధనుం జూచి రాధేయుం డిట్లనియె. 149

సీ. మనుజాశనుఁడు పెక్కుమాయలు గల్పించి వారిదంబున డాఁగి వైరులకును
అంగంబుఁ జూపక దొంగపోరొనరించుకతమున జీవించెఁ గాక యెదుట
నిలిచి కయ్యముసేయ నిమిషమాత్రంబులోఁ బంపును సంయమిపట్టణమున
కదిగాక వారి పక్షపాతి యైనందున వాఁడిపోకలు చెల్లె మానవేంద్ర
తే. మనకుఁ గౌంతేయులకు యుద్ధ మెనసినపుడు, పసిఁడివరయందుఁ జేర్చిన పాముతూపుఁ
బెఱికి పార్థునిఁ దక్కినధరణిపతుల, క్షణములోపలఁ బరిమార్చి ఋణముదీర్తు.

వ. అదియునుంగాక. 151

క. ఇంద్రజునికొడుకు కొసఁగిన, చంద్రానన తగదు మనకు సరిపోల్పఁగ రా
జేంద్ర మనలక్ష్మణునకును, సాంద్రముగాఁ గలరు చెలులు జగతీస్థలిలోన్. 152

వ. అనిన గృపాచార్యుండు కర్ణునితో నిట్లనియె. 153

సీ. భీమపుత్త్రునిచేతి పెట్టు కోర్వఁగలేక పిఱికివై చనుదెంచి బిరుదుమాడ్కి
రజ్జుకూఁతలు గూసి రారాజునకు లేనియాశఁ గల్పించెద వంతెకాక
ఫాలనేత్రునితోడ బవరం బొనర్చినఁ బార్థుబారిని బడి బ్రతుకవశమె
ఆకిరీటికి నీకు నజగజంబులవలె సమరంగఁ దార్క్ష్యకాకములపగిదిఁ
తే. దారతమ్యంబు తెలియఁగక తప్పుకూఁత, లేల గూసెద వినువారి కింపుగావు
పడమడియుఁ బార్థు లేకమై వెడలినపుడు, వాసవునకైన శక్యమె వారి గెలువ.

క. అనిన విని కర్ణుఁ డిట్లనుఁ, బనికిం గొరగానియిట్టిపల్కులు పలుకన్
వినువారలెల్ల నవ్వరె, మనుజాధమ నీకుఁ దగదు మఱిమఱి పలుకన్. 155

క. జీవన మొసఁగెడురాజును, దైవముగా హృదయమందుఁ దలఁపక నిరతం
బీవిధమున దూషింపుచుఁ, గావరమున శత్రుఁ బొగడుకపటాత్ములకున్. 156

వ. కృతఘ్నులనుశాపంబు గలుగు నని రారాజుం జూచి కానీనుం డిట్లనియె. 157

క. అని మొన గార్ముక మెక్కిడి, ఘనశరములు నారిఁ దొడిగి కౌంతేయులతో
నని చేసినపుడు నన్నుం, గనుఁగొను మిపు డేలచెప్పఁ గౌరవనాథా. 158

క. అన విని కురుపతి కర్ణునిఁ దనతమ్ముల సుతుల పింతులఁ దద్దయుఁ బ్రీతిన్
గనుఁగొని కుశలం బడుగుచుఁ, జని తనపురిఁ జొచ్చె రాజు సందడిగొనఁగన్. 159

వ. ఇవ్విధంబున. 160

ఉ. ద్వారకఁ బాసి కౌరవులు తర్లినఁ జూచి ఘటోత్కచుండు కం
సారికి సీరికి న్వరుస సాఁగిలి మ్రొక్కి మహాత్ములార మీ
కూరిమి నాపయి న్నిలిపి కోరినకోరికెఁ దీర్చి బ్రోవుఁ డీ
సారికిఁ బోయివత్తు నని చయ్యనఁ దద్వనసీమ కేఁగినన్. 161

వ. ఆసమయంబున. 162

క. ఱెక్కలు విదలిచి యీకలు, ముక్కునఁ జక్కంగ దీడి ముదమున మోము
ల్నిక్కించి మిన్నుఁ జూచుచుఁ, గొక్కొరొకో యనుచుఁ గోళ్లు కూసె న్వరుసన్.

వ. తదనంతరంబ. 164

సీ. ప్రాగ్దిశాంగన తాల్చు బహురత్నభరితమౌ పదియాఱువన్నెలపదక మనఁగ
దినవిటుం డనువాఁడు దిక్కాంతకును బంపు మణిగణద్యుతుల రాశిణి యనంగఁ
గరిమొ రాలింపుచుఁ గ్రక్కున మకరిపై సారసాప్తుఁడు పంపుచక్ర మనఁగ
గైరికద్యుతు లొల్కు ఘనయశోకపుసుమసమితిఁ గూర్చినవర స్తబక మనఁగఁ
తే. దమముఁ దోలుచుఁ జక్రవాకములకెల్లఁ, బరమసంతోష మొనరించి పద్మములకు
ముఖవికసనంబుఁ గావించి ముద మొనర్చి, యుదయశైలాగ్రమున భానుఁ డుద్భవించె.

వ. ఆసమయంబున ఘటోత్కచుండు హిడింబి సుభద్రలకు సాష్టాంగదండప్రణా
మంబు లాచరించి సౌభద్రుని గాఁగిటం గ్రుచ్చి తాను పోయివచ్చినవృత్తాంతం
బాద్యంతంబు సవిస్తరంబుగా వినిపించిన విని సుభద్ర సంతోషసాగరంబునం దేలి
హైడింబున కిట్లనియె. 166

క. అన్నా నీశౌర్యము నే, నెన్నఁడు వివరించి చూచి యెఱుఁగను నేఁ డీ
కన్నియకొఱకై చూచితిఁ, గన్నులకును బండువయ్యెఁ గాదా నాకున్. 167

క. జననీజనకులు నిన్నున్, గని ముదమున నెత్తి పెంచి కడుమక్కువతో
మనిచినఋణంబుఁ బాపెను, తనయుఁడు మఱి నీవె కాక దానవనాథా. 168

క. కుసగలకురుసైన్యమునం, దసహాయులు గలరు వారి నని మొనలోనన్
దెసలకు గదిమితి వౌరా, యసురేశ్వర నీసమాన మవనిం గలరే. 169

క. మీతండ్రిగారు యీవిధఁ మాతతముగ వినినఁ గోర్కు లబ్బె నటంచున్
చేతోమోదము నొందరె, మాతెఱఁగున వార లచట మారుతిపుత్రా. 170

వ. అని మఱియుఁ నిట్లనియె. 171

క. తనయా దీర్ఘాయువు గ, మ్మని తా దీవించుతల్లిమధురోక్తులకున్
దనుబ్బుఁడు మది ముద మందుచు, జననీమణిపాదములకు సాఁగిలి మ్రొక్కెన్. 172

క. ఈతెఱఁగున హైడింబుఁడు, మాతకుఁ దనసోదరునకు మఱఁదలిమదికిన్
బ్రీతి వహిల్లఁగఁ జేయుచు, వీతమనోమలిముఁ దగుచు వేడ్కతో నుండెన్. 173

వ. అని వైశంపాయనుండు మఱియు నిట్లనియె. 174

ఉ. ద్వారకవాసుఁ డై వెలయు దైవశిఖామణి రుక్మిణీమన
స్సారసభానుని న్వికచసారసలోచను మేలుకొల్ప శృం
గారవిలాసముల్ గలుగుకాంతలు భక్తులు రత్నమందిర
ద్వారముచెంగట న్నిలిచి దానవభంజనులీల లెన్నుచున్. 175

సీ. యాదవాన్వయవార్ధి మోదంబు నొందించు మిహిరకిరణప్రాయ మేలుకొనుము
పూతనచనుఁ ద్రావి భూమిపైఁ గూల్చిన మేదినీధరధీర మేలుకొనుము
షోడశాయుతగోపసుందరీలోలుఁ డై మీఱుచారువిహార మేలుకొనుము
గోవర్ధననగంబు గోరక్షణంబుకై కేలఁ దాల్చినదేవ మేలుకొనుము
తే. నీలనీరదరుచిదేహ మేలుకొనుము, ఫాలలోచనసుతశీల మేలుకొనుము
వాలితాకార మాధవ మేలుకొనుము, బాలగోపాల పరిపాల మేలుకొనుము. 176

క. అని యిట్లు మేలుకొల్పిన, విని దిగ్గున నిద్ర లేచి వేగంబున మ
జ్జనశాల కేఁగి యచ్చట, వనితామణు లందియిచ్చువారిం గొనుచున్. 177

సీ. స్నానంబుఁ గావించి పరిగంచుచేలంబు సవరించె తిరుమణి చక్కదిద్ది
తిరుచూర్ణతిలకంబుఁ దీర్చి పిమ్మట కార్యవిధు లొప్పఁగా సల్పి వేడ్క మిగుల
మణిహారరుచిరమా మకుటంబు వెసఁ దాల్చి విమలవజ్రపుఁగుండలములు పెట్టి
పాకారిమణులచే భాసిల్లుబంగారు భుజకిరీటంబులు పొసఁగ నునిచి
తే. ధర్మవసనంబు ముంగులు బారఁ గట్టి, చక్రశార్ఙ్గాదిసాధనచయముఁ దాల్చి
సఖులు తనవెంట నంటిరా సంతసమున, మధ్యకక్ష్యాంతరముఁ జేరె మాధవుండు.

వ. అట్టియెడ బలదేవసాత్యకిగదాక్రూరకృతవర్మోద్ధవాదులును సారణప్రద్యుమ్నసాం బానిరుద్ధాదికుమారులును బొడసూపినం జూచి దామోదరుండు వారల నుచితపీఠం బులఁ గూర్చుండ నియోగించి తదనంతరంబ బలభద్రసాత్యకులం బిలిచి సుభద్రా భిమన్యులఁ దోడ్కొనివచ్చుట కంతఃపురకామినులతోఁ బ్రయాణసన్నాహంబు సేయుం డనిన వార లాక్షణంబున రేవతీరుక్మిణీసత్యభామాదికాంతల రథంబు లం జేర్చి తమతమరథంబు లారోహణంబుఁ గావించి రాసమయంబున గోపాల

దేవుండు డెబ్బదిరెండు పక్షాంతరంబులు గడిచి యేనుంగు మొగసాలకడ రథం
బెక్కి ప్రయాణోన్ముఖుం డగుచు వెడలుసమయంబున. 179

సీ. కూర్చినముత్యాలగొడుగులనీడచే హంసమండలరశ్మి యడఁగిపోవఁ
చామరంబులఁ బుట్టుజంఝానిలంబుచే నీలాంబుదంబులు నింగి కెగయ
వాజిఖురోద్ధూతపాంసుజాలంబుచే భాస్కరుం డద్దంబుభాతిఁ దనర
గజబృందఘీంకారఘనవిరావంబుచేఁ బరగ దిక్కరులకు బధిర మొదవ
తే. సమరభీకర మగుసాధనములు పట్టి, శూరభటు లాఱుపద్మముల్ చుట్టు నడువ
వనజనాభుఁడు హైడింబువనముఁ జొచ్చె, ... ... ... 180

క. అంతట హైడింబుఁడు తా, నెంతో మది ముదము నొంది యిట్లని పలికెన్
దంతిరథాశ్వభటాళితో, కంతునిగురుఁ డరుగుదెంచుకలకల మదిగో. 181

క. కరుణాకటాక్షవీక్షణుఁ, డరవిందదళాయతాక్షుఁ డరిమర్దనుఁ డా
గరుడతురంగుఁడు శ్రీహరి, మరచునె మనయందు. గలుగుమాలిమి తల్లీ. 182

క. అని యిట్లు పల్కుసమయం,బున రాముఁడు కేశవుండు భూరితరంబౌ
దనుజుని గిరిగహ్వరముం, గనుఁగొని తమరథము లచట గ్రక్కున డిగిరన్. 183

వ. ఇట్లు రథావతరణం బగురామకేశవులకు మ్రొక్కి ఘటోత్కచుండు మణిమయం
బైనగుహాప్రదేశంబునకుం దోడ్కొనిపోయి కూర్చుండ నియోగించె నంత సుభ
ద్రయుం జనుదెంచి తదగ్రజులకు సాష్టాంగదండప్రణామంబు లొనరించి యుం
న్నంత రుక్మిణీదేవిమొదలైనకాంతలును ప్రద్యుమ్నాదికుమారులును కృతవర్మాక్రూ
రయుద్ధవాదులును దమతమరథంబులు డిగ్గి గుహాప్రదేశంబునకుం జని కూర్చుండి
రాసమయంబున దీనానన యై యున్న సుభద్రం జూచి దామోదరుం డిట్లనియె.

క. పెద్దన్న పల్కుపల్కులు, ముద్దియ మదినుంచవలదు మఱ్ఱారును నీ
పద్దు జయించెను కోపము, వద్దమ్మా విజయురాణి యోమృదుపాణీ. 185

క. క్షితిభృద్ధైర్యం బొప్పిన, యతులితరణరంగదక్షు లరిమర్దను లీ
సుతులుం గలిగిననీ వీ, గతిఁ బరిచింతింప నేల కమలదళాక్షీ. 186

క. భీమతనూజునిసాహస, మేమని వినుతింతుఁ గౌరవేంద్రుని శకునిం
దామరసాప్తతనూజుని, సామజపురిఁ జేర్చె నింత చాలదె మనకున్. 187

క. నీకోడలు నినుఁ జేరను, నీకోరిక సఫల మయ్యె నిమిషార్ధములో
నీ కేమికొదువ తల్లీ, పాకారికుమారుఁ డాత్మపతియై యుండన్. 188

వ. అని మఱియుం గోవిందుం డిట్లనియె. 189

సీ. అభిమన్యునకు హారిణాక్షికిఁ బరిణయం బొనరించుకోరికె పొడమి యిటకు
నిన్నుఁ దోడ్కొనిపోవ నీలాంబరుఁడు వచ్చె నని పల్కుకౌరియాననముఁ జూచి

భద్రేభయాన సుభద్ర చేతులు మోడ్చి పంకజనాభ యీబలుఁడు నన్నుఁ
బలికినపలుకుల కలిగి పుత్త్రునితోడ రెండుదినంబులు రేయుం బగలు
తే. నడచి యీఘోరవనమున నడవలేక, నలఁతచే నేను నిద్రించునంతలోన
నన్నుదమ్ములభావంబు లరయలేక, ధీరు లీపుత్త్రు లిరువురు పోరిపోరి. 190

క. రోసంబున వీరిరువురు, భాసురకమలాసనాఖ్యబాణంబులఁ జే
రీసున నుపక్రమించిన, వ్యాసమహామౌనిసింహుఁ డడ్డం బచ్చున్. 191

వ. వీరిరువురనడుమ నిలిచి భీమార్జునులకుమారు లని యెఱింగించి పారాశర్యుం డంత
ర్ధానంబు నొందిన ఘటోత్కచుం డభిమన్యుం గౌఁగిలించుకొని మద్వృత్తాంతం
బాద్యంతంబు విని రోషారుణితనేత్రుండై ద్వారకాపురంబునకుం జని శశిరేఖం
దెచ్చినాఁ డనిచెప్పి సుభద్ర గోవిందున కిట్లనియె. 192

సీ. ఈభీమనందనుం డింతిఁ దెచ్చిన దొకయెగ్గుగా దోఁచిన నితనిఁ బ్రోవుఁ
డీశశిరేఖాఖ్య యిభరాజగామిని మీరు తోడ్కొనిపోండు మేము పాండు
తనయులు విహరించువనము కేఁగెదము నాసుతున కెచ్చటనైన సుదతి దొరకు
భాగ్యవంతులపుత్త్రి బహుగుల కేలబ్బు ధనవంతు లగుదురు యోధనునిపట్టి
తే. కొసఁగి చేసిన సమవియ్య మొప్పు నరుచు, న్యాయనిష్ఠురవాక్యముల్ తోయజాక్షి
పలుక నాపల్కు విని బలభద్రుఁ డాత్మఁ, బుట్టుపగపునఁ జెల్లెలి కిట్టులనియె. 193

క. పంకజలోచన దైవము, బొంకించిన బుద్ధి లేక బొంకితి విను నా
బొంకు లిరంబుగ నీమ్ము, త్వఁకజమున నిల్పవలదు పార్థునియాన్. 194

సీ. నాకతంబున నీవు నగరంబు వెడబాసి భయదాటవులయందు బాధనొందు
పాపంబు పోపునే పదఁలి నీసుతునకుఁ బొసఁగఁ గన్యాదాన మొసఁగకున్న
నేను బార్థునకు మో మెట్లు చూపుదు నంచు విలపించుహలిఁ జూచి విజయురాణి
యేడ్చిన వీక్షించి యింతులందఱు నేడ్చి రది చూచి ప్రద్యుమ్నుఁ డావగాఁగ
తే. సాంబుఁ డనిరుద్ధుఁ డుద్ధవసాత్యకులును, గదుఁడు కృతవర్మ సారణు లన్నుఁగవల
నీరు పెట్టిన వీక్షించి నీరజాక్షుఁ, డూరడింపుచుఁ బార్థునియంద కనియె. 195

ఉ. చెల్లెల నీవు నీపగిదిఁ జింత వహింపఁగ నీరసాధనుం
డుల్లమునందు పెన్నగపు నూర్జితమై పెనుపొందువేదనన్
జల్లనఁ గంట నీరిడియె సారసలోచన యీమహాత్ముఁడున్
దొల్లి వచించువాక్యములదోషము లెంచకుమమ్మ వేఁడెదన్. 196

సీ ఆని యిట్లుపల్కిన హరిపల్కు లాలించి సంతసంబున సవ్యసాచిపత్ని
మాధవ నీవాక్యమధురామృతంబున మదినున్నతాపంబు మాసె నాకు

బలభద్రుపుత్త్రి యీబాలజాబిరేఖను నిచ్చిన మఱియు మీ రివ్వకున్న
మేనమామలు మీరు మేనల్లుఁ డభిమన్యుఁ డన్నలు మీరు నే ననుజ ననుచుఁ

తే. కరతుంగంబును ముకుళించి పరమభక్తి, వారిజోదర గోవింద వాసుదేవ
సుందరాకార గోపికాబృందలోల, పన్నగాశనకంఖాణ పరమపురుష. 197

వ. అని సుభద్ర బలభద్రుం జూచి యిట్లనియె. 198

క. నేరిచి నేరక చేసిన, నేరంబులు మఱచి నన్ను నెనరూరంగా
భూరికృపన్ రక్షింపవె, సీరాయుధ యంచుఁ బల్కె చెల్లెలితోడన్. 199

క. బలదేవుఁ డనియెఁ దల్లీ, తలఁపఁగ నీయందుఁ గలదె తప్పరయంగాఁ
దెలియక మూర్ఖత నిన్నుం, బలికినయాతప్పు నాది పద్మదళాక్షీ. 2'0

క. పురికిం జనుదెంచెద నని, కరివరదుం డాలకింప గ్రక్కున నాకున్
వర మొసఁగు మనిన విని యా, సరసిజముఖి పార్థురాణి సంతోషిత యై. 201

క. ఉన్నయెడ రాముపత్నియుం, వెన్నునిసతు లరుగుదెంచి వినుము సుభద్రా
పన్నగపృగవినివేశమా, లిన్నగముల సంచరింప నెందుకు దల్లీ. 202

వ. అని మఱియు నిట్లనిరి. 203

సీ. పురుషోత్తమునితోడఁ బుట్టువై భీభత్సువనిత యై యీఘోరవనమునందు
తల్లిదండ్రులఁ బాసి తనయునితో నీవు గాసిఁ బొందఁగ నేల కమలనేత్ర
బలభద్రుఁ డత్యంతభక్తిఁ దోడ్కొనిపోవ వచ్చినాఁ డింక నీవగపు మాను
మెక్కడ లక్ష్మణుం డెక్కడ శశిరేఖ కాలిగోరునుసాటి బోలఁ డతఁడు

తే. చూడ వీరిర్వురకు నీడు జోడు గాక, యిభపురేంద్రునిపట్టికి నీడుగాదు
సుదతి శశిరేఖ యభిమన్యుసొమ్ముగాని, యితరులకుఁ దక్కనేర దీయిందువదన 204

క. అని యిట్లు వదినె లంతయు, మునుకొని భీభత్సుసతిని ముద మొనరింపన్
వినయోక్తులు పల్కిన విని, కనకాంగి సుభద్ర వారిఁ గౌఁగిటఁ జేర్చెన్. 205

వ. ఇట్లు కౌఁగిలించికొన్న సుభద్రం జూచి మఱియు నిట్లనిరి. 206

సీ. గహనసీమకు నీవు కదలినదాదిగా రాకేందుముఖి నిద్ర రామ మాకు
అనిపల్కినంతలో నలివేణి యొక్కతె చనుదెంచి వినవమ్మ సారసాక్షి
యడవి కేఁగినవార్త లాలించినదిమొద లాహార మింపుగా దనుచుఁ బలికె
వెండియు నొకబోటి విజయుపత్నిని జూచి మాచెలి రారాజుసుతునిరూపు

తే. వానిరూపంబు తుడిచెఁబో వారిజాక్షి, వాయుసూనునిసుతుఁ డింతసేయకున్నఁ
బొలఁతి శశిరేఖ వ్యర్థమై పోవునమ్మ, కుక్క ముట్టినకుండ యై కుందరదన. 207

తే. అని వచించినవారిజాననలఁ జూచి, యలసుభద్రయు సంతోషజలధిఁ దేలి
యుచితయుంబగుభక్తితో నతు లొనర్చి, వదినెగారికి నత్యంతముద మొనర్చె. 208

సీ. ఆసమయంబునం దలివేణి శశిరేఖ చనుదెంచి జననులచరణములకు
మ్రొక్కి నిలచిన తనముద్దుపుత్త్రిని జూచి బలభద్రుఁ డానందభరితుఁ డగుచు
నాపుత్త్రి నాకూన నరభోజనుఁడు నిన్నుఁ దెచ్చినప్పుడు నెంత దిగులుపడితొ
మమ్ముఁ బాసి యావనమధ్యదేశంబున నెట్లు నిద్రించితొ యిందువదన
తే. శుభకరంబుగ నిను బార్థసుతున కిచ్చి, సిరులు విలసిల్లఁగాఁ బెండ్లిసేతు ననుచుఁ
బలుకుపలుకులు విని వచ్చి పార్థసుతుఁడు, హలికి హరికిని సాష్టాంగ మాచరించె.

వ. ఇట్లు సాష్టాంగనమస్కారంబు లొనరించిన సౌభద్రుం జూచి యత్యంత సంతో
షంబుతో నీలాంబరుండు తనమనంబున నిట్లని వితర్కించె. 210

సీ. కంతుజయంతసత్కాంతుల హసించు వరుస శృంగారంబు లరసి చూడ
శరజన్మగాంగేయజామదగ్న్యులఁ గేరు ఘనపరాక్రమశస్త్రకౌశలముల
అనిలనాగాంతకయహిరాజుల హసించు పటుతరం బగుబాహుబలమునందు
సద్బృందపూర్ణేందుచందంబులను గేరు భాసురం బగుకీర్తిపటిమలందు
తే. అహహా యిటువంటియల్లుని నడవి కనిది, కురునరేంద్రునిపుత్త్రునిఁ గోరినట్టి
జేలతనమును దనుఁ దాసె తూలనాడి, భూరిబలుఁ డైనహైడింబుఁ బొగడి పొగడి.

వ. తనసహోదరుఁ డైనగోవిందుం జూచి హలాయుధుం డిట్లనియె. 212

ఉ. ద్వారకఁ కేఁగుయత్న మిఁక దానవభంజన సేయవే యనన్
వారిజనాభుఁ డాక్షణమె వాయుసుతాత్మజుఁ జూచి వత్స నీ
భూరిపరాక్రమక్రమముఁ బూని నుతింపఁగ శేషుఁ డోపునే
ధారుణిఁ బాండుసూనులకు దైత్యశిఖామణి కీర్తిఁ దెచ్చితే. 213

వ. అని మఱియు నిట్లనియె. 214

క. దుస్తర మగుకార్యంబులు, నిస్తులశౌర్యంబుచేత నెరవేర్చినని
నృస్తుతి సేయఁగ బ్రహ్మకు, శక్తిగదా భీమపుత్త్ర ఘనవిభగాత్రా. 215

క. అనుజానివైవాహికముం, గనుఁగొనఁగా రమ్ము లెమ్ము గ్రక్కున ననిన
న్విని కరములు ముకుళింపుచు, దనుజారికి నిట్టులనియెఁ దద్దయు భక్తిన్. 216

సీ. అప్పటప్పటికి సన్గొప్ప సేయఁగ జేల పాటించి వినుము నామాట యొకటి
అసురారి నీకృపారసము నాపై నిల్పు కతమున శాత్రవు ల్కదనమందు
కృపణులై నాచేత నపజయం బొందిరి అదిగాక పాండవు ల్విదితయశులు
నిను నమ్మి మిక్కిలి ఘనులైరి మాధవ యని పల్కి సాష్టాంగ మాచరించి
తే. బిడ్డ నర్పించి సౌభద్రుఁ బెండ్లిసేయఁ, బాటుపడువారు మీరుండఁ బద్మనాభ
నేను రాకున్నఁ గార్యంబు నిలువనేర, దనిన విని పార్థనందనుం డాత్మఁ గుంది. 217

తే. అన్న రాఁడని చింతించునతనిహృదయ, మెఱిఁగి గోవిందుఁ డసురేంద్రు కరముఁ బట్టి
భీమసుత నీవు రాకున్నఁ బెండ్లియేల, ననుచుఁ జింతించు నీతమ్ముఁ డదిగొ చూడు.

క. అనిన విని దానవేంద్రుఁడు, తనతమ్ముని మోముఁ జూచి తమ్ముఁడ నీతోఁ
జనుదెంచెదఁ జింతింపకు, మని వెండియు నిట్టు లనియె నభిమన్యునితోన్. 219

సీ. జనకు లడవి నున్న సమయంబులో నీకుఁ బరిణయం బిపుడు సంప్రాప్తమయ్యె
తమ్ముఁడ నీభాగ్యదశ యేమిచెప్పుదు ననుచుఁ గన్నుల నీరు నతఁడు రాల్పఁ
జూచి పార్థునిరాణి జోటజోటఁ గన్నీరురాల్చిన వీక్షించి రమణు లెల్లఁ
బొక్కుచు విలపింపఁ బురుషోత్తము డు చూచి చెల్లెల నీవిట్లు చింత సేయఁ
తే. గారణం బేమి వినవమ్మ కంబుకంఠి, సమయకాలంబు గడచిన యమతనూజుఁ
డాదిగాఁ గలపాండవు లరుగుదెంతు, రిపుడు శుభకార్య మెడసేయ నెందుకమ్మ.

క. అని గోవిందుఁడు పల్కిన, విని సోదరి వగపు మాని వేఱొక టనకన్
తనమది సంతసమందుచు, తనయులమదిఁ జింతబాపె ధరణీనాథా. 221

సీ. అంత ఘటోత్కచుం డత్యంతసంతోషసహితుఁడై బలకృష్ణసాత్యకులకు
వారిభార్యలకును వరుస యాదవవీరవరులకు మఱి వారివనితలకును
దివ్యభూషణముల దివ్యాంబరంబుల దివ్యగంధంబుల దివ్యకుసుమ
ములను బూజలు సేసి ముదముతో మ్రొక్కిన భీమపుత్త్రునిఁ జూచి పెద్దప్రొద్దు
తే. నతఁడు చేసినసాహసం బాత్మ మెచ్చి, యోఘటోత్కచ వినుము ఈయుర్వియందు
ఘనుఁడవై వేయువర్షముల్ మనుమటంచు, వరుస దీవించి రప్పుడు వసుమతీంద్ర.

వ. ఆసమయంబున. 223

సీ. కమలాక్షుఁ డాఘటోత్కచునిఁ గైదండచేఁ దనరథం బెక్కించుకొనియె నపుడు
బలభద్రుఁ డంత సౌభద్రసహితుఁడయి రథ మెక్కెఁ దక్కినరథికవరులు
తమతమరథములు తా మెక్కి తఱిఁ గాంత లందఱు గుమిగూడి యూహిడింబి
మోము వీక్షింపుచు ముసిలిముత్తైదువ రమ్ము రమ్మని పిల్చి రథముఁ జేర్చె
తే. వారు తమతమయరదము లవ్వరుస నెక్కి, రంత బలరామకృష్ణు లాయడవిఁ బాసి
కడుజవంబున రథవారు లక్కరులు నడువఁ, బుడమి గంపింప ద్వారకాపురముఁ జేరి.

వ. ఏనుంగుమొగసాలకడ రథంబులు డిగ్గి నగరు ప్రవేశించి రామకృష్ణులు జననీజన
కులకు మ్రొక్కుసమయంబున సుభద్రాభిమన్యుఘటోత్కచు లరుదెంచి దేవకీవసు
దేవులకు మ్రొక్కినం జూచి దేవకీదేవి సుభద్ర కిట్లనియె. 225

క. పాపనిఁ దోడ్కొని హరిపైఁ, గోపంబున భీమ మైనఘోరాటవికిన్
ఏపగిదిఁ బోతివో గద, మాపైఁ గలమమత మాని మాపటివేళన్. 226

క. పన్నగమృగములఁ గనుఁగొని, పెన్నగములఁ గాంచి మదికి భీతి జనింపన్
వెన్నని నన్నుఁ దలంచితొ, పున్నమశశితుల్యవదన పొక్కుచు మదిలోన్. 227

వ. అని మఱియు నిట్లనియె. 228

సీ. కాంతారమున నిన్నుఁ గామపాలుఁడు పల్కు పలుకులు మది నిల్పవలవదమ్మ
ఇందీవరాక్షి మీ రితరులు గారు యీ పాలసాధనుం డన్న యనుజ వీవు
కొలఁతరో నీసొమ్ము నీయిల్లు చేరెను ప్రీతితో సుతునకుఁ బెండ్లిచేసి
నేఁ డాదిగా నీవు నీకుమారుండును వెనుపొందుసిరులతో మనుఁ డటంచు
తే. దేవకీదేవి పార్థునిదేవిహృదయ, సంకటముఁ బాపి యభిమన్యు సంతసమునఁ
బెంచుదువ్వుచు ముద్దాడి సొంపు మిగుల, నిందు వేడుక మిన్నందుచుండె నపుడు.

క. అని చెప్పిన ముదమందుచు, జనమేజయుఁ డిట్టులనియె సన్మునినాథా
వినవిన నామదిఁ గోరిక, ఘన మయి తనరారె నవలికథ యెట్టనినన్. 230

మత్తకోకిల. వారిజాసనపంకజాసనవందితా నతపోషణా
ధారణీధరతల్ప కేశవ దానవాన్వయశోషణా
నారదాదిమునీంద్రసన్నుత నాగభుగ్వరవాహనా
నీరజాక్ష కళింగమర్దన నీరదాంగ జనార్దనా. 231

గద్య. ఇది శ్రీమత్సూర్యనారాయణకరుణాకటాక్షవీక్షణాలంకార సుస్థిరామృతవాక్య జనితకవీశ్వరత్నాకరవంశ పయఃపారావార రాకాసుధాకర రాంజనేయాఖ్య తనూజ అప్పప్పనామధేయప్రణీతం బైనశశిరేఖాపరిణయం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము.



రాధాధరపరిమళ
సారామృతపానలోల సజ్జనపాలా
చారుమనీషాలోలా
సారసభవవినుతశీల స్వర్ణసుచేలా. 1

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పినట్లు వైశంపాయనుండు
జనమేజయున కిట్లనియె. 2

ఉ. సీరియుఁ జక్రియుం దెలిసి చెల్లెలిసూనువివాహయత్నులై
చారులఁ బంచి పట్టణముఁ జయ్యన సుందరమొప్పఁజేసి పల్
సారసుగంధపుష్పముల సంగ్రహమున్ దగఁ జేయఁ డంచు నా
కారుణికోత్తము ల్పలుక గ్రక్కున నేఁగిరి తత్ప్రియాత్ములై. 3

సీ. ఆసమయంబున నం దమరమునీంద్రుఁడౌ నారదుఁ డాత్మలో నవ్వుకొనుచు
నలఘుటోత్కచుశౌర్య మందందఁ దలచుచు నింపుగా వీణె మ్రోయించుకొనుచు
సారసాక్షుని దివ్యసంకీర్తనంబులు తోడిరాగంబుతోఁ బాడుకొనుచుఁ
బార్థపుత్త్రునిపెండ్లి బహువైభవంబుగాఁ దెలఁగుమార్గం బేను జేతు ననుచు

తే. గుఱుకువరువునఁ బోవుచు గోపురంబుఁ
గాంచి కాంచనవజ్రసంకలితమైన
మేటిమొగసాల గోపురాల్దాఁటిపోయి
విమలమైనట్టి యింద్రనీలముల చేత
డంబుమీఱిన కొలువుకూటంబుఁ జేరి. 4

సీ కపిలమార్కండేయకౌశికజాబాలిమైత్రేయపర్వతమందపాల
కణ్వకుత్సవసిష్ఠకౌండిన్యవరతంతుజామదగ్న్యయగస్త్యశౌనకాత్రి
భార్గవగార్గేయపైలకశ్యపపుల్హగాలవహారిదశ్వవాలఖిల్య
శుకమతంగవ్యాసబకదాల్భ్యమంకణకౌండిల్యుఁ డాదియౌ సకలమునులు

తే. ధనదుఁ డనిలుండు నీశాన్యుఁ డనలుఁ డాది, సురలు యక్షులు కిన్నరు ల్చుట్టుఁగొలువ
సర్జునునితోడ నేకసింహాసనమున, నింపఁ గొలువున్న దేవతానేతఁ గాంచె. 5

వ. ఇట్లు గాంచి యేతెంచునారదుం జూచి సురపర్వాధిపుం డర్జునసమేతంబుగా నెదురు
వచ్చి సాష్టాంగదండప్రణామంబు లాచరించి లోపలికిం దోడ్కొనిపోయి సింహాస
నాసీనుం జేసి సహస్రాక్షుం డి ట్లనియె. 6

క. మునిసార్వభౌమ మీరుక్, జనుదెంచిన నాదుపుట్టు సాఫల్యంబై
దనరారె ననుచు వెండియుం, వినయంబున నిట్లు లనియె విబుధేశ్వరుఁడుక్. 7

సీ. మాయజూదంబున మహి నెల్లఁ గోల్పోయి ద్వైతవనంబునఁ ధర్మజుండు
తమ్ములతోఁగూడ ద్రౌపదీసహితుఁడై ఘోర లక్షణముగఁ గుడుచు వేళఁ
బార్థుఁ డభవుతోడఁ బంచికై పోరాడి పాశుపతాస్త్రంబుఁ బడసి మఱియుం
దిక్పాలకులచేత దివ్యాస్త్రములుకొన్ని దత్త మందెన నందుఁ దలఁచి వచ్చి
తే. దేవమౌనీంద్ర విను పెక్కుదినము లయ్యె, ధర్మజాదులవిధ మేమొ దుర్మదాంధుఁ
డాసుయోధనుఁ డదయుఁడై యాచరించు, దప్పుపను లేమొ వివరించి చెప్పుమనిన. 8

క. నావిని మునిశంకరుఁ డా, దేవేశునిఁ జూచి పలికె దివిజాధిప స
ద్భావముతో నీ వడిగిన, యావిధ మెఱిఁగింతు వినుఁడు అర్జునుఁ డీవుక్. 9

సీ. పార్థపుత్రున కిచ్చు బలభద్రుపుత్త్రిని మందుఁ డౌ రారాజనందనునకు
నడిగి రమ్మని ధరామరులఁ బంపిన వారు పోయి తాలాంకునిపుత్త్రి నడుగ
నిచ్చెద నని మాట నిచ్చిన విని వచ్చి వెంఁది సుభద్ర తా వేఁడుకొనిన
తోడఁబుట్టును బెక్కుదుర్భాష లాడినఁ గోపించి యాయమకొడుకుతోడ
తే. వెడలి మిక్కిలిభయదమా నడవిఁజొచ్చి, రపుడు సౌభద్రుఁ డాఘటోత్కచునితోడ
సమర మొనరింప నంతలో సన్నుసీంద్రుఁ, డలవరాశరనందనుం డరుగుదెంచి. 10

సీ. భీమార్జునులు గన్నబిడ్డలు మీరంచుఁ బల్కఁగా విని భీముపట్టి వచ్చి
పిన్నతల్లికి మ్రొక్కి పిమ్మటఁ దమ్మునిక్ గౌఁగిటఁ గదియించి గారవించి
ఘనభయంకరమైన వనభూములకు మీరు నేతెంచుటకు నేమిహేతు వనిన
విని సుభద్రాదేవి వివరించి చెప్పఁగా దానవుం డుగ్రుఁడై తక్షణంబ
తే. ద్వారవతి కేఁగి తాలాంకుతనుజఁ దెచ్చి, తనవనంబున ముదముతోఁ దరుణి డించి
మరలఁ జని తానె శశిరేఖమాడ్కి నుండి, లక్ష్మణునిగంతు వేయించి రాక్షసుండు.

వ. అంతటం బోక నాఘుటోత్కచుం డనేకరూపంబులు దాల్చి దుర్యోధనాది కౌర
వుల కపజయం బొనరించినం జూచి బలరాముం డాదానవుని జయింపం జని యలవి
గాక దామోదరుం దోడ్కొనివచ్చి సౌభద్రునకు శశిరేఖ నొసంగెద మని రామ
కేశవులు ఘటోత్కచువనంబునకుం జని సుభద్రాభిమన్యులఁ దోడ్కొనివచ్చి సౌభ
ద్రునకు వివాహప్రయత్నంబు నిశ్చయంబు జేసి రని చెప్పి నారదుండు బిడౌజుం
జూచి మఱియు నిట్లనియె. 12

క. మనుమని వైవాహికముఁ గనుఁగొన దేవేంద్ర నీవు కడువిభవముతో
అనయముఁ దగుపార్థుఁ దోడ్కొని, చను మని వినిపింప సవ్యసాచికి మదిలోన్. 13

సీ. ముందుగాఁ దనపత్ని నిందించె నని చెప్ప రాజితంబై తోఁచె రౌద్రరసము
కొడుకుతో నిశివేళ నడచి కేఁగె నటన్న గణ్యమై తోఁచెఁ గారుణ్యరసము
అభిమన్యుఁ డసురేంద్రుఁ దనిచేసి రని చెప్ప బహుచిత్రముగఁ దోఁచె భయదరసము
అసురేంద్రుఁ డంగనాకృతి నుండె నని చెప్ప ధుర్యమై తోఁచె నాశ్చర్యరసము
తే. ఇంతెఁ గని లక్ష్మణుఁడు గంతు వేసె ననిన, నాకిరీటికిఁ దోఁచెఁ బో హాస్యరసము
మెచ్చి రాముఁడు ననుజఁ దోడ్తెచ్చె ననిన, సలలితంబుగఁ దోఁచెను శాంతరసము.

వ. ఇట్లర్జునుండు శాంతాత్ముం డగుచుఁ దనకుమారునివివాహంబు వీక్షించువాఁడై
యోచించుచున్నసమయంబున నారదుం జూచి సుపర్వాధిపుం డిట్లనియె 15

ఉ. దేవమునీంద్ర మంచిదని తెల్పితి రాత్మకు మోద మబ్బె రా
జీవదళాక్షునిన్ దివిజసేవితమూర్తిని చక్రపాణి శ్రీ
దేవుని దానవాంతకుని దీనదయాళుని జూచుకోర్కెసై
రావత మెక్కి పోదు యదురాజులవీటికి దేవకోటితోన్. 16

క. అని మఘవంతుఁడు పార్థుం, గనుఁగొని సౌభద్రుపెండ్లిఁ గనుఁగొను వేడ్కన్
వనజదళాక్షుని పురికిం, జనవలెఁ బయనంబు గమ్ము చయ్యనఁ బుత్రా. 17

సీ. అనిపల్కునిర్జరాధిపుఁ జూచి విజయుండు వాసవ యిది వనవాసవేళ
గనుక నేవచ్చినఁ గౌంతేయపూర్వజుం డనుమానపడు ధర్మహానికొఱకు
అని సంశయగ్రస్తుఁ డైనపార్థునిమదిసంశయం బెడబాపి శతమఖుండు
పత్నీసమేతుఁడై పార్థజయంతాదితనయులతోడఁ జౌదంతి నెక్కి
తే. కనకమణియుక్త మగుపుష్పకములమీఁద, సురలు మౌనీంద్రులెల్లను చుట్టు నడువ
నలిముదంబున రంభాదిసతులు గొలువ, వనజనాభునిపురి కేగె వాసవుండు. 18

వ. ఇట్లేఁగి ద్వారకాపురిసమీపవనంబున నిలిచి దేవదూతం బంపిన వాఁడుం జని రామ
కేశవులం జూచి పురందరుండు శచీసమేతంబుగా జయంతార్జునులతో నేతెంచినాఁ
డనిన విని వార లత్యంతసంతోషంబునం బొదలుచుండి రంత రుక్మిణీదేవి మొదలైన
కాంత లాసుభద్రం జూచి తల్లీ! నీకోరికప్రకారంబున పార్థుం డరుదెంచె నని
పల్కుసమయంబున రామకృష్ణులు పుత్రమిత్రాదిబాంధవులతో జననీజనకులతో నభి
మన్యుఘటోత్కచులతో రేవతి రుక్మిణీ సత్యభామాది కాంతలతో నెదురేఁగి వారి
వారికిం దగినయుపచారంబులు సేయుసమయంబున. 19

సీ. హైడింబుఁ డభిమన్యుఁ డరుదెంచి పార్థునిచరణంబులకు భక్తి సాఁగి మ్రొక్కి
ముకుళితహస్తులై ముంగిట నిలిచిన ముద్దుపుత్రుల జూచి పెద్దప్రొద్దు

కాంగిటఁ గదియించి గ్రక్కునఁ దొడలపై నిడుకొని వారితో నిట్టులనియె
అన్నదమ్ములపుత్త్రు లని యెఱుంగక మీరు భూరిరోషంబుతోఁ బోరి పోరి
తే. వరమునీంద్రు నికృపచేత వసుధ నుందు, బ్రతికితిరి మిమ్ముఁ జూచెడిభాగ్య మబ్బె
నని ఘటోత్కచు వీక్షించి యర్జునుండు, పరమసంతోషభరితుఁ డై పలికె నపుడు.

ఉ. పోరున ధార్తరాష్ట్రులకు భూరిమదం బడఁగించి పిమ్మటన్
సీరికి మిక్కిలిన్ భయము చెందఁగఁ జేసిన నీపరాక్రమం
బౌర! గణింప వ్యాళపతి కైనను శక్యము కాదటంచు నా
మారుతిపుత్త్రునిం బొగడి మక్కువతోడ గిరీటి యంతటన్. 21

క. పరమపరాక్రమపుత్త్రుల, మరిమరిబుధ వాసవునకు మ్రొక్కించినచో
సురపతి సంతోషితుఁడై, కర మరుదుగఁ జూచె వేయుకన్నులతోడన్. 22

వ. తదనంతరంబ సహస్రాక్షుండు రామకేశవులం జూచి భవద్దర్శనార్థంబుగాముని
బృందారక దినసంఘంబులతో నర్జునసమేతంబుగా నేతెంచితిమనిన గోపాలదేవుం
డిట్లనియె. 23

క. పురుహూత సురమునీశ్వర, పరివృతుఁ డై శచిజయంత పార్థాదులతోఁ
గర మరుదుగఁ జనుదెంచుట, పరముగ మా కింతకంటె భాగ్యము కలదే. 24

క. అని యిట్లు చెప్పఁదొడఁగిన, విని మది ముద మొందఁ జూచి వేల్పులదొర యా
వనజదళాక్షుని కిట్లను, దనుజాంతక మిమ్ముఁ జూడ ధన్యుఁడ నైతిన్. 25

క. అని యి ట్లమరాధిపుఁడున్, వనజాక్షుఁడు పల్కు వేళ వాసవి వేడ్కన్
తనపలియొద్దకు నేఁగిన, ఘనవేణి సుభద్ర పార్థుఁ గను గొని భక్తిన్. 26

వ. సాష్టాంగదండప్రణామంబు లాచరించి యుధిష్ఠిరభీమనకులసహదేవాది పాండవులను
ద్రుపదరాజపుత్త్రి యైన ద్రౌపదిం గుశలసమాచారంబు లడిగి పెన్నిధిం గనిన పేద
చందంబున సంతోషమగ్నమానస యై యుండె నప్పుడు. 27

సీ. అచ్యుతుం డాసురేంద్రాదులఁ దోడ్కొని పోయి వారలనెల్లఁ బొంకమైన
మందిరంబుల డించి మర్యాద లొనరించి యింద్రాణితోఁ గృష్ణుఁ డిట్టులనియె
పరిణయోత్సవకార్యపద్ధతుల్ జరిగింపు మన విని పౌలోమి యార్త నలరి
పార్థనందనునకుఁ బన్నీట జలకంబు గావించి దేవయోగ్యంబు లైన
తే. అంబరంబులుమణిభూషణములుదాల్చి, ముదముతోఁబారిజాతముల్ముడిచిమఱి యుం
దివ్యమైనట్టి కస్తూరితిలక మొప్పఁ, దీర్చి సఖులెల్ల వేడ్కతో దేవమాడ. 28

వ. అట్టిసమయంబున. 29

సీ. ముదముతో రుక్మిణి మొదలైనకాంతలు రేవతీసుత చంద్రరేఖ కెలమి
తలనంటి నలుగిడి తరువాత పన్నీట జలకంబు గావించి సరిగెపూల

చేలంబు ధరియించి లోలలోచన గురుల్ దువ్వి మేల్రాణి తొలుతఁ బెట్టి
కెంపులు నింపైన కేడిగె వెసఁ జేర్చి కొమరొప్ప నవరంపు గుప్పెఁ బెట్టి
తే. నిమురనై జగ్గువెంట్రుకల్ జడ నమర్చి, చెక్కడపుపసుపుబిళ్లలు చెక్కు మఱియు
భాసురం బైనబొగడలు బావిలీలు, నతులవజ్రాలకమ్మలు శ్రుతులఁ జేర్చి. 30

తే. రంగు లమరినపైఠిణీరవికఁ దొడిగి, యాణిముత్యాలకూర్చినసరముఁ దాల్చి
సరిగెముక్కరయుంచు బన్నసరము తీఁగె, మొదలుగాఁగలసొమ్ములు పదిలపరచి. 31

తే. రమణు లీరీతి వేడ్కతో రామసుతకు, పరమశృంగార మొనరించి పరిణయాపుఁ
బడఁతిఁ గావించి ప్రీతితోఁ బద్మముఖులు, సాతసిల్లుచు విహరించుసమయమునను.

క. సురపతి గని వాచస్పతి, సురుచిర మగులగ్న వేళఁ జొచ్చె నటన్నన్
పరమామోదము నొందుచు, పురుహూతుం డిట్లులనియెఁ బురుషోత్తముతోన్. 33

చ. పరిణయవేళ వచ్చె నిఁకఁ బంకజలోచన జాగు సేయకన్
త్వరితము సేయు మంచు మఘవంతుఁడు చెప్పిన నాలకించి య
మ్మురరిపుఁ డన్నకుం దెలుప మోదము నొందుచు సీరసాధనుం
డురుతరవైభవం బెసఁగ నుత్సవయత్నము సేయుచుండఁగాన్. 34

సీ. ఇంద్రనీలప్రభ లీనుభూషణరుచుల్ చూడ్కికి మిరుమిట్లు జొనుపునదియుఁ
పద్మరాగంబుల భాసిల్లుపదకంబు తప్ప కనుదుటిపై నొప్పునదియుఁ
హాటకమణిమయం బగునూపురధ్వనుల్ శ్రుతుల కానందంబు సేయునదియుఁ
హిమగిరిశరదిందు హీరతారద్యుతు ల్నిరసించు కాంతుల నెగడునదియుఁ
తే. నాల్గుకొమ్ముల విలసిల్లు నాగ మపుడు
దేవవిభు నాజ్ఞ దివిజులు తెచ్చి నిలుప
నింద్రుఁ డభిమన్యు నెక్కించి హితులు సుతులు
వెంట నడువంగ ముదముతో వెడలి రపుడు. 35

వ. రంభోర్వశీమేనకాదికాంతలు నాట్యంబు సేయుచు ముందు నడువఁ గాంచనవేత్ర
హస్తులు బరాబరు లొనరించుసమయంబున. 36

ఉ. అంతట రామకేశవు లహర్పతితేజు లరాతిభీకరు
లనంతసచిత్తులై సుతులు సఖ్యులు తమ్ములు భూసురేంద్రులున్
ఇంతులు వెంబడి న్నడువ నింద్ర కిరీటులు తోడరాఁగ న
త్యంతముదంబుతోఁ బరిణయాలయసీమకు నేఁగి రప్పుడున్. 37

క. బలరామపత్ని రేవతి, బలభిత్సుతుసతిని జూచి బహువేడుకతోఁ
గలకాలము సామదికిన్, గలకోరికె ఫలిత మయ్యెఁ గమలదళాక్షీ. 38

వ. అని యిట్లు రేవతీదేవి సుభద్రతో నన్యోన్యసంభాషణంబులు సేయుచుండె నాసమయంబునం దొకరికొకరు క్షేమసమాచారంబు లడుగుచు గంధపుష్పంబు లొసంగుచున్న తఱి సైనేయుండు ఘటోత్కచుం దిగిచి కౌఁగిలించుకొని సరససంభాషణంబుల నాదరించె నప్పు డప్పురజనంబులు బకాంతకతనూజుం జూచి వానిసాహసధైర్యాదిగుణంబు లగ్గించుచు నిట్లని రమరేంద్రాదిబృందారకులం గనుఁగొంటి మింతకంటెను భాగ్యంబు గలదే యిట్టికార్యంబులు గావింపఁ గౌంతేయులకుం జెల్లుఁ గాని యితరులచేత నగునే యని పలుతెఱంగులఁ బలుకుచుండి రాసమయంబున. 39

సీ. అంతఁ బౌరోహితు లత్యంతముదముతోఁ జక్కఁగా స్వస్తివాచనము లెసఁగఁ
జదువ ముత్తైదువల్ సంతోషచిత్తులై పరమకల్యాణము ల్పాడుచుండ
వందిమాగధులు కైవారముల్ గావింప నుర్వీగీర్వాణు లాశీర్వదింప
నాకాంగనామణు ల్నాట్యము ల్గావింపఁ దాళమర్దలవాద్యతతులు చెలఁగ
తే. విమల మైనట్టికల్యాణవేదిఁ జేర, నరిగినప్పుడు మాధవుం డమరవిభుఁడు
తెరకు నిరుపార్శ్వముల నిల్చి రిరువు రెలమి, నిండువేడుకమిన్నందుచుండి రపుడు.

క. సురపతిపౌరోహితుఁడున్, మురవైరిపురోహితుండు ముద మలరంగా
నిరువుర గోత్రాన్వయములు, సిరు లలరఁగఁ జెప్పె వేళ సీరాయుధుఁడున్. 41

వ. సంతోషమగ్నమానసుండై యప్పుడు. 42

క. క్షత్త్రియకులశేఖరునకు, ధాత్రీధరధైర్యధుర్యధనునకు రిపురా
డ్జైత్రుఁ డగుపార్థి కెలమిన్, పుత్త్రీమణి నొసఁగె సురలు భూసురు లలరన్. 43

వ. అప్పు డవ్వధూవరులమధ్యంబునం దిడిన తెర వంచి రాసమయంబున. 44

క. అభిమన్యుఁ డింతిఁ జూచెన్, ఇభగామిని యతనిఁ జూచె నిరువురచూడ్కుల్
ప్రభ లొప్పభూషణములై, యుభయులకుం దోఁచె నపుడు నుర్వీనాథా. 45

క. అంగజసముఁ డభిమన్యుం, డంగనకంఠంబునందు నతివేడుకతో
మంగళసూత్రముఁ గట్టెఁ ద,దంగన ముదమందఁ బార్థుఁ డానందింపన్. 46

క. అత్తఱి వేడ్క వధూవరు, లెత్తినకరకంకణంబు లినరుచు లీనన్
ముత్తెముల దోయిటను నిడి, చిత్తము లలరంగఁ బ్రాలు శిరముల నిడఁగాన్. 47

వ. ఆసమయంబున సీరాయుధుం డవ్వధూవరుల కనేకమణిమయంబు లగుభూషణంబులును పట్టుపైఠిణీచేలంబులును త్రిసహస్రతురంగంబులును జతుస్సహస్రదాసీజనంబుల నొసంగె నంబుజాక్షుం డాఱువేలరథంబులును ద్విలక్షతురంగంబులను మూఁడువేల గజంబులును లక్షపదాతిజనంబుల నొసంగె దేవేంద్రుండు దేవయోగ్యంబు లైనభూషణాంబరంబులను నవగంధపారిజాతంబుల నొసంగె శచీదేవి యింద్రనీలప్రభాభాసితంబు లైనభూషణంబు లిచ్చె ఘటోత్కచుండు

కనకకిరీటాదికుండలంబు లొసంగెఁ దదనంతరం బవ్వధూవరులఁ బౌరోహితుం
డౌదుంబరపీఠంబునఁ బ్రాఙ్ముఖాసీనులం గావించి సౌభద్రునిచే నాజ్యహోమంబులు
వేల్పించి వీతిహోత్రునకుఁ బ్రదక్షిణంబు చేయించి ధ్రువాదిసప్తఋషుల నరుంధతి
దర్శనంబు గావింప నియోగించి తత్పురోహితుం డయ్యురువురను బృహస్పతికి
మ్రొక్కించి తదనంతరంబ నారదాదిమునీంద్రులకు భూసుర సమూహంబునకు సురేం
ద్రాదిదేవతలకు రామకేశవాదియాదవులకు సవ్యసాచికిన్వేర్వేఱ మ్రొక్కించిన వార
లెల్ల నాశీర్వాదంబులు గావింప సౌభద్రుం డాశశిరేఖకరంబుపట్టి తోడ్కొని
యంతఃపురంబునకుం బోవునెడ శశిరేఖశృంగారంబు రంభాదికాంత లాలోకించి
యమ్మానిని సౌందర్యంబునకు సరిపోలం జాలమని లజ్జించుచుండి రివ్విధంబునఁ బరిణ
యంపు దినచతుష్టయానంతరంబున. 48

తే. అలవధూవరు లిరువుర నవ్వు డొకటి, సేయుకోరికె సంతోషచిత్తు లగుచు
శచియుం రేవతి రుక్మిణి సత్యభామ, మిత్రవిందాదికాంత లామిథునమునకు. 49

తే. శిరము మజ్జన మొనరించి జిలుఁగువలువ, చేలమున నొత్తి తడి యార్చి చిక్కుదీసి
వెలకుమించినభూషణవితతు లిడుచు, పట్టుపెఠిణిచేలము ల్గట్టి మఱియు. 50

క. పడకింటిఁ బూలపాన్పను, గడుఁ బరిమళ మైనగంధకస్తురిలేపం
బెడతెగనితావిసుమములు, విడియము ఫలహారవస్తువితతులు వరుసన్. 51

వ. కాంచనమణిమయంబు లైనపాత్రలం దిడి రుక్మిణీసత్యభామశచీదేవిమొదలైన
కాంత లాసౌభద్రుని శయ్యాతలంబున నుండ నియోగించి తదనంతరంబ శశిరేఖం
దోడ్కొనిపోయి సుభద్రానందనుచెంగట న్నిలిపి ముసిముసినగవులతోఁ గవాటబంధ
నంబు గావించి రాసమయంబున. 52

క. ఆలసౌభద్రుఁడు ముదమునఁ, గలకంఠికరంబుఁ బట్టి ఘనతల్పముపైఁ
బెలుచ న్దిగిచినఁ బయ్యెద, వలువ వెసం దొలఁగె నపుడు వనజాననకున్. 53

క. సిగ్గడఁ బోడమినఁ బాన్పన, కొగ్గక నాలేమ సురత మొప్పక కరమున్
జగ్గున విదళింపుచుఁ జన, దిగ్గన సౌభద్రుఁ డరిగి తెంపున దానిన్. 54

క. కర మొడిసిపట్టి వినవే, కరిగామిని పూలతోఁట గా దిచ్చోటన్
గురుతుగఁ జల్లనిమిత్తము, బరతెంచియుఁ ముంత దాఁచు పగి దిటఁ దోఁచెన్. 55

క. అని గేలిసేసి వనితన్, మనసిజకయ్యమునఁ గూడి మక్కువతోడన్
గనులార నిదుర నొందెను, వినుమూర్వీనాథ యంత వేకువ యయ్యెన్. 56

వ. అంత. 57

క. తెలతెలవారెను బక్షులు, కలకల మని ధ్వను లొసంగె ఘనచక్రములు
న్విలసిల్లెఁ గమలముకుళము, లలరారె న్పూర్వశైల మర్కుఁడు డాడిచెన్. 58

సీ. ఆసమయంబునం దలివేణి తెలివొంది వలియూర్పుఁ గైకొని పాన్పు డిగ్గి
మోవికాటులతోడ మోముపై వ్రేలాడు పాటముంగురులతోఁ బంకజాక్షి
చెదరినకొప్పుతో జిటిలినగంధంపుఁబూఁతతో వాడినపూలతోడ
ముసిముసినగవుతో ముడివీడురైకతో వెడలుచుఁ దడబడ నడుగులిడుచుఁ
తే. బుడమి జీరాడుకుచ్చెళ్లు నెడమచేతఁ, బట్టుకొని మందయాన యై యట్టె వచ్చు
నిందురేఖను గనుఁగొని యింతులెల్ల, గుట్టు లెడఁబాసి నవ్వుచు నిట్టులనిరి. 59

సీ. అద్దాలఁ గెరుసీముద్దుచెక్కులమీఁదఁ గసికాటు లేడవే కంబుకంఠి
దంబుమీఱినదివ్యబింబంబు సరిపోల్చు మోవి వాడిన దేమె ముద్దుగుమ్మ
నిస్తులం బైనట్టికస్తూరితిలకంబు చిట్లిపోయిన దేమె సింహమధ్య
అణిముత్యంబులహారము ల్మిక్కిలి చిక్కుఁబొందిన వేమె చిగురుఁబోఁడి
తే. కుందనపుగిన్నెలను గేరుకుచములందు, వాఁడియై సోకు నఖరేఖ లేడవమ్మ
కంచుకం బేలపగిలెనే యంచగమన, వంచనము లేక తెల్పవే వారిజాక్షి. 60

వ. అనిపల్కువారిజాక్షులం జూచి శశిరేఖ లజ్జించుచు ముసిముసిదరహాసంబుతో నచ్చోటు వాసి యంతఃపురంబునకుం జనియె నప్పు డంబుజాక్షుం డమరేంద్రప్రముఖు లైనగీర్వాణులతో నారదాదిమహామునిసంఘంబులతో సాత్యకికృతవర్మాదియాదవులతోఁ గొలువై యున్నసమయంబున బామోదరుం జూచి నారదమునీంద్రుం డిట్లని స్తుతియించె. 61

దండకము. శ్రీమానినీమానసాంభోజహంసాబ్జగర్భామరేంద్రాదిబృందారకస్తోత్రపాత్రా సుచారిత్ర రాజీవనేత్రా మురారీ పురారిప్రియా చక్రధారీ దినేంద్రాయుతానంతతేజా జగద్రక్షకా భక్తకల్పద్రుమా యాతుధానాన్వయాంభోదఝంఝానిలా నీమహాచర్య లేమందు పో ముందు మీనాకృతి న్దాల్చి వారాశినిం జొచ్చి వేదాపహారున్వసం ద్రుంచి వేదంబు లాబ్రహ్మ కర్పింపవా కూర్మరూపంబుతో మందరాద్రి న్వోపిరిం దాల్పవా దేవ భూదారమై స్వర్ణనేత్రు న్విదారింపవా నారసింహుండవై యాహిరణ్యాక్షుతోఁబుట్టువుం ద్రుంపవా గుజ్జురూపంబు వే పూని వైరోచనుక్ వేగఁ బాతాళముం జేర్పవా జామదగ్న్యుండవై రాజులం ద్రుంపవా భానువంశాబ్ధిచంద్రుండవై పజ్క్తికంఠుం ధరం గూల్చి భూజాతనుం దెచ్చి రాజ్యంబు పాలింపవా నందసూనుండవై వెన్నల న్మెక్కవా బుద్ధకల్క్యవతారంబులం దాల్పవా వాసుదేవా జగన్నాథ నే నెంతధన్యుండనో యీసురేంద్రాదిబృందారకు ల్మందు నేస్నాన మేదాన మేయోగ మేలాగు గావించినారో మిముం జూడఁగా గల్గె వైకుంఠవాసా నమస్తే నమస్తే నమః. 62

క. అని నారదుఁ డివ్విధమున, వనజాక్షుని సన్నుతించి వారిజనాభా
పరిణయ మొనరె నని పల్కుచు, మునిసంఘముతోడఁ జనియె మనమలరారన్. 63

క. అమరేంద్రుఁ డంత ముదమునఁ, గమలోదరు మోముఁ జూచి కరము మొగుచుచున్
అమరావతీపురమునకుఁ, గమలేశ్వర మమ్ముఁ బంపు కారుణ్యముతోన్. 64

క. అని యింద్రుఁ డాడుసమయంబున పార్థుఁడు శౌరిపాదపుష్కరములకు
న్వినయమున మ్రొక్కి దేవా, పనివినిగొంద నందుఁ బల్కి పయనంబయ్యెన్. 65

వ. ఆసమయంబున. 66

క. నాకజులెల్లన్ గొల్వగ, పాకరిపుం డరుగువేళఁ బార్థుం డమరా
నీకముతో శరచయములు, చేకొను సంకల్ప మాత్రఁ జేయుచు నేఁగెన్. 67

వ. ఇవ్విధంబున నింద్రార్జును లమరావతికిం జనినపిమ్మట హిడింబానందనుం డచ్చోటం గొన్నిదినంబు లుండి రామకృష్ణులకు సుభద్రాదేవికిన్ మ్రొక్కి సౌభద్రుం గౌఁగిలించుకొని గమనోన్ముఖుండై ద్వైతవనంబునకుం జని యుధిష్ఠిరభీమనకులసహదేవాదులకు ద్రౌపదికిం బ్రణామంబు లాచరించి ద్వారకాపురంబునం జరిగినవృత్తాంతం బాద్యంతంబు వినిపించిన విని యుధిష్ఠిరాదిపాండవులు సంతోషసాగరంబునం దేలి ఘటోత్కచునిపరాక్రమంబునకు మెచ్చి పార్థునిరాక నిరీక్షించుచుండి రని వైశంపాయనుండు మఱియు నిట్లనియె. 68

క. ఈకథ వినుజనములకున్, లోకప్రభుఁ డబ్జపత్రలోచనుఁ డమరా
నీకముఁ బ్రోచిన కృష్ణుఁడు, ప్రాకటముగ సిరు లొసంగి భవములఁ బాపున్. 69

మత్తకోకిల. వేణునాదవినోద మాధవ వీరదానవమర్దనా
బాణబాహుసహస్రపర్వతపాకశాసనసాధనా
స్థాణుబాణ సుపర్ణవాహన సామజాధిపరక్షకా
క్షోణిభృద్ధర వారిజోదర సోమభాస్కరలోచనా. 70

గద్యం. ఇది శ్రీమత్సూర్యనారాయణవీక్షణాలంకారసుస్థిరామృతవాక్యజనితకవిత్వరత్నాకరవంశపయఃపారావారరాకాసుధాకరాంజనేయాఖ్యతనూజ అప్పనామధేయప్రణీతం బయినశశిరేఖాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము సర్వంబును సంపూర్ణము.

శశిరేఖాపరిణయము సమాప్తము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1928.